# ఆలోకన

## చాగంటి సోమయాజులు



కూర్పు : చాగంటి తులసి

చాసో స్ఫూర్తి ప్రచురణలు, విజయనగరం

## విషయసూచిక

### ఆలోకన - చాసో



### చాసో వ్యాసాలు

# ఆలోకన - చాసో

## 1. శతకోటి వందనాలు

- రామినాయుడ్ని

వెలుగు, సాహితీ సాంస్కృతిక సంస్థ, విజయనగరంకి గౌ॥ అధ్యక్షులు చాగంటి సోమయాజులుగారు. ఆ మాట తీసుకున్నపుడు చుట్టమాటున చాసో మీరు చిరునవ్వు చూడదగిందే. పలుప్రజాహిత, సాహితీ, సాంస్కృతిక కార్యక్రమాలతో తన ప్రత్యేకత నిలబెట్టుకొని విజయనగరం సాహితీ అభిమానుల అభినందనలను అందుకుంది వెలుగు. సమస్త తెలుగు ప్రపంచాన్ని విజయనగరంకేసి తిప్పిన సందర్భాలెన్నో వెలుగుకి సొంతం. అలా అని ఎప్పుడైనా చాసో సెబాసని మెచ్చుకుంటారా అంటే అదీ గగనమే. మా కార్యక్రమాలని మాత్రం నిశితంగా గమనిస్తున్నారని మాత్రం మేం ఎప్పుడూ మర్చిపోలేదు. ఆయన సలహాలెప్పుడూ నిష్కర్షగానే ఉండడం కన్యాశుల్కం-నూరేళ్ళ పండగ నిర్వహణలో మాకున్న గొప్ప అనుభవం. ఓసాయింకాలం బొంకుల్దిబ్బ దగ్గర పరుగులాంటి నడకతో చాసో "ఎందుకాతొందర ఇలా విందూ" అని ఎవరో పిలుస్తుంటే "వెలుగు కార్యక్రమం అధ్యక్షులు ఆలశ్యమయినా సభ ప్రారంభమయిపోతుంది" అన్నారని మాకు తెలిసి, అదీ చాసో మాకిచ్చిన మెచ్చుకోలని మురిసిపోయాం. అభ్యుదయాంశం సరే ముఖ్యంగా మహాకవి గురజాడ కోసం ఆయన అడుగుజాడలు వెతుక్కుంటూ వెలుగు పడ్డ తపన విజయనగరం మరువలేదు గాక మరువలేదు. మరీ ముఖ్యంగా కోటలోజె.వి.అన్నదమ్ముల కన్యాశుల్కం నాటకం ప్రదర్శన. 1981లో రాయగడ నుంచి బదిలీ అయి విజయనగరం రావడంతోనే, గురజాడ అప్పారావు గారు నడిచిన

నేలమీద నడుస్తున్నామని, ఆయన పీల్చిన గాలి పీలుస్తున్నామని... అదో అపురూపమయిన పులకరింత. తీరా విజయనగరంలో చూస్తే గురజాడ ఉనికి అంతగా కానరాని వాతావరణం. మధురవాణి, పూర్ణమ్మ, కన్యక, కమలిని, నాంచారమ్మలకు జన్మనిచ్చిన ఇంట్లో ఎవరెవరో అద్దెకుంటున్న సంగతి, అసలానాటికి ఆ వీధి పేరే షరాఫ్ ఖానావీధి, చెప్పొద్దు బాధనిపించింది. మహారాజా కాలేజీ విద్యార్థిగా విజయనగరం కొత్తగాకపోయినా ప్రగతి-రాయగడ, వికాసం-బరంపురం, భారతి-జయపురం, కవిత-ఖురదారోడ్డు, సాహితీ సంబరాల్లో ఉప్పల లక్ష్మణరావు గారి నడకలోనడకగా కుర్చీలు సర్దడం, పోస్టర్లు అంటించడం, కరెంటుపోల్లెక్కి బేనర్లు కట్టడంలోచేయి తిరిగుందేమో, ఆ తీట కొద్దీ విజయనగరంలో కూడా ఓ వెలుగు వెలిగిద్దామని ఇలా వెలుగైవెలిగాం. వెలుగుని విజయనగరం ఆదరించింది. తీర్చిదిద్దింది.గౌరవించింది. విజయనగరానికి వందనాలు.

వందేళ్ళకి పూర్వం దర్పంతో చాగంటివారి హవేళీ, అదే అందంతో వాలుకుర్చీ, అదే ఠీవితో చాసో చుట్ట పారవశ్యం దేనికి ముందుదండం పెట్టుకోవాలో నిదానిస్తుండగానే చాసోతో నేస్తం కుదిరింది. అదెంతదూరం పోయిందంటే, చాసో కబుర్లు, అమ్మచేతి ఫిల్టర్ కాఫీ వ్యసనమై కూచవడమేగాదు " రేపు అమ్మాయిని కూడా భోయినానికి తీసుకురాకపోతే ఊరుకునేది లేదబ్బాయి'' అంటూ అమ్మహుకుం జారీ అయ్యే వరకూ వెళ్ళింది. శ్రీశ్రీ,నారాయణబాబు, ఆరుద్ర, రోణంకిగార్ల మాట కచేరీకి వేదిక చాసో హవేళీలోకి అడుగు పెట్టడానికి బెరుకుబెరుకుగా తచ్చాడే నేను సతీ సమేతంగా చాసో సరసన అయింటి వంటింట్లోనే అమ్మ కొసరి కొసరి వడ్డిస్తుంటే... " తీపి తేనియ బరువు మోయలేదీ బతుకు'' పాత విషయాలు ముచ్చట్లు, ముచ్చట్లుగా చెప్పుకుపోతున్న చాసో చుట్టపరవశం. కనిపెట్టి

"చిన్న కోరిక''

"ఏంటటా?''

"ముందుమాటివ్వండి''

"ఏంటో చెప్పొచ్చుకదా?''

"మీ జ్ఞాపకాలు రికార్డు చేసుకోవాలి''

"అందరికీ తెలిసినవే. కొత్తవేం వుంటాయి?''

"మీ జ్ఞాపకాలు మీవేగదా. మీరు గాక మరెవరు చెప్పాలి"

"సరే చూద్దాం"

"టేపురికార్డు పట్టుకొస్తాను, మీకిష్టం లేకపోతే వెళిపోతాను" ప్రతి ఆదివారం ఉదయం తొమ్మిది గంటలకు మరో పనిలేదు. ఇవేగాక మరి కొంత చెప్పుకొచ్చును. గాని వాళ్ళ చిన్నబ్బాయి శంకరం గారు వస్తే మరి నన్ను పట్టించుకున్నారుగాదు. ఏం బేహద్దీ! సరే ఆమాత్రం చెప్పడమేగొప్ప!

రాయతగ్గవారు ఎందరో వుండీ కూడా నన్నే రాయకతప్పదన్న డా.తులసి గారికి ధన్యవాదాలు.

చాసోకి. శతకోటి వందనాలు.

# ౨. ప్రారంభాలు (నేను - నా స్నేహితులు)

పుట్టిం దగ్గర్నుంచి మనిషికి పొడ్డం వస్తుంది. కాళ్లూ చేతులూ కలిపి గెంతడం వస్తుంది. అంటే నృత్యం! అలాగ్గానే కాస్త భాషాజ్ఞానం వచ్చిందగ్గర్నుంచీ స్వతంత్రంగా ఏదో ఒక వాక్యం అనుకుని, దానికి అర్థం ఉన్నా లేకపోయినా, కవిత్వంగా సృష్టించుకోవడం కూడా మనిషి చేస్తాడు. అంటే సాహిత్యం సహజంగా ప్రతి మనిషిలోనూ ఉంటుంది. దానిని బహిర్గతం చేయడానికి ప్రయత్నం కూడా చిన్ననాడు చేయడం, మనం కాస్త జాగ్రత్తగా పరిశీలిస్తే ప్రతి పిల్లడిలోనూ పిల్లలోనూ కనబడుతుంది. అందుచేత సాహిత్యం పుట్టుకతోటే వస్తుంది. సర్వసాధారణంగా కవి జీవితాల్లో, సాహిత్యవేత్త జీవితాల్లో నా పదో ఏటో, తొమ్మిదో ఏటో నేనేదో రాసాననో, నేనేదో పాడానని చెపుతూ ఉంటారు. అది సహజమే. కవి, సాహిత్యవేత్త కానివాడు ఆ గుణం కలిగే ఉంటాడు. కాని అది బహిర్గతం కాదు. ఎంచేతా అంటే కాస్త పెద్దవగానే ఆవ్యావృత్తి మానేస్తాడు. ఈ కవిత్వం, సాహిత్యం అంటే అభిరుచి ఉన్న కవి ఉన్నాడే వాడు దానిని వృద్ధి చేసుకుంటాడు. అంచేత నాకు చిన్నప్పట్నుంచీ, నా వయస్సు నాకు తెలియదు, ఎప్పట్నుంచో కానీ, సహజంగా కవిత్వం సైడు మనస్సు కలిగి ఉండేవాడ్ని.

నేను మూడో ఫారం చదువుతున్నాను. ఆరోజుల్లో మూడో ఫారం వుండేది. అంటే అప్పుడే మూడోఫారానికి వెళ్లాను. నేను ఓ పద్యం చదివి ఏదో మాట అన్నాను తెలుగు మాస్టారి క్లాసులో. అప్పుడు మా మాస్టారు "ఏం, నువ్వు పద్యాలు రాస్తావేంటిరా?" అన్నారు. 'చెబితే నేర్చుకొంటాను. రాయాలనే ఉంది' అన్నాను. 'అయితే మా ఇంటికి రా' అన్నాడు. వాళ్లింటికి వెళ్లాను. "ఒరే ఇప్పుడు కాదు. దసరా

సెలవులొస్తున్నాయి కదా దగ్గర్లో, అప్పుడురా'' అన్నారు. మంచిదని దసరా సెలవులు వచ్చిన మొదటి రోజునే పొద్దున్నే ఏడుగంటలు కాకుండానే చల్లన్నంతిని వాళ్ల ఇంటికి వెళ్లాను. ఆయనేమో నాతో మాట్లాడే స్థితిలో లేడు. వాళ్ల నట్టింట్లో కూర్చొని ఎదురుగుండా వ్యాసపీఠం పెట్టుకొని వాల్మీకి రామాయణం పారాయణం చేస్తున్నాడు. ఎదురుగుండా ఆడవాళ్లెక్కువా మగవాళ్లు తక్కువ కూర్చొని నట్టింటి నిండా ఉన్నారు. తొందరగా అది పెందరాడే అవుతుందనుకొన్నాను. పది, పదకొండు గంటలదాకా ఆయన పారాయణ చేస్తున్నారు. ఆయన దసరాల్లో సంపూర్ణంగా రామాయణం చదివి ఆఖరి రోజున చిన్న అన్నదాన సంతర్పణ చేసి దానిని ముగిస్తారు. ఆ విషయం ముందర నాకు చెప్పలేదు. నేను పొద్దున్నే వెళ్లాను. సంజ్ఞ చేసారు కూర్చోమని. నేను కూర్చున్నాను.మరి కదల్డానికి వీల్లేదు.

ఆయన ధర్మమా అని రామాయణం కొన్ని శ్లోకాలు చదివి తదనుగుణంగా, కథ ఏమిటో - అక్కడ ఉన్నవాళ్లకి- సంస్కృతం రాని వాళ్లే ఎక్కువ మంది కదా - చెపుతూ చాలా త్వరగా రామాయణం పూర్తి చేసాడు.

ఆయన ఏం చెప్పాడూ - 'ఒరేయి, నేను సంపూర్ణంగా రామాయణం పూర్తి చేయాలి. మొదటి నుండి చివరిదాకా రోజూను ఉదయంపూట. రోజూ నాకు పూజకు పూలు కావాలి. ఓ బుట్టతో బుట్టెడు పూలు పత్రా అన్నాడు. మా ఇల్లు చాలా పెద్దది. - అరెకరం భూమి-తోటలో మేం ఉండేవాళ్లం ఆమధ్య ఇంట్లో. ఆ పువ్వులన్నీ చచ్చినట్టు కోసి అవి పట్టుకునెల్లి ఆయనకిస్తూ ఉండేవాడ్ని. ఆయనొకనాడు మధ్యాహ్నం నాకు పద్యాలు రాయడం ఎలాగో చెబుతానని కూర్చో బెట్టాడు. ఆయనేం చెప్పాడంటే ఒక సంస్కృత శ్లోకం చెప్పాడు. ఆ సంస్కృత శ్లోకం అందరూ ఎరిగినదే. అది-

ఆది మధ్యావసానేషు భజసా గౌరవం యాన్తి
యరతా యాన్తి లాఘవమ్ మనోతు గురు లాఘవమ్

అంటే మొదటి గురువు, రెండో గురువు, మూడోగురువుంటే ఏఏ గణాలో, మొదటి లఘువు, మధ్య లఘువు, చివర్నలఘువుంటే ఏ గణాలో మూడు గురువులు, మూడు లఘువులూ ఉంటే ఏ గణాలో ఆ శ్లోకంలో ఉంది. అది మాత్రం చెప్పారు. ఇంకేం చేయాలీ అంటే నువ్వో పద్యం తీసుకో, తీసుకొని మూడేసి మాటలు కాదు, మూడేసి పదాలు కాదు, మూడేసి అక్షరాలకి గీతలు మార్కు చేసుకొని ఏది ఏగణమో

మీదను రాసుకొని రమ్మన్నారు. మంచిదన్నాను. ఆ మర్నాడు ఏవో మూడో నాలుగో ఉత్పలమాలలో, చంపకమాలలో, శార్దూలాలో ఏవో పట్టుకొని అన్నీ విభజన చేసి పట్టుకెళ్లాను. "ఇదేంటండీ కొన్ని మిగిలిపోయాయేంటండీ?" అంటేఅది లగం అనీ లఘువూ గురువూ అనీ, కొన్ని గురువులు మాత్రమేనని,కొన్ని అలా ఉండిపోతాయని చెప్పారు. ఇక్కడయతి స్థానం ఉంది అనీ చెప్పారు. "మాస్టారూ యతిస్థానం అంటే ఏమిటీ?"అంటే 'పద్యం చదువుతున్నప్పుడు అక్కడ విరుగుతుంది. అది విరామస్థానం, పద్యానికి విరామం ఉంటుంది. అక్కడవిరుగుతుందది అక్కడ అక్షరమైత్రి ఉంటుంది' అని చెప్పాడు. తర్వాత ప్రాస కూడా ఉంటుంది కదా, యతిప్రాసలు అన్నీ చెప్పారు. ఇంకా అలానే రాయి అన్నారు.

మరో రెండు రోజులు రాసి వెళ్లిన తర్వాత - మాస్టారూ ఇవన్నీ రాసాను, బోధపడ్డాది. ఇంకేం చేయాలీ? ఆ వరసలో భరన భభరవ వరసలోరాయి అన్నారు. అదెలా రాయాలీ? మనకు కావాల్సిన అర్థంలో భగణం ముందుపెట్టి తరవాత రగణం పెట్టి తరవాత నగణం పెట్టి ... అలా ఎలా రాయాలో చెప్పండి మాస్టారూ! అంటే

"భాషా పాండిత్యాలు ఉండాలిరా. తెలుగంటే ఏంటనుకొన్నావు? సంస్కృతంలో సంపూర్ణంగా జ్ఞానం వుండాలి. తెలుగులోనూ జ్ఞానం ఉండాలి. మామూలుగా ఎలాగొస్తుందీ. అందుకే వాళ్లు మహాకవులూ... అని ఘట్టిగా అన్నారు. ఎంత భాషా జ్ఞానం ఉంటేవస్తుందీ? మామూలుగా పట్టుబడవు. నాకు ఆయన చెప్పింది ఎక్కడా సాధ్యంగా కనపడలేదు. అంతభాషాజ్ఞానం నాకప్పుడే ఎక్కడొస్తుంది. లేదు. మరెలాగ? "చదువుకోవాలిరా" అన్నారు. అంటే ఏవిటీ? పద్యాలు రాయటం చెబుతానన్న తెలుగు మాస్టారు పద్యాలు రాయటం అసంభవమని నాకు చెప్పారు. అయితే ఇందులో విశేషమేమిటంటే ఆయన చెప్పిన దాంట్లో ఒక విషయంమాత్రం నాకు జ్ఞాపకం ఉంది. విరామస్థానం, యతి అని చెప్పారు. అదొక్కటే నాకు నచ్చింది. ఇప్పటికీను! కానీ అసలు సంగతేమిటంటే పద్యం ఎలా రాయడమో ఆయన చెప్పలేదు. ఎందుకు చెప్పలేకపోయాడని తరువాత ఆలోచిస్తే ఆయనకు పద్యం రాయడం రాదు. పద్యం అంటే ఏంటో తెలీదు. రాయడం ఏంటో తెలియనాయన నాకేం చెప్పగల్డు? గణాలొకటే చెప్పాడు. అదీ సంస్కృత గణాలేచెప్పాడు. మాత్రా ఛందస్సు చెప్పినా బాగుణ్ణు. అది చెప్పలేదు. నాకు సాధ్యపడదనిన్నీ, నాకు రాదనిన్నీ, అసంభవం చాలా భాషాజ్ఞానం ఉండాలి అనిన్నీ చెబుతూ ఉంటే ఇక వెళ్లటం మానేసాను. నేనింకా

స్కూల్ ఫైనలు చేరలేదు. ఇదంతా శ్రీకాకుళంలో. నాకు సాధ్యపడదు ఇది. ఈ విద్య నాకు రాదు. అసంభవమూ ఇది. చాలా భాషాజ్ఞానం ఉండాలిట. అనుకొని ఆ ఊసుకూ ఆ జోలికి వెళ్లడం మానేసాను.

విజయనగరంలో స్కూలు ఫైనలు కస్సా హైస్కూలులో పాసై కాలేజీలో చేరాను. విజయనగరంలో ఇంటర్మీడియేట్ చదువుకొంటున్నప్పుడు నాతోటి విద్యార్థుల్లో నలుగురైదుగురు పద్యాలు రాస్తూండే వారు. అందులో చాలా ప్రసిద్ధమైన కవి అయినవాడు మోటూరు వెంకట్రావు నా క్లాసుమేటు. వాడు వృత్తాలు ఎలా పడితే అలా రాసేసేవాడు. స్కూలు ఫైనలు టెక్స్టులో మాకు ఎవరో శంకరగిరి గాడి పద్యాలు ఉండేవి. ఆ పద్యాలకే అటునుంచి ఇటు, ఇటునుంచి అటు, తిరగేసి ఆ పద్యము యొక్క సమాసాన్ని అటు నుంచి ఇటు పెట్టేసి వాడు వృత్తాలు రాసిపారేస్తున్నాడు. 'ఇది ఎలాగా' అని నేనంటే వాడు నాకు చెప్పాడు. ఏదో ఒక మార్గం. ఇలాగే అనుకుంటూ రాయాలని ఏదో చెప్పాడు. వాడు చెప్పింది సవ్యంగానే ఉంది. అయితే అదే సమయానికి ఇంగ్లీషులో మాకు ప్రాజెడీ (Prosody) చెప్పాడు ఒక మాస్టరు. గ్రామరు స్కూలు ఫైనల్‌లో చదివాం. ఇంటర్‌మీడియట్‌లో రెటెరిక్కు (Rhetoric) అని ఓ క్లాసు ఉండేది. అందులో వాళ్లు ఏం చెప్పేవారు అంటే వాక్యరచన, పేరాగ్రాఫ్ రచన, పద్యం రాయడం ఇవన్నీ చెప్పేవారు. అందులో ప్రాజెడీ కూడా ఉండేది. అంటే ఛందస్సు. 'తెలుగు ఎందుకు మనం తంటాలుపడడం. ఇంగ్లీషు పట్టుకుందాం' అని ఇంగ్లీషు మీటరుని క్షుణ్ణంగా చదువుకోవడం మొదలుపెట్టాను నాకు నేను. ఆ దసరాలోపునే ఇంగ్లీషు పద్యాలు రాసేసేవాడిని. ఇంగ్లీషులో గణాలు ప్రధానమైనవి నాలుగు ఉన్నాయి. ఆ నాలుగు క్షుణ్ణంగా చదువుకున్నాను. అంత్యనియమం ఉంటుంది - అదే రైమ్ (Rhyme) - దానిని పట్టుకుని పద్యాలు రాస్తూ వచ్చాను. ఇంగ్లీషులో పాల్‌గ్రేవ్‌ది గోల్డెన్ ట్రెజరీ (F.T. Palgrave The Golden Treasury) అని ఒక పుస్తకం వుంది కదా - అందులో మూడవ వంతు పద్యాలు నాకు కంఠస్థంగా వచ్చేవి. ఆ పుస్తకాన్ని పట్టుకుని ఇంగ్లీషులో రైములన్నీ రాస్తూ వచ్చాను. సక్సెస్‌ఫుల్‌గానే ఎక్కడా పొరపాటు లేకుండా ఈ చివరనుంచి ఆ చివరదాకా పద్యాలు ఆ దసరా నాటికే రాస్తూ వచ్చాను. ఇంగ్లీషులో సంతృప్తికరంగా - అంటే ప్రాస సరిపోయేది. మీటరు అంటే ఛందస్సు సరిపోయేది. రైమూ అంటే అంత్యనియమమూ సరిపోయేది. అన్నీ సరిపోయాయి కాని అది కవిత్వం కాదని నా

మనస్సు నాకు చెపుతూ ఉండేది. అందులో ఉన్నది కవిత్వం కాదు అని చెప్పేది.

"It is not Prosody alone that Makes it a poem" అని ఇంగ్లీషులో ఒక వాక్యం ఉండేది. ఆ వాక్యం నా చెవిలో ఎలాగో పడింది. అది సిడ్నీ రాశాడు. విక్టోరియన్‌కవుల్లోని సిడ్నీ రాసిన ఆ వాక్యం నాకు తెలుసు. అందుచేత అదే దృష్టితో 'నేను రాసినది ఇది కవిత్వం కాదు. ఇవి ఛందస్సులో రాయబడ్డవాక్యాలు' అనే విషయం నాకు తెలుసు. అయితే దీనితో నాకు ఒక స్నేహం మంచిది కుదిరింది. నాకు సుంకరి మల్లికార్జునస్వామి అనే క్లాసుమేటు ఉండేవాడు. వాడు కవి. వాడిని కొండదొర అనేవాడ్ని. వాడు తెలుగులో పద్యాలు రాస్తూ ఉండేవాడు. సాధారణంగా ఓ పద్ధతిలో రాసే దానిని ఆ పద్ధతిలో ఎక్కువ రాసేవాడు. భావకవులను పట్టుకుని పద్యాలు తేటగీతో, ఆటవెలదో, ద్విపదో ఏదో ఓదానిని ఏ ఐదో ఆరో ఏడో రాసి ఓ చిన్నపేరు పెట్టి 'ఖండకావ్యం'అని రాస్తుండేవాడు. వాడికి సింగిల్ పన్నా కవి అని పేరు పెట్టాను. 'సింగ్‌ల్‌పన్నా' అన్న మాట నాది కాదు. దేశంలో ఎక్కడ నుంచో వచ్చింది. అది నా చెవిలో పడ్డాది. అంచేత వాడికి ఆ పేరు పెట్టాను. తేటగీతిలోనో, ఆటవెలదిలోనో ద్విపదలోనో ఏవో ఓ పదో ఐదో ఆరో ఎన్నో చరణాలు రాసి పాపం ఓ పోయెం చేసేవాడు. వాడు ఓ లాడ్జిలో ఉండేవాడు. ఇరవైనాలుగుగంటలూ నేనూ ఆ లాడ్జిలోనే ఉండేవాణ్ణి. వాడితోపాటు పక్కగదిలో అదే లాడ్జిలో రోణంకి అప్పలస్వామి ఉండేవాడు. ఆయన అప్పటికే ఇంగ్లీషులో మేధావి. B.A. మొదటి సంవత్సరం చదువుతున్నాడు. అతను ఎంత మేధావి అంటే ఆనాడు మాకు పాఠం చెపుతున్న ఏలెక్చెరరుకీ అతనికి ఉన్నంత ఆంగ్ల భాషా జ్ఞానము లేదు అని నేను చెప్పగలను. పుస్తకం తర్వాత పుస్తకం డిక్షనరీలోఅర్థాలు చూస్తూ అదే పనిగా చదివేవాడు. చదివి భాషలో మాస్టరీ సంపాదించాడు. తరువాత పద్యాలు స్వేచ్ఛగా రాసేవాడు. అతనికీ మీటరు వచ్చును. పద్యం రాయడం వచ్చును. అంతేగాక ఇంగ్లీషులో ఉన్న ప్రధానమైన విషయం దానికి Stress ఉంటుంది. అంటే ఊనిక. ఆ ఊనిక మీద ఆధారపడి ఆ భాషలో ఛందస్సు ఉంటుంది. ఆ ఊనిక మన తెలుగులో లేదు. ఆ ఊనికలు ఎక్కడ ఉంటాయి. ఎలా ఉంటాయి. అనేది నేను, నా అంతట నేను చదువుకుని తెలుసుకుని పద్యాలు రాసాను. అతను అందులో బాగా మాస్టరీ సంపాదించాడు. కృతకృత్యడయ్యాడు. నేనూ కృతకృత్యుడనేకాని అతనంత కాదు. నాకు భాషాజ్ఞానం లేదు. భాషాజ్ఞానం లేకుండా కవిత్వం చెప్పవచ్చు.

పద్యాలు రాయవచ్చు. అనేది నేను నేర్చుకున్నాను. అందుచేత రాస్తున్నాను. నా క్లాసుమేటు ఈ సుంకరి మల్లికార్జునస్వామి ఏం చేశాడూ అంటే నేను రాసిన ఆ పద్యాలు చదివి రోణంకి కొంచెండాబు చేస్తూ ఉంటే 'ఓ,మా సోమయాజులూ రాస్తాడు. ఇంగ్లీషులో పద్యాలు' అన్నాడు. "ఇంగ్లీషులో పద్యాలేంటి, సోమయాజులేంటి, రాయడమేంటి ఇక్కడెవరూ రాయలేరు. మన లెక్చరర్లే రాయలేరు ఛ ఫో' అన్నాడు. 'అయితే నీకు పరిచయం చేస్తాను. మీ ఇద్దరూ చూసుకోండి' అన్నాడు మల్లిఖార్జునస్వామి. ఓ రోజు పరిచయం చేశాడు. చేసిన తరువాత అతనికి పద్యాలు రాయడం వచ్చునని నేను, నాకు పద్యాలు రాయడం వచ్చునని అతను ఇద్దరం గ్రహించాం. అంతేకాదు. అతని పద్యాలలో కవిత్వం లేదని నేను, నా పద్యాల్లో కవిత్వం లేదని - అతను చెప్పుకోవడమే కాదు. అది మాకు మాకే తెలుసు.మేము రాసింది కవిత్వం కాదు. పద్యరచన అని మా ఇద్దరికీ తెలుసు. తెలిసిన తరువాత ఇద్దరం స్నేహితులం అయ్యాము. ఆ స్నేహం **56** సంవత్సరాలు ఉండి ఈ మధ్యనే రెండేళ్ల క్రితం ఏష్యం అయిపోయింది. పోయింది. అంటే ఆ మనిషిలేడు. లేకుండా పోయాడు. ఆరోణంకి అప్పలస్వామి నేను స్నేహితులం అయ్యాము.

రోణంకి అప్పలస్వామి నేనూ స్నేహితులం అయిన తరువాత మా కాలేజీ చదువులు వేరే మార్గాన పడిపోయాయి. అతను నేను ఇంగ్లీషులో పద్యాలు తెగ కంఠతా పెట్టామేమో అవి పాడుకుంటూ కూర్చునేవాళ్లం. ఛందోబద్ధంగా పద్యాలు చదవడం బాగా వచ్చు. అందుచేత కంఠతా వచ్చిన ఆ పద్యాలు, కొత్త పద్యాలు చదువుకుంటూ వుండేవాళ్లము. 'పాల్‌గ్రేవ్ గోల్డెన్ ట్రెజరీ' (Palgrave goldenTreasury) పద్యాలు ఇద్దరికీ కంఠతా వచ్చును. అవి కలిసిపాడే వాళ్లం. ఆ తరువాత ఇబ్సన్ యాంతాలజీ అని ఒకటి వుండేది. అందులో ఇందులో లేని పాటలు చాలా వుండేవి. అవన్నీ ఇద్దరం కలిసి రాత్రి పన్నెండు ఒంటిగంటా, రెండు వరకు చదువుకునేవాళ్లం. అప్పలస్వామికి ఒక గది వుండేది. చిన్నగది. ఆ చిన్నగదిలో కూర్చొని రాత్రి పన్నెండు, ఒంటిగంట రెండు దాకా పెద్దగా జంబోరా గాత్రాలతో పాడుతూ వుండేవాళ్లం. కృష్ణా విలాస్ లాడ్జి అని ఓ లాడ్జి ఉండేది. దాంట్లో పిల్లలు కాలేజీ పిల్లలు కనీసం ఓ ముప్ఫయిమంది వుండేవారు. వాళ్లందరికీ చాలా కోపంగా వుండేది మామీద. నాకు అప్పలస్వామిని పరిచయం చేసాడే ఆ సుంకరి మల్లికార్జునస్వామికి కూడా నామీద చాలా ఆగ్రహంగావుండేది. ఎందుకూ అంటే చదువూ సంధ్యా మానేసి

అప్పలస్వామీ నేనూ పద్యాలు చదువుకుంటూవుండేవాళ్లం. రాబర్టు బర్న్సు (Robert Burns) పద్యాలు పుస్తకం తెచ్చాం. ఇష్టం వచ్చినట్టు గట్టిగా చదువుతూ ఉండేవాళ్ళం. అలా చదువుతూ వుంటే ఈ మల్లికార్జునస్వామికి చాలా కోపం వచ్చి మా ఇంటికి వచ్చి నేను లేనప్పుడు మా అమ్మతో 'మీవాడు అక్కడకు వచ్చి రోజూ చదువూ - సంధ్యా లేదు. ఏవో పద్యాలు ఆ రోణంకి అప్పలస్వామి అని ఓ స్నేహితుడు వున్నాడు. అతనితో పాటు, పద్యాలు చదువుతూ రాత్రి పన్నెండు, ఒంటిగంటదాకా కాలం పాడుచేస్తూ చదువు మానేసి కూర్చుంటున్నాడు' అని కంప్లైంటు చేశాడు. చేస్తే మా అమ్మ ఏమో, సహజం పెద్దదికదా, ఏవో అనవలసిన మాటలు అన్నీ నాలుగూ అంది. కాని అవేం నేను పట్టించుకోలేదు. పట్టించుకోకుండా యథాప్రకారం మామూలుగానే వుండేవాడిని. అప్పలస్వామి అలాగే వుండేవాడు. పన్నెండు గంటలు అయిన తరువాత ఇద్దరం కలిసి స్టవ్‌మీద - ప్రిమిస్ స్టవ్ అని ఓ జర్మను స్టౌ వుండేది. అతని దగ్గర- ఆ స్టౌ మీద ఉప్మా చేసేవాళ్లం. ఉప్మా చేసిన తరువాత టీ పెట్టేవాళ్లం. ఆ ఉప్మాతిని, టీ తాగి ఒక్కొక్కప్పుడు మూడు నాలుగు గంటల దాకా కూడా పద్యాలు చదువుకునే వాళ్లం. ఆ విధంగా చదివిన మీదట ఇంగ్లీషులోను స్వేచ్ఛగా పద్యాలు రాయడం అనేది ఇద్దరికీ వచ్చింది. నాకు బాగానే వచ్చింది. కాలేజీలో మేగజైను వుంటుంది కదా, దానికి ఓ కార్యదర్శీ, మేగజైను బోర్డూ అంటూ వుంటారుకదా - వాళ్లు వచ్చి మమ్మల్ని పద్యాలు అడిగితే నేను ఇవ్వను పొమ్మన్నాను అంటే - చెత్త నేను రాసింది. అది అచ్చువేయడానికి పనికిరాదు. అది కవిత్వం కాదు. అది వద్దూ అని చెప్పేశాను. మా అప్పలస్వామి మాత్రం "పోతన్న" అన్న సానెట్టు (Sonnet) ఏదో ఇచ్చాడు. ఇవ్వకపోలేదు. ఇంతట్లో ఓ నా క్లాసుమేటు "నువ్వు ఇవ్వనంటున్నావు.నాకు ఇవ్వకూడదా నా పేరున వేసుకుంటాను" అన్నాడు. "అయితే మంచిదే వేసుకో అని ఓటి ఇచ్చాను.నాలుగు చరణాలు, చరణాలు అంటే స్ట్రాంజాలు నాలుగు స్ట్రాంజా పద్యం ఓటి వాడి పేరన నాది పడ్డాది. కాని కాలేజీ అంతా సోమయాజుల పద్యం అన్నారుగానీ వాడిపద్యం అనలేదు. వాడికి చాలా చిన్నతనం పట్టుకుంది తరువాత. నేను 'రేంబల్' (Ramble) అని చెప్పి సరదాకి వచనంలో ఇంగ్లీషులోనే ఓ వ్యాసం రాసాను. అదీ బాగానే రాశానుగాని నా దృష్టిలో మంచిది కాదు. అందుచేత దానిని కూడా అచ్చు వేయడానికి ఒప్పుకోలేదు. అది మరో స్నేహితుడు తన పేరున వేసుకున్నాడు. వేసుకుంటేఇది కూడా నేను రాశాననే

సంగతి కాలేజీ అందరికీ తెలిసిపోయి వాడు చిన్నపోలేదుగాని నాది కాదు సోమయాజులుది. నా పేరన వేసుకున్నాననే సరదాగా చెప్పుకుంటూ వుండేవాడు. ఇలాగ రెండు నావి కాలేజీ మేగజైన్‌లో అచ్చు అయ్యాయి ఇంకోరి పేరున. కాని నేను మాత్రం అవి ఓ పద్యాలు అని కాని ఆ వ్యాసం ఒక వ్యాసం అని కాని ఆనాడు భావించలేదు. ఈనాడూ భావించలేదు.

దీనికి కారణం ఏమిటి అంటే మేము చదువుతున్నది పెద్ద పెద్ద కవుల పద్యాలు కదా! ఆ పద్యాలతో పాటు వీటికి తారతమ్య పరీక్ష చేస్తే ఇందులో ఏమి వుంటుంది? ఏదీ లేదని తెలుస్తూ వుండేది. ఇదిలా వుండగా మా కాలేజీలోనూ కవులు ఎందరో వుండేవారు. అందులో ఒకాయన చాలా సోగ్గా తయారయ్యేవాడు. భావకవి. పాటలు రాసేవాడు. కృష్ణశాస్త్రి గారి భక్తుడు. ఎంకి పాటల భక్తుడు. మరెవరెవరికో భక్తుడు. పాటలు రాసే అందరికీ భక్తుడు. వాడు పాటలు రాసేవాడు. పాపం పాటలు కాలేజీ మేగజైన్‌లో పడి చాలా గర్వంగా ఉండేవాడు. ఆ పాట చదివితే ఎలా వుంది. అంటే పేలవంగా వుండేది. బాగా లేదని చెప్పాను వాడికి. బాగా లేదంటే వాడికి కోపం. కాలేజీ అంతా పెద్ద కవని వాడికి పెద్ద పేరు. ఆ పేరును నేను కాదని అంటే వాడు ఒప్పుకుంటాడా? అందుచేతవాడు బాధపడుతూనే వుండేవాడు. మామీద కోపం, కవిత్వం రాసేవాళ్లందరికీను. ఇందులో కోపం లేనివాడు కవిత్వం రాస్తున్నవాడు. మరో క్లాసుమేటు వుండేవాడు. నాతో పాటు చదువుకుంటూ వుండేవాడు. అతను ఎవరు అంటే మోటూరి వెంకటరావు. అతను మాత్రం పద్యాలు ఎలాపడితే అలా రాసేవాడు. చాలా స్వేచ్ఛగా వృత్తాలు అవీ రాయగలిగేవాడు తెలుగులో. అతను మంచి కవి అయ్యాడు. తరువాత కూడా అతని తాలూకు గీతాలు మాత్రం కాలేజీ మేగజైనులో ఉండేవి కావు. అతను చాలా నమ్రంగా వుండి ఇంకా మనం నేర్చుకుంటున్నాం, బాగా రాయాలి, కృషి చేయాలి అనే నిండు విశ్వాసంతో వుండేవాడు. ఆ మనిషి తరువాత హిమగళం, సింహబలి మొదలైన పుస్తకాలు రాసాడు. అపూర్వమైన ఛందస్సులో ఓ పుస్తకం రాసాడు. 'కర్ణభారతం' అని రాసాడు. దేశంలో పేరూ ప్రతిష్టా వున్నవాడే. విశ్వనాథ సత్యనారాయణగారు ముందు మాటలు రాసి అతనిని చాలా ప్రోత్సహించేవాడు. ఈ కర్ణభారతం అచ్చుకు ప్రభుత్వం కూడా కొంత డబ్బు ఇచ్చింది. ఇతను మొన్నమొన్ననే కీర్తి శేషుడయ్యాడు. అతను ఒక్కడే - కాలేజీ మొత్తం మీద ఆనాడు పదిహేను ఇరవై మంది కవులు మా ఎదురుగా

కనబడుతూ ఉంటే - అందులోంచి బయటికి వచ్చినవాడు. ఆ తరువాత ఎవరూ అంటే రోణంకి అప్పలస్వామి.

రోణంకి అప్పలస్వామి ఇంగ్లీషులో పద్యాలు రాసి, ఎమ్మే పాసై విజయనగరం రాగానే విజయనగరంలోనే Songs and Lyrics అని ఓ పుస్తకం అచ్చు వేశాడు. ఆ పుస్తకం వేయగానే ఏదో ఆకాశం బద్దలు అయిపోతుందనుకున్నాడు. ఏమీ కాలేదు. ఎంచేతా అంటే Songs and Lyrics ఛందస్సు రీత్యా, భాషరీత్యా అన్నిటి రీత్యా బాగావున్నవే. కాని కవిత్వం రీత్యా లోతులేదు. ఆ విషయం అతనికీ తెలుసు.మేము ఇద్దరమూ పద్యాలు ఇంగ్లీషులో రాస్తూనే వున్నాం. ఆ తరువాత కొన్నాళ్లకి మేం రాసినవి చాలా బాగున్నాయి. ఇవి ఎక్కడైనా అచ్చు వేయడానికి అర్హమైనవే అనే భావం ఇద్దరికీ కలిగింది. కలిగింది గానీ ఎక్కడికి పంపడం? భారతదేశంలో ఇంగ్లీషులో మేంరాసిన పద్యాలు అచ్చువేసేది ఒకటే ఒకటి వుండేది పత్రిక. దానిపేరు ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా (illustrated weekly of India) దానికి పంపితే వాడు జవాబే రాయలేదు. నేను పంపినవి బుట్టదాఖలా చేసాడు. అప్పలస్వామి రాసినవి అతను పంపితే అతనివీ బుట్టదాఖలా చేసాడు. ఇహ ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ కాకుండా ఇంక ఏమిటి ఉన్నాది? అప్పుడే లక్నో నుంచో ఎక్కడ నుంచో ఓ పత్రిక ఉండేది. అదీ తెలుగువాడే నడుపుతూ వుండేవాడు. వాడికి పంపించాం. ~~ఈశ్వరదత్తు~~. దానికీ పంపించి చూసాము. ఆయనా అచ్చువేయలేదు. ఆతరువాత కోపము వచ్చింది. వాడిమీద సంపాదకుడు మీద ఆగ్రహం. ఆ తరువాత రామకోటేశ్వరరావుగారని ఒకరు వుండేవారు. ఆయనది త్రివేణి అని ఇంగ్లీషులో ఓ పత్రిక. దేశంలో అన్ని భాషల్లోంచి అనువాదాలు చేసి వేయడం, అది ఇండియన్ రినైజాన్సుకి పత్రిక. పునర్వికాసానికి పత్రిక. భారతీయ పునర్వికాసానికి పత్రిక అనేవాడు ఆయన. సంతోషమే. అందులో మా పద్యాలు వెయ్యి అని ఆయనతో చాలా పోట్లాడాను.ఆ పోట్లాటా అంతా ఇంతా కాదు, గట్టిగానే. ఆయన పెద్దవాడే కాని వయస్సుచేత, నేను చాలా చిన్నవాడినేగాని అతని తాలూకు పద్ధతి అంతా తప్పు అని చెప్పాను. ఇక్కడ మేము తెలుగువాళ్లం రాస్తున్నాం. మమ్మల్ని నువ్వు ఏమిచేస్తున్నావు? మాస్వంతంవి కొన్ని వేయి అన్నాము.మేము అనువాదాలు తప్ప స్వతంత్ర రచనలు వేయం అని పెట్టుకున్నాడాయన. దానితో వదిలేశాము. వదిలేసి అప్పలస్వామికి తెలియకుండా నేను కొన్ని పద్యాలు ఇంగ్లీషు పత్రికలకు పంపించాను. అక్కడా బుట్టదాఖలా అయిపోయింది. వాళ్లు ఎవరూ ఎక్కడా జవాబే

రాయలేదు. ఈ అప్పలస్వామి కూడా తనూ స్వతంత్రంగా కొన్ని ఇంగ్లండు పంపించాడు. ఇంగ్లండుకునాకు తెలియకుండా అతను, అతనికి తెలియకుండా నేను ఇద్దరం పంపించాం. పడ్డ తరువాత చెప్పుకుందాం అనే గొప్ప. కాని ఇద్దరివీ బుట్టదాఖలా అయిపోయాయి. ఆ తరువాత ఇద్దరం చెప్పుకున్నాం ఆ విషయం. ఈ విధంగా మా పద్య రచన ఆ కాలేజీలో నడుస్తూ వచ్చింది. ఆ తరువాత కొన్నాళ్ల తర్వాత నేనేం చేశానంటే ఇంగ్లీషు పద్యం నాకు రాదు అని నిశ్చయం చేసుకున్నాను. ఎంచేత? ఇంగ్లీషులో దానికి ఊనిక అని వుంటుంది. ఆ ఊనిక నాకు తెలుసు. అంటే Stress. పద్యం రాయడం తెలుసు. కాని ఏమిటి రాదూ అంటే ఇంగ్లీషు నుడికారం నాకు ఎక్కడ తెలుసునూ? పుస్తకాల్లోంచి వచ్చిన భాష తప్ప. దానిని ఏమంటారూ అంటే స్పీచ్ రిథమ్ (Speech Rythum) మాట్లాడుతున్నప్పుడు ఓ చక్కటి రాగం వస్తుంది. ఓ ఊపు వస్తుంది. వచనంలో కూడా వస్తుంది. అది సరైన వాక్ప్రవాహంలో ఎలా వుంటుందో దాన్ని పట్టుకుని పద్యాలు రాయాలీ అంటే నాకు ఎక్కడ సాధ్యం అవుతుంది. నాకు వాడుక భాషతోటి సంబంధం లేదు. ఇంగ్లీషు వాడుకభాష, ఆ పదజాలమే తెలియదని చెప్పొచ్చు. పుస్తకాల్లో చదువుకున్న కృతకమైన మాటలతోటి పద్యాలు రాస్తే, ఇప్పుడు గ్రాంధిక భాషలో పద్యాలు రాసింది కాదంటూన్నామే మరి దాన్నేమంటాం? అందుచేత ఇంగ్లీషులో రాయడం మానేసి తెలుగులో పద్యాలు రాయడం ప్రారంభించాను. ఆ రోజులలో నేను రాసిన ఇంగ్లీషు పద్యాలు అన్నీనూ, మంచివి కూడా నేను పారేశాను. ఒకటీ దాచుకోలేదు. అలా చేయడానికి కారణం ఏమిటీ అంటే దానిమీద ఒక నైరాశ్యత కూడా వచ్చిందీ అని చెప్పవచ్చు. కాని నేను విద్యార్థి దశలో రాసిన ఒక లైను ఇప్పటికీ నాకు గుర్తువస్తూ వుంటుంది. అది ఒక ఆకును నేను పట్టుకుంటే చెట్టు విచారంలో పడుతుంది. If I touch a leaf the tree will be in grief. ఆకును తెంపేస్తే చెట్టు విచారిస్తుంది అని మరోలైను. pluck a leaf ఆకును తెంపేస్తే చెట్టువిచారిస్తుందని ఓ లైన్. If I pluck a leaf, the tree willbe in grief. చిన్నప్పుడు విద్యార్థిదశలోరాసింది. The surgeon bird is pecking the bark to heal the wound of a tree అనే లైనుతో రాసిన పద్యం చాలా మంచిది. దాన్ని కూడా నేను పారేశాను. తెలుగులో కవిత్వం ప్రారంభించాను.

కాలేజీలో చదువుతున్న చిన్ననాడే నేనూ, రోణంకి అప్పలస్వామి వామపక్షానికి చెందినవాళ్లం. ఇది ఎలా సంభవించింది? బ్రిటిషు కవులు అందుకు కారణం. బ్రిటిషు కవులకూ, మాకూ ఏమిటి సంబంధం అంటే విజయనగరం కాలేజీ లైబ్రరీలో ప్రతి నెలా,వారం వారం వచ్చే బ్రిటిషు పత్రికలు కారణం. మా విజయనగరం మహారాజా వారి కళాశాలలో ఇంగ్లండులో ఆ రోజు ప్రచురితమవుతున్నటువంటి సాహిత్య సంబంధమైన అన్ని పత్రికలు చందా కట్టి తెప్పించేవారు. ఆ పత్రికలు బహుశా నాకూ, రోణంకి అప్పలస్వామికి పనికివచ్చేయి అంటే ఆశ్చర్యం లేదు. ఎందుచేతనంటే రీడింగు రూం టేబులు మీద ఆ పత్రికలన్నీ పడి ఉండేవి. అవి చదివినవాడు,చదువుతున్నవాడు ఆ రోజులలో నాకు ఒక్కడూ కనపడలేదు. ఎప్పుడూ అవి చదివేవాళ్లం ఇద్దరమే. అయితే ఆ తరువాత 1930 కొంచెం జరిగిన తరువాత శ్రీశ్రీ మాకు మిత్రుడైన తరువాత శ్రీశ్రీ ప్రతి నెలా పనికట్టుకుని వచ్చి ఓ రెండు మూడు రోజులు ఉండి ఆ పత్రికలన్నీ చదివి వెళ్లేవాడు. శ్రీశ్రీకి అవి పనికి వచ్చేవి. ఊళ్లో ఉన్న శ్రీరంగం నారాయణబాబుకి పనికి వచ్చేవి. అయితే వాళ్లమాట అలా వదిలేద్దాం. వాళ్లుమాకు తరువాత స్నేహితులు. ముందు కాదు. మేము మాత్రం ఈ పత్రికలవల్ల వామపక్షానికి అనుయాయులం అయిపోయాము. మా సమకాలికులుఅంటే మా వయస్సు వాళ్లు (రోణంకి అప్పలస్వామి, నాకన్న ఆరేళ్లు పెద్దవాడు. శ్రీశ్రీ కూడా ఐదేళ్లు పెద్దవాడు, శ్రీరంగం నారాయణబాబు తొమ్మిది సంవత్సరాలు పెద్దవాడు) నా వయస్సు వాళ్లు, వాళ్ల వయస్సు వాళ్లు బ్రిటిష్ కవులు మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించి ఇంగ్లండ్‌లో వుండేవారు. ఈ పత్రికలలోవాళ్లకవిత్వాల మీద కావలసినన్ని వ్యాసాలు పడుతుండేవి. ఆనాడు వచ్చిన పత్రికలలో టైమ్స్‌లిటరరీ సప్లిమెంట్ (Times Literary suppliment) ప్రతీ వారం వచ్చేది. మాసపత్రికలలో జేసీస్ కోయర్ సంపాదకత్వాన ఉన్న మెర్క్యురీ పత్రిక వచ్చేది. టి.ఎస్. ఇలియట్ సంపాదకత్వాన వెలువడే క్రైటేరియన్ వచ్చేది. బుక్‌మన్ అని పుస్తకాలన్నిటినీ విమర్శ చేస్తూ ఓ పత్రిక ఉండేది. పదిహేను రోజులకు ఓ పక్ష పత్రిక వచ్చేది రివ్యూ (Review). సాహిత్యం మీద రెవ్యూ అది. ఇలాగ ఎన్నో -పత్రికలు వచ్చేవి. ఇవిగాక రైట్‌వింగ్-వామపక్షానికి వ్యతిరేకమైన పత్రికలూ వచ్చేవి - సాటర్ డే రెవ్యూ (Saturday Review) బూర్జువాల పత్రిక స్ట్రాండ్ (Strand) కూడా వచ్చేది. హాస్యరస సంబంధమైన పత్రిక 'పంచ్' వచ్చేది. ఇవన్నీ మేం చదువుకుంటూ ఉ

ండేవాళ్లం. మా సమకాలికులైన బ్రిటిషు కవులు ఉన్నారే వాళ్లని ఆ రోజుల్లోనే లెఫ్ట్‌వింగ్‌కి చెందిన వాళ్లు. వాళ్లని 'ఔడన్‌గాంగ్' అనేవాళ్లు. ఆ ఔడన్ గాంగ్ కవులు మాకు ఆదర్శప్రాయులైన కవులై ఉండేవారు. డబ్ల్యు. హెచ్.ఔడన్, స్టీఫెన్ స్పెండర్, సిసిల్ డి లూయిస్ మొదలైనవాళ్లు. వీళ్ల తాలూకా పుస్తకాలు మేం చదవలేదు. వాళ్లేం రాస్తున్నారో, ఏవిధంగా ఆలోచిస్తున్నారో, మధ్యమధ్యన వాళ్ల జీవితంలో చిన్న చిన్న ముక్కలు వ్యాసాల్లో ఉదహరించబడి కనబడుతుండేవి. కాని మొత్తంమీద ఆ భావం మాకు అవగతం అవడానికి సావకాశంగా ఉండేది. అందుచేత రోణంకి అప్పలస్వామీ, నేనూ వామపక్షానికి చెందినవాళ్లం అయ్యాం. కవిత్వంలో కూడా వామపక్ష కవిత్వమే చిన్నప్పటి నుంచీ ప్రారంభించాను. దీనివల్ల నాకు కలిగింది ఏమిటంటే భావకవిత్వం అంటే రోత. అప్పట్లో భావకవిత్వం దేశంలో బాగా ముంచెత్తి ఉంది. ఎక్కడ చూసినా భావకవులే. విజయనగరానికి కూడా కృష్ణశాస్త్రిగారు వచ్చి గంభీరోపన్యాసం ఇచ్చారు ఓమారు. కానివాళ్ల కవిత్వం, వాళ్ల ఉపన్యాసాలు నాకు మాత్రం వెగటుగా ఉండేవి. దేశకాల పరిస్థితులు ఎరిగి రాసిన కవిత్వంకాదు. చారిత్రకదృక్పథంలో సాహిత్యాన్ని చూడ్డం ఆ చిన్నప్పట్నుంచీ నాకు ఉంది. ఆ దృక్పథంలో చూస్తే అప్పట్లో ఉప్పు సత్యాగ్రహం కొనసాగుతుండేది. ఓ లక్షమంది జైళ్లకు వెళ్లారు. అనేక మంది లాఠీదెబ్బలు తిన్నారు. కొందరు చచ్చిపోయినవాళ్లు ఉన్నారు. అంతకు ముందే జలియన్‌వాలాబాగ్ మారణహోమం పెద్దది అయింది. దేశంలో తీవ్ర సంచలనం రేపింది. వీటిదేనికీ కూడా భావకవులు స్పందించలేదు. చారిత్రకంగా వాళ్లెక్కడున్నారూ! వాళ్లు స్వంతంగా ఓ స్వర్గాన్ని తయారు చేసుకుని ఆ స్వర్గంలో ఓ ఊర్వశిని పెట్టుకుని పద్యాలు రాసారు. పాశ్చత్యుల విమర్శచదువుకున్న కారణంచేత నాకు చాలా చిన్నప్పటి నుంచీ వీళ్లమీద ఏవగింపు పుట్టుకొచ్చింది. లేని ఊహాఊర్వశులను ఊహించుకుని కవిత్వం రాస్తున్నారు. అప్రాప్త మనోహరి, హృదయేశ్వరి, ప్రేయసి, ఊహాఊర్వశి ఇవన్నీ ఎక్కడవి? ఇదా కవిత్వం? నేనైతే చిన్నప్పట్నుంచీ కూడా ఒక ప్రేమ గీతం రాయలేదు. భావకవిత్వం మీద విరోధ భావమే కాక నాలో నిరీశ్వరభావం ఉంది. మార్క్సిస్టు దృక్పథంలో అదికూడా ఉంటుంది కదా! ఇది నాకు పెద్ద తంటానే తెచ్చిపెట్టింది. దేవుడు లేడని నేనువాదిస్తే మా సుంకరి మల్లిఖార్జునస్వామి నా వాదాలన్నీ మా ఇంట్లో చెప్పేడు. మాఇంట్లో వాళ్లు, బంధువులు అందరూ కూడా నామీద విరుచుకుపడ్డారు. వాళ్లవాదనను ఆమోదించేవాణ్ణి కాదు. నిరీశ్వరవాదిగానే

మాట్లాడుతూ వచ్చేను. మొండివాడిని అయిపోయేను కదా, వాళ్లు నన్ను ఏమీ అనలేదు. ఏమీ చేయలేదు. అందులోనూ అభిమాన పుత్రుడిని. కొక్కిరాయి కొయ్యినయ్యాను. మా అమ్మ అసలే నా జోలికి వచ్చేది కాదు. వాడి బాధ ఏదో వాడినే పడనీ అని అనేసేది. మేము పరీక్ష పాసయ్యాం. ఎవరైతే మామీద చాడీలు చెప్పారో వాళ్ల పరీక్షలే పోయాయి. మా పరీక్షలే పాసయ్యాయి. ఏదో చదవడం పాసయిపోవడం, ఈ నిరీశ్వరవాదం ఉండడం, తరువాత వామపక్షానికి రాయడం, వామపక్షం అవడం, దీంతో మేము వామపక్షానికి చెంది భావకవులకు వ్యతిరేకమై గురజాడ అప్పారావుగారికి అనుయాయులయ్యాం. అప్పారావుగారి పద్యాలు మేము చదివినదానికిన్నీ, దేశంలో ఈరోజువారు చదువుతున్న దానికీ చాలా వ్యత్యాసం ఉంది. ఆయన ఎందులోంచి ఆ గీతాలు రాశాడో, ఎందులోంచి నాటకం, ఏవిధంగా రాశాడో అది మాకు తెలిసినట్లు ప్రస్తుత విమర్శకులకు కూడా కొందరికి తెలియదేమో అన్నది నా భావన. ఇది నేను అహంభావంతో చెప్పడం లేదు. భావకవిత్వం పనికిరాదని మేము ఖచ్చితంగా చెప్పేం. చారిత్రక దృక్పథంలో గురజాడ అప్పారావుని చదివినవాళ్లు లేరు. విమర్శించినవాళ్లు లేరు. ఈ భావాన్ని కొంతమంది అంటున్నారుగాని ఇంకో విధంగా చూస్తే భావకవులు స్వాతంత్ర్యపిపాస కలవారు. వ్యక్తి స్వాతంత్ర్య పిపాస కలవారు వ్యక్తి స్వాతంత్ర్య పిపాస అంటూ వాళ్లను ఏదో విధంగా సమర్థిస్తున్నవాళ్లు విమర్శకుల్లో కనబడుతున్నారు. వాళ్లను సమర్థించవలసిన అవసరం లేదు. వాళ్లు ఆ రోజుల్లో పలాయనవాదులే. వాళ్లు యధార్థాన్ని విస్మరించినవాళ్లే. అందుచేత వాళ్ల కవిత్వంలో ఎంత అందమయిన కవిత్వం ఉన్నా నా దృష్టిలో వాళ్లు పలాయనవాదులు. అప్రస్తుతపు కవిత్వం వాళ్లు రాశారని నా నమ్మకం. అంతేకాదు వాళ్లు వెనక్కి పోయి, ఆ పాత పాటనే పట్టుకువచ్చి, ఆ గ్రాంధికాన్నే కాస్త చిన్న చిన్న మార్పులు చేసి, చిన్న చిన్న వ్యాకరణ దోషాలు పెట్టుకొని, ఆ దోషాలుదోషాలు కాదని ఇలాంటివేవో చేశారు తప్ప గురజాడవారి వాడుక భాష గాని, ఆయన పద్ధతినిగాని వాళ్లు ఆమోదించలేదు. అందుచేత వాళ్లయందు మాకు విముఖత బాగా కలిగింది.

(విజయనగరంలో 1988 ఆగస్టు నెలలో చా.సో చెప్పగా, శ్రీ రామినాయుడు రికార్డు చేసిన ఆడియోకేసెట్ నుండి)

# 3. నారాయణబాబు - శ్రీశ్రీ - కావ్యరచన

మా ఊళ్లో ఆ రోజుల్లో ఒక భయంకరమైన వ్యక్తి తిరుగుతూ ఉండేవాడు. జాంబవంతుడిలా తిరుగుతూ ఉండేవాడు. బుర్రమీద పెద్ద గేరా పెట్టుకుని మంచినొక్కు నొక్కుల జుత్తుతో, అతనిని చూస్తేభయం వేస్తూ ఉండేది. కాని అతన్ని కలియాలని, అతనితో మాట్లాడాలని ఉండేది నాకు. అతను వయస్సు చేత నాకన్నా తొమ్మిదేళ్ల పెద్దవాడయిన కారణంచేత, అతని రూపు రేఖలు గంభీరంగా ఉండటం చేత, నేనూ చాలా కుర్రవాడ్నయిన కారణం చేత గబుక్కున వెళ్లి మాట్లాడ్డానికి భయపడుతూ ఉండేవాణ్ణి. అతను భావకవి. శ్రీరంగం నారాయణబాబు. అయితే మా ఇంట్లో చనువుండేటటువంటి చొప్పల్లి సూర్యనారాయణ భాగవతారూ అతనూ స్నేహితులు. ''ఒరే నారీ'' అని పిలచేవాడు చొప్పల్లి. 'ఒరే చొప్పల్లీ' అని నారాయణబాబు పిలిచేవాడు. అంత దగ్గరి స్నేహితులు వాళ్ళు. ఈ నారాయణబాబుతో పరిచయం కావాలని ఆ చొప్పళ్ళితో చెప్పాను. 'అదేమిటిరా' వాడు మన వాడేన్రా' అని చెప్పి నన్ను తీసికెళ్ళి పరిచయం చేశాడు. అక్కడ నుండి నారాయణబాబుతో పరిచయం. ఆ భావకవి పరిచయమైన వెంటనే, అంటే అయిన కొద్ది రోజుల్లోనే విశాఖపట్నం కవులందరూ నాకు పరిచయమయ్యారు. విశాఖపట్నం కవుల్లో ప్రధానమైనవాడు, నాకు దగ్గర వాడు, కుర్రవాడూ శ్రీశ్రీ.

ఆ శ్రీశ్రీ కూడా భావకవే. నారాయణబాబూ శ్రీశ్రీలిద్దరూ క్రిష్ణశాస్త్రి భక్తులు. ఆ రోజుల్లో క్రిష్ణశాస్త్రి గీతం ఎందులోనో ఒక దాన్లో టుపుక్కున పడేది. అది పడ్డాదంటే దేశంలో పెద్ద ఈవెంటు. ఓ పెద్ద మార్పు. ఏదో జరిగినట్టూ, విపరీతమైన సన్నివేశం జరిగినట్టూ వాళ్లా పద్యం తెచ్చుకోవడం, కంఠతా పెట్టడం, పాడ్డం చేసేవాడు నారాయణబాబు. క్రిష్ణశాస్త్రి అంటే అంత ఇష్టం.

ఈ ఇద్దరుభావకవులున్నూ కవులుగా మాకు దగ్గర్లో ఉన్నారు. స్నేహం తప్ప వాళ్ళు రాస్తున్న కవిత్వం మీద ఆవగింజంత అభిమానంగాని, గౌరవ భావంగాని లోపల నాకు లేదు. వారుభయులూ అకస్మాత్తుగా మా మధ్య కొచ్చిన తరువాత భావకవిత్వాన్ని వదిలిపెట్టేశారు. వామపక్షానికి మొగ్గారు. దానికి కారణం విజయనగరం కాలేజీ లైబ్రరీలో ఇంగ్లాండు నుంచి వచ్చిన పత్రికలే మూలం అని నేను ఘంటాపథంగా చెప్తాను. అయితే కేవలం ఈ పుస్తకాలే కారణాలని మాత్రం అనడానికి వీలు లేదు. ఆ రోజుల్లో 1918లో రష్యా విప్లవం ప్రపంచదేశాలన్నింటిలోనూ మేధావులను చాలా కదిపింది. అది యువతరానికి చెందిన మమ్మల్ని కదపకుండా ఉందా!? అదీ ప్రధానమైనదనే చెప్పాలి. ఆ తరువాత మన దేశపు నెహ్రూ పండితుడు, సోషలిస్టు. అతని ఉపన్యాసాలు కూడా మాలో చాలా మందిని వామపక్షానికి మొగ్గు చూపించేటట్టు చేశాయి. ఆయన తన ఉపన్యాసాల్లో సోషలిస్టు భావాలు అంటూ ఉండేవారు. అవి మమ్మల్నందరినీ కదిలిస్తూనే ఉండేవి. ఈ వామపక్షభావాలు ప్రపంచమంతటా ఓ ఝంఝలాగ విసురుకువచ్చేవి. తెలుగుదేశంలో కూడా 1922లోనే ఉన్నవ లక్ష్మీనారాయణగారు దానిని మాలపల్లిలో ప్రతిఫలింపచేశారు. చాలా సమర్ధవంతంగా అందులో విప్లవాన్ని ఆయన సూచించారు.

నేను ఆదినుంచీ అంటే చిన్నప్పటినుండీ వామపక్షానికి చెందిన వాణ్ణి. రోణంకి అప్పలస్వామి కూడా. మేం ఇద్దరమూ నిరీశ్వరవాదులం. శ్రీరంగం నారాయణబాబూ, శ్రీశ్రీలిద్దరూ భావకవులు కదా భగవద్భక్తులు. అక్షరాలా భగవద్భక్తులు. వారు వామపక్షానికి మొగ్గారు. అంటే భౌతిక మార్క్సిస్టు దృక్పథాన్ని అవలంబించారని చెప్పవచ్చు. అంతకు ముందు వరకూ ఒక విధమైన భావకవుల గ్రాంధిక భాషలో రాస్తున్న నారాయణబాబూ, శుద్ధ గ్రాంధికంలో రాస్తున్న శ్రీశ్రీ వాడుక భాషలో రాయడానికి పూనుకున్నారు. వారిలో పెద్ద మార్పే కలిగింది. ఈ మార్పుకి కారణం ఎవరూ అంటే రోణంకి అప్పలస్వామే అని చెప్పాలి. అతని ప్రభావం వారుభయుల మీదా ఉంది. రోణంకి అప్పలస్వామే లేకపోతే, అతనితో వాదోపవాదాలు జరగకపోతే వారు ఆ విధంగా మారేవారు కాదు. రోణంకి అప్పలస్వామి నా గురువని నారాయణబాబు కొసవరకూ చెప్పుకున్నాడు. 'ఆయన్నాకు గురువు గార్రా! అని గర్వంగానే చెప్పుకునే వాడు. కాని శ్రీశ్రీ అది ఏనాడూ ఆమోదించలేదు. రోణంకి వల్లే, అతడి ప్రభావం వల్లే శ్రీశ్రీ కవిత్వంలో మార్పు వచ్చిందని నేను స్పష్టంగా

చెప్పగలను. ఎందుచేతనంటే మా ఇంట్లోనే ఈ తర్జన భర్జనలు అయ్యేవి. నెల తిరక్కుండా శ్రీశ్రీ రైలు టిక్కట్టయినా కొనకుండా వాల్తేరులో రైలెక్కి విజయనగరంలో దిగుతూ ఉండేవాడు. ఎందుకువచ్చేవాడు? కాలేజీలో ఉన్న మేగజైన్లు చదవడానికి. రోణంకి అప్పలస్వామి తోటి మాతోటి చర్చలు చేయడానికి. చదివే వాళ్ళం. రాత్రి ఒంటిగంటా రెండు దాకా చర్చలు చేసేవాళ్ళం. ఆ చర్చల్లోంచి ప్రజాకవిత్వం ఉద్భవించింది. అంటే-ప్రపంచ పరిస్థితులకు స్పందించి, వామపక్షానికి మొగ్గి, కొత్త కవిత్వం రాయాలనేటటువంటి మార్పు వాళ్ళలో సంభవించి, వాళ్ళు రాయడం ప్రారంభించారు. శ్రీశ్రీ మొదటి రాసింది మార్పుకి సంబంధించినది. మొదటి పద్యం ఏమిటి? ఏం చెప్పాడు? సుప్తాస్థికలు! 'అవి ధరాగర్భమున మానవాస్థికా పరంపరలు! సుప్త నిశ్శబ్ద సంపుటములు' ఇదీ చెప్పినది! ఇవి మామూలు పద్యాలే! పూర్వ పద్ధతిలోనే, గ్రాంధిక భాషలోనే శ్రీశ్రీ రాశాడు. ఈ రాసిందానిని దేశంలో చాలామంది ఇటువాళ్ళూ అటువాళ్ళూ రైట్ వింగర్స్ అందరూ, లెఫ్ట్‌వింగు ఆలోచన వున్నవాళ్ళు శ్రీశ్రీలో వచ్చిన మార్పుని గమనించారు. ఈ పద్యాలను పట్టుకుని విజయనగరం వచ్చి శ్రీశ్రీ మా మధ్యపెట్టాడు. దానిమీద చాలా పెద్ద చర్చే మా మధ్య జరిగింది. నేను చేసిన విమర్శ ఈ రోజుకీ నాకు జ్ఞాపకం ఉంది.

'అవి ధరాగర్భమున మానవాస్థికాపరంపరలు సుప్త నిశ్శబ్ద సంపుటములు! ఇవి మనకు ఎక్కడ నప్పుతాయి! మనం, అందులో హిందువులం. వైదిక మతస్థులం. చచ్చిపోయిన వాళ్ళని దహనం చేసేస్తాం. దహనం చేసిన తర్వాత ఓ రోజు బూడిదని గంగలో కలిపేస్తాం - శుభ్రంగా పోగులు పెట్టేసి, అంటే శేషం ఏమీ మిగలకుండా మనిషి తాలూకు - భౌతికంగా శారీరాన్నంతటిని దహనం చేసేసి అస్థికలతో సహా అన్నీ గంగలో కలిపేస్తాం. ఇక మిగిలిన ఒకటో రెండు అస్థికలు ఉంటేకాశీ పట్టుకెళ్ళి, లేదా ఇంకెక్కడో పవిత్రమైన నదులలో కలిపేస్తాం. అదీ మన ఆచారం. అతను మన అనుభవంలోనుంచి రాయలేదు. అదీ మా కామెంట్. ఎందులో నుండి రాశాడూ? క్రైస్తవులు మహమ్మదీయులు - వారి వ్యవహారంలో ఉందది. మన వ్యవహారంలో లేదు. ఇదీ మా కామెంటు. "అక్కడ ఒకే దీర్ఘయామిని" అనీ అన్నాడు. ఒకటే రాత్రి! మనం పాతిపెట్టం. ఒకే దీర్ఘ యామిని మనకు లేదు. ఇది ఏ అనుభవంలోంచి రాసాడు? అతడు చదివిన చదువులోంచి, పాశ్చాత్య భావాలలోంచి మన భావంలా రాసేసాడు. దానికి ఒప్పుకున్నాడు శ్రీశ్రీ" ఎందుకు ఒప్పుకోడూ? అందులో ఉన్నది

మనది కాదు. మన అనుభవంలోనిది కాదు. అయితే ఇంకొక దాంట్లోంచి రాయకూడదా! తప్పకుండా రాయొచ్చు. అందుచేత అతను రాసినవి మంచివే! బాగానే రాసాడు. అవి మార్పుతో కూడుకున్నాయి. ఆ మార్పేమిటి? అంతకు ముందు వాళ్ళు భావకవులు! వాళ్ళు రాసేది ప్రేమ, విఫలం, శృంగారం మీద గీతాలు రాస్తున్నారు. పాడుకుంటున్నారు. హృదయేశ్వరి ప్రేయసిమీద రాసుకుంటున్న భావకవులు! ఈ భావకవుల మధ్యని అస్థికల మీదపద్యాలేమిటి? దానికి ఇది ఎంత విరుద్ధంగా ఉంది! ఇది భీభత్సంతో కూడుకొని ఉంది. వాళ్ళ లాలిత్యాలు దీనికి పనికిరావు. అందుచేత ఫిలాసఫీలో మార్పొచ్చేసింది తక్కని!! ఆ తర్వాత ఆయనగారు ఏదైనా ఓ కొత్త పద్యం కల్పించాడా అది పట్టుకుని విజయనగరం రావల్సిందే. వచ్చి రోణంకి అప్పలస్వామి 'ఇది బాగుంది' అని అంటే పరమ సంతోషించే వాడు. అంటే అతనికి గీటురాయి విజయనగరం. విశాఖపట్నం కాదు!

విశాఖపట్నంలో ఆయనకి ఇద్దరే ఇద్దరు స్నేహితులండేవారు. ప్రధానంగా సాహితీ సంబంధం ఉన్నవాళ్ళు. మొదటి వాడు పురిపండా అప్పలస్వామి, అతడు మాకూ స్నేహితుడే. ఆయన వయస్సు చేత మాకన్నా చాలా పెద్దవాడు. అతడు అత్యంత ప్రేమాస్పదుడైన మిత్రుడు. వయస్సు తేడా మా మధ్య ఉన్నా లేనట్టే లెక్క! అంత చక్కగా అభిమానంగా ఆయనతో కలిసి తిరుగుతూ ఉండేవాళ్ళం. కానీ ఆయన మా సాహితీ చర్చల్లో ఏనాడూ పాల్గొనేవాడు కాదు. పాల్గొనడానికి ఆయనకి అర్హతాలేదు. అంటే చాలా మందికి కోపం రావచ్చు. అది యదార్థం. ఎందుచేత అంటే ఆయనకి ఇంగ్లీషు రాదు. ఆయన ఎప్పుడూ బెంగాలీ నుంచి ఇంకో భాషనుంచీ భావాలు సంపాదించేవాడు తప్ప, నేరుగా పాశ్చాత్య దేశాల నుండి ఆ సాహిత్యం ఏవిధంగా మారుతున్నదీ, దాని ప్రభావాలేమిటో, ఏమిటేమిటి ప్రక్రియలు వాళ్ళు రాస్తున్నారో, ఇవేవీ ఆయన తెలిసినవాడు కాదు. అదంతా తెలిసినవాడు శ్రీశ్రీ. అందుచేత ఒక విధంగా చెప్పాలంటే పురిపండా ప్రభావం శ్రీశ్రీ మీద లేదు కదా - శ్రీశ్రీ ప్రభావం పురిపండా మీద ఉంది. పురిపండా శ్రీశ్రీకి శిష్యుడని చెప్పొచ్చు. అనుయాయుడు అని గూడా నేను చెప్పగలను. ఎందుచేత అంటే అతని కవిత్వంలో మార్పులూ చేర్పులు ఇతని ద్వారానే కలిగాయి. అతను గూడా ఒక విధంగా ప్రజాపక్షపాతిగా, మార్పు అన్నది జరిగింది.

రెండవ స్నేహితులు, ఎవరూ అంటే పూజ్యులు అబ్బూరి రామక్రిష్ణారావు గారు. ఈయన భావకవి. రాయప్రోలు సుబ్బారావు గారు ఎంతో, భావకవులకు అబ్బూరివారు అంతే. ఇద్దర్నీ భావకవిత్వానికి మూలపురుషులు అని చెప్పినా తప్పులేదు. వీళ్ళిద్దరూ కాక వెంకట పార్వతీశ కవులను కూడా మూల పురుషులు అని చెప్పినా చెప్పవచ్చు. వీళ్ళు ముగ్గురూ మొదట రాసినవాళ్లు. అబ్బూరివారు అంతకు ముందు ఉన్న దానికి విరుద్ధంగా చాలా రాశారు. అందుచేత ఆయన భావకవి, కాని వామపక్షానికి మొగ్గిన వాడాయన! ఎమ్.ఎన్.రాయ్‌ప్రభావం ఆయనమీద బాగా పడ్డది. ఎమ్.ఎన్.రాయ్ కమ్యూనిస్టు. ఆయన మన దేశం వచ్చాక రాడికల్ డెమొక్రటిక్ పార్టీ పెట్టాడు. ఆ పార్టీనే అసలు కమ్యూనిస్ట్ పార్టీ అని వాదించేవాడు. కానీ **1940**లోకి వచ్చేసరికి ఆయన పార్టీనీ కాక కమ్యూనిస్టు పార్టీని మాస్కో ఆమోదించింది. అందుచేత అబ్బూరివారు వామపక్షానికి చెందిన వారే. ఆయన మాతో ఓ విషయం కూడా చెప్పారు. తానంత వరకూ రాసిన కవిత్వం సరియైన కవిత్వం కాదనీ, ప్రజాకవిత్వం వేరే విధంగా రాయాలని! ఆయనకి ఒక నమ్మకం కూడా ఉండేది. కానీ ఆయనెప్పుడూ అది రాయలేదు. దానికోసం ఏవిధమైన ప్రయత్నం చేయలేదు. ఆయనా విధమైన చర్చలూ చేయలేదు. కానీ ఆయన అభ్యుదయ రచయితలు, వాళ్ల భావాలు ఆమోదిస్తూ ఉండేవాడు ఆయన ప్రభావం శ్రీశ్రీ మీద కొంత ఉండడానికి సావకాశం ఉంది. వాస్తవంగా విజయనగరంలో రోణంకి అప్పలస్వామి ప్రభావం, కాలేజీ మేగజైన్ల ప్రభావం శ్రీశ్రీ మీద అపారంగా ఉండేది. అతను ఈ పత్రికల కోసం, మా కోసం విజయనగరం వచ్చేవాడు. మార్పు చెందిన తర్వాత అతను ఏదైనా రాసాడూ అంటే అది పట్టుకుని విజయనగరం రావాలి. రోణంకి అప్పలస్వామి మెచ్చుకోవాలి. నేను మెచ్చుకోవడం, నారాయణబాబు మెచ్చుకోవడం ప్రధానం కాదు, అప్పలస్వామే మెచ్చుకోవాలి. అప్పలస్వామి ఒకె అంటేదానికి నూరు సంవత్సరాలు కాదు, నాలుగు వందల సంవత్సరాలు జీవితం ఉందని మేం నిజంగా నమ్మేవాళ్లం. ఎందుచేత అంటే అప్పటికే ఆయన ఫ్రెంచిలోనూ, జర్మన్‌లోనూ నిష్ణాతుడయ్యాడు. ప్రపంచ సాహిత్యం తీవ్రంగా చదువుతున్నవాడు. సర్వసాధారణంగా ఏమి రాసినా మెచ్చుకునేవాడు కాదు. రాసినదానిమీద ఏదో ఒకటి - మాటదగ్గర్నుండి భావం దగ్గర్నుండి ఇది బాగులేదు. ఇది బాగులేదు అని విశ్లేషణచేసి పాపం చెప్పేవాడు. ఆ చెప్పిన కారణం చేత అతను 'బాగుంది! ఎంత బాగా వచ్చిందీ!

అని అన్నాడా అది నిజంగా బాగున్నదనే అర్థం. నారాయణబాబు కవిత్వం గాని, శ్రీశ్రీ కవిత్వంగాని, తరువాత నేను రాసిన కథలుగాని అతను ఒకే చేసిన వాటికి ఈరోజు దాకా ఢోకాలేదు. శ్రీశ్రీ మీద విశాఖపట్నం కన్నా ఇక్కడి ప్రభావం గొప్పదని చెప్పాను కదా! ఆ ప్రభావంతో వచ్చిన అతని గీతం "పిల్లాల్లారా బుడతల్లారా" అన్నదానిని ఓ నాడు తీసుకొచ్చాడు. ఎందులోంచి వచ్చిందా గీతం అంటే చెప్పడం కష్టం. ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచి - ఈ మూడు భాషల కవులు రాసిన లిరిక్సు అప్పలస్వామి చాలా విశ్లేషించి చెప్పి బోధపర్చుతూ ఉండేవాడు. మేం అడుగుతూ ఉండేవాళ్ళం. ఆయన చెబుతూ ఉండేవాడు. దానిమీద చర్చ చేస్తూ ఉండేవాళ్లం. లిరిక్కు కవుల్లో జర్మన్‌కవి హైన్రిక్ హైనే గీతాలు చదివి వరసగా మాకు బోధపరిచేవాడు అందులో ఉన్నటువంటి చందస్సులో ఉన్న మజాలన్నీ చెబుతూ ఉంటేవాడు. భాషేదవనీ, ఫ్రెంచిలో ఉన్నా జర్మన్‌లో ఉన్నా ఆ ఛందస్సుని శ్రీశ్రీ పట్టుకునేవాడు. శబ్దం కదా అదీ - శబ్ధ మాధుర్యం ఎలా ఉంది, ఆ శబ్ధం వాడు ఆ కవి ఎలా, ఎలా వాడాడు. ఆ ఛందస్సులో ఎలా వాడాడు. ఆ ఛందస్సుని మన తెలుగులోకి ఎలా తర్జుమా చేయాలి; ఇదీ అతని తపన. ఆ తపనకి బాగా దోహదం చేసేవాడు అప్పలస్వామి. శ్రీశ్రీకి ఇంగ్లీషు బాగా వచ్చును గనుక ఇంగ్లీషు కవుల్లో ఇద్దరికి బాగా అనుయాయుడై పోయాడు. వాళ్ళు - స్విన్‌బర్న్ -ఎడ్గార్ ఎలన్‌పో. అందులోనూ ఎడ్గార్ ఎలన్‌పో ఏది రాసినా ఎలాగ ఆ ఛందస్సుని తెలుగులోకి లాక్కురావడం -మన మాత్రా ఛందస్సులో ఎలా బిగించడం ఆ ఎఫెక్ట్ వచ్చేటట్టు ఎలా రాయడం అని అతగాడు కృషి చేస్తూ ఉండేవాడు. ఆ ఫలితంగానే గురజాడ అప్పారావుకి మాత్రాఛందస్సులకి అనుయాయుడయ్యాడు.

శ్రీశ్రీ రాసిన 'శైశవగీతి'అతను చదవగా నారాయణబాబు మహా అందంగా భావయుక్తంగా పాడగా దానిని వేనోళ్ల రోణంకి అప్పలస్వామి పొగిడాడు. అంతకుముందు తెలుగు సాహిత్యంలో ఆ విధమైన ఛందస్సులో గీతం రాసినవారు ఎవరూ లేరు. శ్రీశ్రీయే రాశాడు. ఆ ఛందస్సును పట్టుకొన్న శ్రీశ్రీ సామాన్యుడు గాడు. బహుభాషల తాలూకు సౌష్టవాన్నుండి తెలుగుభాషా సౌష్టవాన్ని సృష్టించుకున్నాడు. అది పిల్లలకి అనుగుణ్యంగా చేసుకున్నాడు. అందులో 'ప్రమాద వీణలు కమాచి పాడగా' లాంటి చక్కని లైన్స్ చక్కగా రాసాడు. ఆ గీతాన్ని ఆకాశానికెత్తగానే ఇక్కడ విజయనగరంలో శ్రీశ్రీ సంబరం ఇంతా అంతాగాదు.

ఆరోజు మందు రెండు పెగ్గులు మూడు పెగ్గులుకాదు నాలుగైదు పెగ్గులుతాగేసాడు. అంత సరదా అయిపోయాడు. వాస్తవంగా ఇప్పటికీ ఆ గీతం గొప్పది. దానికి సందేహం లేదు. తెలుగుసాహిత్యంలో గొప్పదీను! ఆ తరువాత ఆ వరసలోనే నారాయణబాబు స్పందించి వ్రాసినట్టిది - ఆ రోజుల్లోని భగత్సింగు సుఖదేవు, రాజగురు గురించినది. నారాయణబాబు చాలా ఆగ్రహావేశంతోటి రెండుగీతాలు రాసాడు. ఒకటి పురాణగాథగా కల్పించి రాసాడు. అదే 'కపాలమోక్షం'. రెండోది 'భగత్సింగు శాపం' అన్న చిన్న ఖండిక. గాంధీజీ సహాయ నిరాకరణ చేసేవాడు. అహింసా వాది కదా! గాంధీ -ఇర్విన్ ఒడంబడికలో వాళ్ల ప్రాణాల విషయం ఎత్తలేదు. దాన్ని వదిలి పెట్టేసాడు. ఎందుచేత? ఆయన అహింసావాది. వాళ్ళు హింసావాదులు. వాళ్ళని బలిపెట్టేసాడు. వాళ్ల ఉరిశిక్ష తప్పించాలి అని ఆ ఒడంబడికలో పెట్టలేదు. అది అందరికీ ఆగ్రహం అయింది. నెహ్రూకి ఆగ్రహం ఉంది. ఎం లాభం? అతను అగ్రనాయకుడు. అతను ఏం చెబితే అదే కాంగ్రెస్సు!! అందుచేత వాళ్ళ ముగ్గుర్నీ ఉరి తీసారు. గాంధీ ఇర్విన్ ఒడంబడికలో భగత్సింగుని బలిపెట్టేసారు గాంధీజీ. దీనిమీద కోపంవచ్చి "భగత్సింగుశాపం"అని రాసాడు. ఈ రెండు గీతాలున్నూ మహోత్కృష్టమైనగీతాలుగా మేం భావించాం. రోణంకి ఆమోదించాడు. కపాలమోక్షం మంచి గాథ. ఈశ్వరుడు బ్రహ్మ కపాలాన్ని పట్టుకుని యాచించి బ్రతుకుతున్నాడు. ఆ బ్రహ్మ కపాలమేమో పోయింది. మరో కపాలం కావాలి ఈశ్వరుడికి. అక్కడనుంచి అనేక కపాలాలేమో ఈశ్వరుడి చేతికి వెళదామని ఎదురుచూస్తూ వచ్చాయి గాని, ఓ కపాలం ఆయన చేతుల్లోకి ఎగురుకుంటూ వచ్చింది. అదే భగత్సింగు కపాలం. ఇదీ ప్రధానమైన కథ.

'రుధిర జ్యోతి', మహాప్రస్థానం ఏక కాలంలో - ముందువెనకలు చెప్పలేం-వ్రాయడం ప్రారంభమైనాయి. ఆ ప్రారంభమేమో నారాయణబాబూ శ్రీశ్రీ ఏకస్తులయ్యే ప్రారంభించారు. ఇద్దరూ భావ కవిత్వానికి విరోధులయ్యారు. శ్రీశ్రీ ప్రచ్ఛన్నంగా నారాయణబాబు బహిరంగంగా భావకవిత్వానికి విరోధులు. శ్రీశ్రీ ఎప్పుడూ భావకవిని ఏమీ అనలేదు. వాళ్ళ విషయాన్ని తరవాత ఎప్పుడో ఏదో అన్నాడు గాని ఆ రోజుల్లో చచ్చినా ఆ వూసూ ఏదీ అనలేదు. నారాయణబాబు బహిరంగంగా ఉపన్యాసాలలోనూ, తన కవిత్వం ద్వారాను భావకవులు - భావకవుల స్థితిని చాలా బాగా చెప్పాడు. భావకవిత్వాన్ని పలాయన వాదం అని ఉపన్యాసాల్లో అనేక చోట్ల

చెన్నపట్నం నుంచి యావదాంధ్రదేశం - ఎక్కడ పడితే అక్కడ! నారాయణబాబు ఉపన్యాసం అంటే ఓ పెద్ద ఆవేశంతో కూడుకున్నటువంటిది. ప్రజాసాహిత్యానికి మూలకమైన సూత్రాలతో, భావకవిత్వం ఎందుకుకూడదో చెప్పేవాడు. నారాయణబాబు భావకవుల పద్యాలు ఇంచుమించు అన్నీ కంఠస్థంగావచ్చినవాడు. భావకవులుఎవరూ చదవలేనంత చక్కగా, భావయుక్తంగా, లయాకృతంగా, రాగయుక్తంగా చదవడంలో గొప్పవాడు. ఓవూపు వూపేసేవాడు. వాళ్ళ పద్యాలు చదివి అందులో నల్లమందు నిషా ఉన్నదని చెప్పేవాడు. ఆ నల్లమందు నిషా ఎలా ఉందో ఎక్కడిపడితే అక్కడ వాళ్ళ పద్యాల్లోంచి ఉదాహరణలిస్తూ ఉపన్యాసమిచ్చేవాడు. వాళ్లేవిధంగా దంతభవనంలో ఉన్నారో చారిత్రకంగా చెప్పేవాడు. కృష్ణశాస్త్రిగారు బ్రహ్మ సమాజంలోంచి వచ్చినవాడు. ఆ బ్రహ్మ సమాజం వారు కుల మత - అతీత భావాలు కలవారే. అంతవరకూ నిజమే. కానీ ఈ గాంధీజీ ఉద్యమం - కాంగ్రెస్ ఉద్యమం ఆయనని కదపలేదు. నన్ను కదపలేదని స్పష్టంగా చెప్పవాడాయన. ఈ కదపడం ఎప్పుడూ 1920 - 30 లలో భావకవిత్వం బాగా ఉన్న రోజుల్లో! ఆ రోజుల్లో వేలకు వేలు జైల్లో ఉన్నారు. జలియన్‌వాలాబాగ్ హత్యలు - భగత్సింగు, రాజగురు, సుఖదేవుల్ని ఉరితీసారు - ఇవేవీ కూడా ఆయన్ని కదపలేదు. ఆ రోజుల్లో ఆయన రాసిన కవిత్వానికి ఆ కాలానికి ఏవిధమైన సంబంధం లేదు. ఈ భావకవి వేరేగా మరో ప్రపంచంలో ఉన్నారు. సృష్టించుకున్న ప్రపంచం, సృష్టించుకున్న లేని ప్రేయసి- దానిమీద శ్రమ చేస్తూ, దాని కోసం ఆరాటపడుతూ, నన్ను మనసారా ఏడవనీయండి నా మానాన నన్నొదిలీయండి అన్నాడాయన. అదీమొత్తం దృశ్యం!! ఈ భావకవిత్వం శ్రీశ్రీ నారాయణబాబుల ఆవిర్భావంతో సుబ్బరంగా డిస్ క్రెడిట్ అయిపోయింది.

భావకవిత్వం మీద తిరుగుబాటు చేసిన నారాయణబాబు, శ్రీశ్రీ - వీళ్లకు తోడు కాస్త ఎడంగా అయినా, దగ్గిరగా అయినా, పురిపండా, జలసూత్రం వాళ్ళకి దగ్గరగా ఉన్నారు. నారాయణబాబు వాళ్లింట్లో ఉయ్యాల మీద కూర్చొని శ్రీశ్రీ, తనూ, నారాయణబాబూ భావగీతాలు బహు భావయుక్తంగా, మనోహరంగా, రాగయుక్తంగా పాడేవని శ్రీశ్రీ అనంతంలో రాసుకొన్నాడు. కానీ ఆ తరువాత విషయం రాయలేదు. భావగీతాలే కావు తనకొత్త గీతాలు కూడా నారాయణబాబు మహోద్రేకంతో, తన భావాన్ని వ్యక్తం చేస్తూ చాలా పెద్ద గాత్రంతో ఆలాపన చేసి పాడుకునేవాడు. అతను

నోటితోటే పాటలు రాసుకొంటూ ఉండేవాడు. ఎప్పుడూ కలం పట్టుకొని కాయితం మీద నారాయణబాబు గీతం రాయలేదు. నోటితో అల్లుకోవడమే, రాయడం లేదు. అదే నారాయణబాబు గీతరచనకి పద్ధతి.

నారాయణబాబు దేశంలోకి వెళ్లాడు. దేశంలోని ఏ ఊరెళ్లినా ఓ గంభీరోపన్యాసం చేస్తూ ఉండేవాడు. శ్రీశ్రీ, నారాయణబాబు కలిసి చెన్నపట్నంలో చాలాచోట్ల మాట్లాడారు. అందులో నారాయణబాబు ఉపన్యాసం ఇవ్వడంలో గొప్పవాడు. శ్రీశ్రీ అంత బాగా మాట్లాడలేడు. తన భావాల్ని అందంగా వ్యక్తం చేయలేడు. అంచేత శ్రీశ్రీ తన తత్వాన్ని చెప్పేవాడు. వామపక్ష తత్వాన్ని. భావకవుల మీద ఒక్కమాట ఎన్నడూ అనలేదు. బహిరంగ సభల్లో శ్రీశ్రీ ఏకారణంచేతో భావకవుల మీద తటస్థంగా ఉండేవాడు. నారాయణబాబు విచ్చలవిడిగా ఏమాత్రం భయపడకుండా ఎదురుగుండా భావకవుల్ని పెట్టుకుని భావకవిత్వంలో ఏ అసందర్భాలున్నాయో వ్యక్తం చేసేవాడు. ఆ భావ గీతాలు అందరు రాసినవి కంఠస్థమే నారాయణబాబుకి. ఏదికావల్సినా వెంటనే పాడేవాడు భావయుక్తంగా. ఆ పాట అబ్బ ఎంత బాగా పాడేడు అని మనం అనుకుంటామా - వెంటనే అందులో ఉన్న అసందర్భాన్ని వ్యక్తం చేసేవాడు. అలాగా ఎదురుగుండా క్రిష్ణశాస్త్రిని పెట్టుకుని, క్రిష్ణశాస్త్రి గీతాల్ని పాడి అందులోనున్నటువంటి పలాయన వాదం ఏదో వ్యక్తం చేసేవాడు. ఎక్కడికివెళ్లినా సరే ఆ భావాల్ని చెబుతూ ఉండేవాడు. తను రాసిన గీతాల్లో కూడా రెండు చోట్ల ఆ భావకవులకి చాలా బాధ కలిగించే మాటలు అన్నాడు. 'చచ్చిన ప్రేయసి కముురు కంపు ఈ లోకం' అని! ఇంతకన్నా అధ్వాన్నంగా ఏం ఉంటుందీ? భావకవిత్వాన్ని దుయ్యబెట్టడానికి! ఇది అన్యాయం. ప్రజలు మహాదరిద్రంలో ఉన్నారు. మనం బ్రిటిష్ పరిపాలకుల కింద బానిసలమై ఉన్నాము. ఓ ప్రక్క వేల కొద్దీ జైళ్లకి పోయున్నారు. లాఠీ చార్జీలవుతున్నాయి. వాటివేటికీ స్పందించక ప్రేమ గీతాలు, ప్రేయసీ, ప్రేయసీ అంటే అది బతుకా!!

"ఖ్యాతి గడించే గీతం రాసి ప్రేయసికి అంకిత మీయాలంటూ మూతిబిగించీ చేతులు ముడుచుకు కూచున్నావా కవీ" అని ఓ గీతంలో రాసాడు. ఈ భావాన్ని ఉపన్యాసంలో ఇంకా బాగా అనేవాడు. ఓసారి - అమలాపురంలో విజ్ఞాన సమితి సభలు అవుతూ ఉండేవి - ఆ సభకి నారాయణబాబు ఉపన్యాసకుడు. ఎదురుగుండా క్రిష్ణశాస్త్రిగారు కూర్చున్నారు. కాటూరు వెంకటేశ్వరరావు గారున్నారు. పింగళి

లక్ష్మీకాంతంగారు కూర్చున్నారు. ఇంకెవరెవరో భావకవులూ చాలామందున్నారు. ఆవేళ ఈ భావకవుల్ని తన వామపక్ష సిద్ధాంత రీత్యా దుయ్యబడుతూ ఒక గంటన్నర ఉపన్యాసం ఇచ్చాడు. ఈ ఉపన్యాసమైపోయిన తరువాత చదువుకొన్న నా మిత్రుడు, నా దగ్గర కొచ్చి 'మీ నారాయణబాబు', అన్నాడు. ఎంచేతా? విజయనగరం వాళ్ళం మేం ఇద్దరమని తెలుసు.. "భావ కవిత్వాన్ని గొంగళి పురుగు ఉంది చూసావా? ఆకుల్ని తినేస్తుంది. ఆకులు తాలూకు చిన్నచిన్న ఈనెలుంటాయి అవి వొదిలేసి మిగతా ఆకుపచ్చనంతా తినేస్తుంది. అస్తిపంజరం ఆకు తాలూకాది మిగుల్తుంది. మీ నారాయణబాబు గొంగళిపురుగు ఆకుల్ని తినేసినట్లు భావకవిత్వాన్ని తినేసాడన్నాడు." అంటే అంత బాగా వ్యక్తం చేయగలిగేవాడు. మళ్లీ భావకవులకీ, అందరికీ మిత్రుడే. ఆ క్రిష్ణశాస్త్రికి నేను పెద్ద బుజ్జాయిననేవాడు. ఆయన కొడుకు బుజ్జాయి. నేను పెద్ద బుజ్జాయిననేవాడు. వారితోనే తిరుగుతుండేవాడు. ఆయనకి చాలా కోపం వచ్చింది. వచ్చినా ఏం చేయలేడు. ఏం చేస్తాడు. సిద్ధాంతరీత్యా మాట్లాడుతున్నాడు గాని, వ్యక్తిగతంగా వైషమ్యం చెప్పడం లేదు. అతని వ్యక్తిత్వం బాగులేదనడం లేదు. అతని వ్యక్తిత్వం మంచిదే. కాని ఇప్పుడది పనికి రాదంటున్నాడు. ఈ కాలానికి, ఈ ప్రజలకి పనికిరాదు. ప్రజాకవిత్వం రాయమంటున్నారు. తను ఏం చెప్పాడు దరిద్రాన్ని చెప్పాడు. ఎలా చెప్పాడు? తన దరిద్ర సంగీతానికి భూమీ ఆకాశం తాళం చిప్పలట అవి ఎంత పెద్దవీ అంటే భూగోళం మొత్తం మీదేమో దరిద్రం ఉందీ, ఆ దరిద్రం ఎంత అంటే భూమీ ఆకాశం తాళం చిప్పలు చేసి వాయించాలట. తన కవిత్వంలో ఇలాంటి భావాలు వ్యక్తం చేశాడు. అందుచేత అతను భావకవిత్వాన్ని ఎంత దుయ్యబెట్టినా వాళ్లు ఎదురుగుండా ఏం అనలేకపోయేవారు. ఉపన్యాసంలో జవాబు చెప్పేవాళ్ళు లేరు. అతని ఉపన్యాసం అయిన వెంటనే ఎవరైనా జవాబుచెప్పొచ్చు. ఎవరూ చెప్పలేదు. ఊరుకొనేవారు. అయితే శ్రీశ్రీ అలాకాదు. అతను వాళ్ళ జోలికి ఎప్పుడూ వెళ్ళలేదు. మా అందరి దగ్గర మాత్రం భావ కవిత్వం మంచిది కాదు అని చెబుతూ ఉండేవాడు. తర్వాత విశ్వనాథ సత్యన్నారాయణ మీద ఏవేవో మాటలన్నాడు. జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి ఏ కవి ఎలాగ పద్యం చదివితే అలాగు చదవగలడు. మిమిక్రీ లాంటిది. ఆ పద్యం అతనిలాగే చదివి ఆ వెంటనే వెక్కిరించే వాడు. అలాంటి ఉపన్యాసాలు కొన్ని అతనూ చేశాడు. తరువాత మాచిరాజు దేవీప్రసాదు వచ్చాడు. అతనేం

చేసాడంటే భావకవుల పద్యాలు తీసుకొని వాటికి పేరడీలు రాసేవాడు. అంటే భావకవిత్వాన్ని అపహాస్యం పాలు చేశాడు. అంతవరకే చేశాడాయన. కాని మొత్తం మీద చెప్పవలసినది ఏమిటంటే. నారాయణబాబు చేసినంత కృషి ఎవరూ చేయలేదు. దానివల్ల ఏమయిందీ ఒవిధంగా భావకవులకి శత్రువులాంటి వాడయాడు. ఆధునిక కవులకి మార్గదర్శి కూడా కాలేదు. ఎందుచేత అంటే ఆయన నిగూఢమైన కవిత్వం రాసాడు.

శ్రీశ్రీ నారాయణబాబులిద్దరూ మొదట భావకవులు కదా! వాళ్ళు భావకవిత్వపు రోజులనుంచీ భగవద్భక్తులు. "ఓ ప్రభూ" అంటూ గీతాలు శ్రీశ్రీ రాసుకున్నాడు. నారాయణబాబు గూడా భక్తి సంబంధమైన గీతాలు రాసాడో లేదోగాని భక్తి గలవాడే. శ్రీశ్రీ 'మరో ప్రపంచం' రాసాడు. అందులో 'హరోంహరా' అన్న శబ్దం ఉందిగదా! అది హరశబ్దమే. సరియైన శబ్దమే, నమ్మకంతో కూడుకున్న శబ్దమే అది. కాని అదికాదు దేనికో ప్రతీకగా రాశాడని కొంతమంది విమర్శకులే చెప్పడం కద్దు. కాని అది న్యాయం గాదు. శ్రీశ్రీ ఆస్తికుడు, అది రాసాడు అని మనం అనుకోవడం మంచిది. ఎందుచేతా శ్రీశ్రీ నారాయణబాబులిద్దరూ మార్క్సిస్టు భావాల చేత ప్రభావితులైన వారు తప్ప భౌతికవాదులు గాదు. ఏదో బ్రహ్మ పదార్థం ఉంది అని నమ్మేవాళ్లే ఇద్దరూ.

శ్రీశ్రీ మహాప్రస్థాన గీతం చాలాకాలం వరకూ అచ్చుకాలేదు. ఇక్కడ నారాయణబాబు చాలా ఉద్రేకంగా దానిని చదివేవాడు. ఎంతందంగా చదివేవాడో అది టేప్ చేసి ఉంటే - ఆ రోజుల్లో టేప్ - అవీ ఉంటే ఎంత బాగుండేదో, ఆ గీతం అచ్చయిన తరువాత దేశమంతటా చాలా తక్కువ కాలంలోనే వ్యాపించింది. మరో గీతం దానికి మించింది వ్రాస్తానని అంటూ ఉండేవాడు. అన్నాడు గాని అన్నది రెండు మూడు సంవత్సరాలకి గాని రాయలేకపోయాడు. రాసేదానికి ముందే పేరు పెట్టాడు. ఆ పేరు చెబుతుండేవాడు. అదేమిటి అంటే 'జగన్నాథ రథచక్రాలు' మార్క్సిస్టు భావాలు వున్న కారణంచేతా, తన నమ్మకంతోనూ ఈ జగన్నాథ రథచక్రాలు రాశాడు. జగన్నాథస్వామి అన్న భావంతోటే రాశాడు. కాని ఇప్పుడు అదేదో ప్రతీకగా పెట్టాడు అని మన విమర్శకులు అనడం ఉందే అది సరైనదికాదు. ఎందుచేతనంటే ఈ నమ్మకం ఉందారోజుల్లో. చచ్చిపోయేదాకా నమ్మకం ఉంది. అది ముందు గ్రహించి దానిప్రకారం దాన్ని అన్వయిస్తే అది తప్పు కాదు. వామపక్షానికి

స్నేహితుడు, ప్రజల పక్షం వాడు. ప్రజల కోసం రాశాడు. ఆ వామపక్షాలకి చెందిన వారికి ఉపకరిస్తుంది. వాడుకుంటాం. తప్పు లేదు. అంతవరకే. కానీ కపట నాటకం ఆడితే ఏంచేస్తాం. దానివల్ల మనకు ప్రయోజనం లేదు. శ్రీశ్రీలో తనకుండే ఆస్తికవాదం భావాలు కనిపిస్తుంటాయి. నిగూఢంగా అది లోపల దాచుకొన్నాడు. కాని ఎక్కడో ఓ చోట కనపడిపోతాడు. నారాయణబాబు 'ఓపెన్ హార్ట్ మేన్' లోపలేమనుకొంటున్నాడో అది బయటకి చెప్పేవాడు. తానేం నమ్ముతున్నాడో చెప్పేవాడు. అందులో ఏం దాపరికం లేదతనికి. ఆ మనిషిలోనే ఓ చంటిపిల్లాడితనం ఉంది.

దేవుడూ సంప్రత్యయంతో నమ్మడు. శాస్త్రీయంగానే నమ్ముతాడు. అందులోనూ సైంటిఫిక్ ఎప్రోచ్ ఉంది. మూల కారణం దీనికి ఏదో ఉంది విశ్వానికి. అది బ్రహ్మపదార్థం. ఈ బ్రహ్మపదార్థాన్ని రెండు రకాలుగా నమ్ముతాడు. మూర్తి కల్పన చేసారు కదా ప్రాచీనులు. ఆ మూర్తుల్లో అతనికి నచ్చేవి రెండు. మగ అయితే నటరాజు, ఆడ అయితే కాళీ. ఈ రెండు. రూపకల్పనలూ నారాయణబాబుకి చాలా ప్రీతి. అందుచేత అతని కవిత్వంలో ఈ రెండూ కనపడుతూ ఉంటాయి. తను స్పష్టంగా నమ్ముతున్నాననీ చెబుతాడు. ఆఖరికి అతను అధివాస్తవిక కవిత రాసాడు కదా అందులో - 'మౌనశంఖం'లో స్పష్టంగా తెలుస్తుందంతా, మనవాళ్ళ యోగశాస్త్రం మీద పూర్తిగా విశ్వాసం ఉంది. ఆ యోగ సిద్ధి అన్న దానిమీద నమ్మకం ఉంది. కానీ ప్రజల మనిషి. గాంధీజీ ఉద్యమానికి స్పందించాడు గాని తాను విప్లవకారుడు, ప్రజలపక్షం. నేను విద్రోహి కవినని చెప్పుకొన్నాడు. 'విద్రోహి' అన్నమాటబెంగాలీది. మనదికాదు. అందులో నుండి అతను ఆ మాటని తెచ్చుకున్నాడు నజ్రుల్ ఇస్లామ్ ఆమాట వాడాడు. నజ్రుల్ ఇస్లామ్‌కి అతను అనుయాయుడు. ఇమిటేట్ చేసాడని అంటారుగాని ఎక్కడా అతను చెయ్యలేదు.

స్వతంత్రంగా స్వంతభావాలు రాసుకున్నవాడే, విద్రోహ కవిని విప్లవ ఋషిని అని రాసుకొన్నాడు. ఆ రాసుకోవడం వల్ల అతను ఏ పక్షాన ఉన్నాడో తెలుస్తుంది. విప్లవకారుల పక్షాన ఉన్నాడో తెలుస్తుంది. విప్లవకారుల పక్షాన ఉన్నాడు. ప్రజల పక్షాన ఉన్నాడు. అందుకే భగత్సింగుని ఉరి తీయగానే 'కపాలమోక్షం' కవిత రాసాడు ఈ 'కపాలమోక్షం' ఎవరికీ బోధపడేది గాదు. అది కూడా పత్రికల వాళ్లు చాలాకాలం అచ్చెయ్యలేదు. ఆఖరికి ఎందులోనో అచ్చయింది. సోషలిస్టు పత్రికలో అచ్చయిందో,

జ్వాలలో అచ్చయిందో జ్ఞాపకం లేదు. సోషలిస్టు వాళ్ళంటే సిపిఐ వాళ్ళు. అందరూ కలిసి ఉండేవారు. గుంటూరు నుంచో ఎక్కడ నుంచో ఓ పత్రిక నడుపుతూ ఉండేవారు.'నవశక్తి' అలాంటి పేరుతోటి. ఆ పత్రికలో వీళ్లవి అచ్చయేవి. అందులో నారాయణబాబువి కొన్ని అచ్చయ్యాయి. 'కపాలమోక్షం' ఎలా వ్రాశాడు. పురాణగాధ ఎలా ఉందో అలా రాశాడు. ఈశ్వరుడి కపాలం పోయింది మరో కపాలం కావాలి. ఆ భిక్షాపాత్ర బ్రహ్మ కపాలం. అదీ కథ. భగత్సింగు కపాలం ఈశ్వరుడి చేతిలోకి వెళ్లింది... 'భగత్సింగు శాపం' కవిత రెండోది వాళ్ళకోసం గాంధీజీ గట్టిగా పట్టుపట్టి గాంధీ ఇర్విన్ ఒడంబడికలో రక్షించవలసినది. హింసావాదులని తాను అహింసావాది కనక వదిలేసాడు. నారాయణబాబు 'సహాయ నిరాకరణ మంత్రం' అని చెప్పే వాళ్ళని ఉరితీసావా నాయనా' అంటాడు.

నారాయణబాబూ శ్రీశ్రీ ఇద్దరూ రెండు భావాలతోటి రాసిన వారే! నారాయణబాబులో ప్రత్యక్షంగా కనబడుతుంది. శ్రీశ్రీలో ప్రచ్ఛన్నంగా లోపల్లోపల కనబడుతుంది.

# 4. ముద్దుకృష్ణ - వైతాళికులు

1935 ప్రాంతాలలో మా దగ్గరకి ముద్దు క్రిష్ణ అనే వ్యక్తి వస్తుండేవాడు. ఆ ముద్దుకృష్ణ అన్న వ్యక్తి చమత్కారంగా మాట్లాడేవాడు. మాట్లాడ్డంలో గొప్ప నేర్పరి. అనేక విషయాలు చదువుకొన్నవాడు. ఇక్కడే మా వూళ్లోనే ఓ స్థానిక పత్రిక వాళ్లడిగితే వాళ్లకు రాస్తుండేవాడు. సంఘ సంస్కర్తలెవరంటే గిరీశం, సీతాపతి, ముద్దుకృష్ణ అని రాసాడు. అంటే అంత చమత్కారం వున్న వాడని లెఖ్ఖ.

ఇతను జ్వాలపత్రికను తరువాత నడిపినవాడు. మొదట 'వైతాళికులు' అనే కవితా సంపుటి అచ్చేసాడు. బి.ఎ.చదువుకున్నాడు. ఏదో రాసీవాడు. వచన కవితలు కూడా రాసాడు. దేశమంతా తిరిగీ వూరూరా చందాలు వసూలు చేసి, ఎలాగో ఆ పుస్తకం అచ్చేసాడు. పుస్తకం పట్టుకొచ్చేడు. దాంతో మాకు మహా ఆగ్రహం వచ్చింది. అందులో వుండవలసిన వాళ్లు లేరు. కాటూరి పింగళి గీతాల్లేవు. నూతక్కి రామశేషయ్య గారిది వుంటుందనుకున్నాం. ముందు మా దగ్గరకి వచ్చినప్పుడు వేస్తానన్నాడు. కానీ అది లేదు. వైతాళికులకి రచనలు ఇవ్వకూడదనుకొన్న వాళ్లు ముగ్గురు. పురిపండా, శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబు. మనం ఇవ్వద్దనుకొంటే ఇవ్వద్దనుకొన్నారు. పురిపండా, నారాయణబాబులు ఇవ్వడం మానేశారు. అయితే శ్రీశ్రీమాత్రం దొంగచాటునిచ్చాడు. ఆ పుస్తకం వచ్చింది. అందులో విలక్షణుగా వున్న దేమిటీ అంటే శ్రీశ్రీది. అది భావకవిత్వానికి పుస్తకం. అప్పటికి నేను చాలా చిన్న కుర్రవాడ్ని. కాని నాకు చాలా కోపంవొచ్చింది. ఈ పుస్తకమేమిటి? వైతాళికులేవిటీ? మరో పుస్తకం వెయ్యాలని నిర్ణయించుకొన్నాం. నేనేం తెలుగులో వ్రాయలేదు. రచయితగా నాకు నేనేం కాదని చెప్పగల్ను. కాని పుస్తకం చూసాను. ఇది వైతాళికులు కాదని చెప్పొచ్చు. అందులోనున్న భావగీతాలన్నీను ఎవరికి

పనికివస్తాయి? మనలోనున్న ప్రేమభావాన్ని వికృతంగానో, సకృతంగానో తెలియజేస్తాయి. ప్రకోపింపచేస్తాయి. అందుకని ఆగ్రహం వొచ్చింది. మరొకటి మొట్ట మొదటి గీతం గురజాడ వారిది లేదు. రాయప్రోలు వారిది వేసారు. అందుకు కూడా చాలా కోసం వచ్చింది. ఆయనది వేసిన తరువాత ఈయనది వేయాల్సిందని మా అభిప్రాయం. ఆ రాయప్రోలు వారి గీతంలో 'ఏదేశమేగినా ఎందుకాలిడినా'లో "లేరు రా మనవంటి ధీరులింకెందు'' అని చరణాలుంటాయి. కేవలం హిందువుల కోసం రాసిన గీతం. భారతదేశం కోసం రాసింది కాదు. అప్పటికే - ఈ గీతం రాసిన నాటికే హిందువులూ, ముస్లిములూ కలసి ఈ దేశం నుండి బ్రిటీషువాళ్లని పారద్రోలాలని పోరాడుతున్నారు. ఆభావం వ్యాపించే వుంది. మహమ్మదీయులు దిట్టంగా వున్నారు. క్రైస్తవులువున్నారు. జైనులున్నారు. పార్సీలున్నారు. ఇంకా చాలా మంది వున్నారు. అటువంటప్పుడు ఈ మొత్తం దేశానికి ఆ గీతం ఎలా అవుతుంది? ఆ వైతాళికులు పుస్తకం వుందే అది ఈ చివర్నించి ఆ చివరిదాకా ఆమోదయోగ్యంగా లేదు. అది భావకవిత్వం. దానికి 'వైతాళికుల'ని పేరేంటి? భావకవిత్వం,కవిపుంగవులు వైతాళికులు కాదు. గురజాడ వైతాళికుడు. తరువాత మధ్యకాలంలో శ్రీశ్రీ, నారాయణబాబు అసలు వైతాళికులు. అందులో మార్క్సిష్టు దృక్పథం, ప్రజలదృక్పథం కల కవులు వాళ్లు. గురజాడ కూడా ప్రజల దృక్పథంతోటే వ్రాసాడు. మార్క్సిష్టు దృక్పథం లేదుకాని ఆ భావానికి దగ్గరగా రాసాడు కొన్ని. ఆయన దేశభక్తి గేయంలో ఆ విషయాలు మనకి మార్క్సిష్టు దృక్పథంలోనే కనబడతాయి. అది ప్రజల పక్షాన రాసింది. ఈరాయప్రోలు సుబ్బారావు గేయాలలో ఆయన ప్రగల్భాలన్నీ ఉన్నాయి. "లేరు రా ధీరులింకెందు'' అంటే ధీరులింకెవరూ లేరు అంటే శత్రువు తాలూకు బలాన్ని గ్రహించకపోవటం. శత్రువు నా అంతటి వాడని మనం వొప్పుకోవాలి. వాడు ఒక యోధుడు. ఆ యోధుడితో మనం యుద్ధం చేస్తున్నాం. అలాంటి యోధుడితోనే మనం యుద్ధం చెయ్యాలి. అవతలవాడి శక్తిని మనం కాదనడానికి ఏంలేదు. దుర్యోధనుడు భీముడికేం తీసిపోడు గదాయుద్ధంలో అయితే తొడలు విరగ్గొట్టి చంపాడు. ఎందుకని? వాడి వీడ్ని ఇంకేవిధంగా చంపలేడు కనక, అదో యుక్తి.. అందుచేత శత్రువు తనంతవాడు కాదు అన్న ఆత్మస్తుతి అందులో వుంది. అంతేకాదు ఆఖర్ని వుంది - "ఏ మంచిపూవులను పూజించినావో, జనియించినావు ఈ కనక గర్భమున'' మంచి పువ్వులు, గత జన్మలో ! ఇది మేం నమ్ముతామా? ఇక్కడ

పుట్టిన వాళ్లంతా గత జన్మలో మంచి పూలు పూజచేసారా, ఇలాంటి భావాలు ఎవరికున్నాయి? హిందువులకున్నాయి. ఇది శాస్త్రీయ దృక్పథం వున్న వాళ్లకి వికృతంగాకనబడతాయి. విచిత్రంగానూ నమ్మడానికి సావకాశం లేకుండానూ కనిపిస్తాయి. అందుచేత ఆ గీతం మొదటిగీతంగా ముందు వేయడం నాకు చాలా కోపం వచ్చింది. నేను విశాఖపట్నం వెళ్లి ముద్దుక్రిష్ణ ఏంథాలజీ వచ్చింది. కవితా సంకలనం చూసారా అనడిగాను పురిపండా అప్పలస్వామిని. ఆయనా చూసాడు. దాంట్లో చూడండి రాయప్రోలుది ముందేసి గురజాడది తరువాత వేసాడాయన. ఇది ముందు అది తరువాత వుండాలి. అక్రమం అది. వైతాళికులేమిటి? ఈపేరు దానికేమిటి? ఇందులో వైతాళికుల లక్షణాలెక్కడున్నాయి. ఆ గురజాడ వొక్కడే వైతాళికుడు. తరువాత వాళ్లెవరూ కారందులో. అందుచేత పుస్తకం వేద్దాం. ఆ పెట్టుబడేదో పెట్టుకుంటాను. పుస్తకం వేద్దాం, అంత పుస్తకం కాపోయినా చిన్నదే వస్తుంది. మనకన్ని గీతాల్లేవు, తయారు చేద్దామన్నాను. అందులో మరొక అసందర్భం వుంది. వైతాళికులు భావకవులిది. ఆ కవిత్వానికి మనం విరుద్ధమైన కవిత్వం రాస్తున్నామూ అందులో మన కవిత్వాలు వద్దా అనుకొన్న ముగ్గురిలో శ్రీశ్రీ వైతాళికులకి కవిత ఇచ్చాడనుకొన్నాం గదా. శ్రీశ్రీ గీతాలు 'నేను సైతం', 'అవి ధరాగర్భమున మానవాస్థికా పరంపరలు' మూడోది 'ఒకరాత్రి' 'విశ్వమంతా నిండి.' ఇలాంటివేవో వేసాడు. కాని మరో ప్రపంచమేసాడా? లేదు. ఎందుకు వేయలేదు. దీన్ని ఈయన ఇవ్వలేదు, లేదా ఆయన అక్కర్లేదన్నాడా? తెలీదు మనకి, కాని వుండడం అవసరం కదా! అదెందుకు లేదు? వైతాళికుల లక్షణం దానికుంది. కాని మిగతా గీతాలకి లేదు. అందుచేత మేం విప్లవ గీతాలు వేద్దాం అనుకొన్నాం. శ్రీశ్రీ ముద్దుక్రిష్ణతో సహకరించాడు గదా అదో కోపం వుంది. ఈ కోపం వున్నా మా వైతాళికుల కవుల్లోవాడు ప్రధానమైనవాడు కదా. నారాయణబాబు, శ్రీశ్రీలు తీసేస్తే మరెవరున్నారక్కడ. తతిమ్మావాళ్లమంతటి వాళ్లం కాదు. అందుచేత వాడ్ని పిలిచి ఇది వైతాళికులేంటి? మన కొత్త రకం కవిత్వం వెయ్యడం మానేసాడు. అయితే ఎందుకునువ్వు పంపించావని పురిపండా అడిగాడు. ఇచ్చాను. ఇవ్వలేదు. అతనేసేసాడు. అని ఏదో నంగిరి మాటలు చెప్పాడు. కాని మొత్తంమీద ఇచ్చిన మాట నిజం. వాడువేసిన మాట నిజం. సరే దాని మాటకేంలే, మనం విప్లవగీతాలని వేద్దాం, వైతాళికులకు ప్రతిగాను, అని అనుకొన్నాం. నేను అచ్చువేస్తానన్నాను. అయితే

శ్రీశ్రీ నేనూ ఓ చోట కూర్చొని అనుకొన్నదేంటంటే కవులెవరెవరున్నారు. అని ఒక్కొక్క కవిని తీసుకొంటూ వచ్చాం. ఇంద్రగంటి హనుమశ్ఛాస్త్రీ, పిలకా గణపతిశాస్త్రీ, శిష్ట్లా ఇలాగ ఏవో ఆలోచిస్తూ వెళ్లాం. రాస్తే ఓ పాతికేవో వచ్చాయి రావడం. అందులో శ్రీశ్రీ, నారాయణబాబులు మినహాయిస్తే మిగతావేవీ కూడా మాక్కావలసిన దృక్పథంలో లేవు. బీదవాళ్లమీద అభిమానంతో వ్రాయడం, ముష్టివేయమని రాయడం - అది మా దృక్పథమెలా అవుతుంది. ఏదో ముష్టివాడింటికొచ్చాడు. ముష్టివెయ్యి అని పాటరాస్తే మా దృక్పథమా? శాస్త్రీయ దృక్పథంలో రాయగలగాలి. అందుచేత ఆ ప్రాజెక్టు విరమించేసాం. అయితే ఇందులో ఒకటి వెయ్యదలచుకొన్నాం. శెట్టిమాష్టుగారు - శెట్టి లక్ష్మీ నర్సింహంగారు, గిడుగువారి మీద ఓ వచన గేయం రాసాడు. అదివేద్దామనుకొన్నాం. అది చాలా మంచిది. అదెందుకో ఎక్కడా ఎవరూ మళ్లీ వెయ్యలేదు తిరిగి. అదీ వైతాళికుల కథ. మేం వేసే ఈ విప్లవగీతాలకి శ్రీశ్రీ పేరుపెట్టాడు. ఆ పేరేంటయ్యా అంటే శుక్తి వాద్యములు. అదేంటయ్య అంత బరువు అంటే విన్నాడు కాదు. ఆ పేరు మీద రాసి ఒక్కొక్కరి పేరు, ఏమిటేమిటి కవిత - రాసుకుంటూ వెళ్లాం. కావలసిన సంఖ్యలో ఆ తేదీకి 1935కి విప్లవ గీతాలు దొరకలేదు. అందుచేత ఆ పుస్తక ప్రచురణ ఆపేశాం.

(1988లో చాసో చెప్పగా వెలుగురామినాయుడు రికార్డు చేసినది)

# 5. రవీంద్రనాథ ఠాగూరు

ఆంధ్ర విశ్వవిద్యాలయానికి రాధాకృష్ణ పండితులవారు వి.సి.గా అయిదేళ్లపాటున్నారు. ఆయన ఇంగ్లాండు తరుచూ వెళుతూ వస్తూ ఉండేవారు. ఆక్సఫర్డ్ పండితుడనుకొంటాను అప్పుడు కూడా ఆయన. చాలా పుస్తకాలు ఇంగ్లాండులో కొని ఆయనతో పాటు తీసుకొచ్చి ఎ.యు.లో పొందుపర్చేవారు. ఆ పుస్తకాలు మనదేశంలో నిషిద్ధ పుస్తకాలే. ఇంగ్లాండులో చదవబడే ఆ పుస్తకాలన్నీ భారతదేశంలో నిషేధించబడ్డవే. ఆ పుస్తకాలన్నీ ఆయన పట్టుకొచ్చేవారు. పెద్దాయన కదా ఎవరూ పట్టుకోలేదు. ఆ తెచ్చినవన్నీ ఆంధ్రవిశ్వవిద్యాలయంలో లైబ్రరీలో పెట్టించాడు. ఆ వామపక్షానికి చెందిన పుస్తకాలన్నీ మేం అక్కడికెళ్లినప్పుడు తిరగేసి చదువుతుండేవాళ్లం.

రాధాకృష్ణ పండితులవారు తరువాత చేసిన మంచి పని మరొకటి. పంధొమ్మిది వందలముప్పై నాలుగో, ముప్పై అయిదో - రవీంద్రనాథ్ ఠాగూరుగార్ని విశ్వవిద్యాలయానికి తీసుకొచ్చి ఉపన్యాసం యిప్పించారు. ఆయన మేన్ (మానవుడు) అన్న విషయం మీద వుపన్యాసం యిచ్చాడు. ఆ వుపన్యాసానికి విజయనగరం నుండి చాలామందిమి వెళ్లాం. నారాయణబాబు, పూడిపెద్ది వెంకటరమణయ్యగారు, రోణంకి అప్పలస్వామి మొదలైన వాళ్లమందరం ఇక్కడ నుంచి వెళ్లాం. కాలేజీ నుంచి బుర్రా శేషగిరిరావుగారు కూడా వెళ్లారు. ఆయన పెద్ద ప్రొఫెసరుగారు. ఠాగూరుగార్ని కలుసుకోవడానికి వెళ్లారు. మేం అంతా నేలమీద కూర్చున్నాం. పరదాలవి వేసారు. విశాఖపట్నంలో ఠాగూరుగారు వచ్చారని చెప్పి కవితా సమితివాళ్లు ఆయనకొక సన్మానం చేయాలి అని, మేం అంతా, ఈ సాహిత్య సంబంధీకులమంతా, వుగ్రం గారింట్లో పక్క వేశాం. వుగ్రం గారంటే తాళ్లూరి నర్సింగరావుగారు. చాలా చక్కటి

కవి ఆయన. చిక్కటి కవిత్వం రాసేవాళ్లలో ఒక్కడాయన. చాలా మంచికవి. ఆయనకు దేశంలో పేరుందో లేదో నాకు తెలీదుగానీ, నేననుకొన్న వాళ్లలో ఆయనపేరు వుంది. ఆయన ఇంటి నుండి బండిలో వెళ్లే వాళ్లం. ఎద్దులబండి. ఒక్కొక్కప్పుడు నడిచే వెళుతుండేవాళ్లం. కవితా సమితి తరపుని ఆయనని పిలవడానికి ఈ వుగ్రంగారు, తెన్నేటి విశ్వనాథంగారు ఇంకెవరో ముగ్గురెళ్లారు. అల్లాగ్గానే బుర్రా శేషగిరిరావుగారు, జైపురం రాజావారు వాళ్లూ ఇంటర్వ్యూ చేశారు. విజయనగరానికి సంబంధించి ద్వారం వెంకటస్వామినాయుడుగారు ఆయన సమక్షంలో కచేరీ ఇచ్చారు. దాంతో ఠాగూరుగారు పిచ్చెత్తిపోయి పొడ్డం మొదలెట్టాడు. నాయుడిగారి కచేరీలో పిచ్చెత్తిపోయాడనే చెప్పాలి. గంటో ఎంతో ఆయనతో కాలక్షేపం చేసాడు. ఆయనతో బహుశా నారాయణబాబు వెళ్లుంటాడు.

తాళ్లూరి నర్సింగరావు, తెన్నేటి విశ్వనాథం గార్లు కవితా సమితి తరపున ఆహ్వానించారు. ఆయన ఆమోదించారు. పౌరసన్మానానికి. ఆరోజుల్లోనూ ఠాగూరుని విశ్వకవి అని అంతా పొగుడుతుండేవారు. ఇంకా కుర్రాడు శ్రీశ్రీ. నా కన్నా అయిదేళ్లు పెద్దుంటాడు శ్రీశ్రీ. శ్రీశ్రీ ఠాగూర్ని కవిగా ఒప్పుకోలేదు. తత్వాల్లోనూ వాటిల్లో వున్న దాని కన్నా ఏం ఎక్కువ రాసాడీయన? ఈయన గీతాంజలికేమో నోబుల్ ప్రైజ్ ఇచ్చేసారు. ఆ గీతాంజలి గీతాల్లేమున్నాయి. మన తత్వాలకన్నా గొప్పవి కావు అని అంటూండేవాడు. అంటే కొంత వరకు నేనూ వాడితో ఏకీభవిస్తాను. అవి అంత గొప్పవని ఇప్పటికీ నేననుకోవడం లేదు. శ్రీశ్రీ చెప్పినట్టు తత్వాలకన్నా అవి గొప్పవి కాదన్నాడే అందులో కొంత నిజం వుంది. మన ప్రాచీన భావాలు ఆయన బెంగాలీలో ఎలా పెట్టాడో,అది ఇంగ్లీషులో పెడితే చాలా విలక్షణంగా చాలా విచిత్రంగా పాటకట్టాడు. ఇంగ్లాండు వెళ్లి కొన్నాళ్లున్నాడక్కడ. ఆ సమకాలీన కవులంతా ఇతన్ని పెద్దజేసి ఈయనో గమ్మత్తైన కవి అని చూసారు. ఆ తరువాత టి.ఎస్. ఇలియట్, ఇజ్రాపొండు మొదలైన కవులు ఠాగూర్ని వొదిలిపెట్టేసారు. ఆతరువాత ఆగ్రూపు కవులుగాని మరెవరుగాని ఠాగూర్ని కవి అని అన్న పాపాన పోలేదు. అతనో కవి అని ఒప్పుకోలేదు. ఇంగ్లీషువాళ్ల తరుపున చూస్తే ఠాగూరు కవి కాడు. ఇంకో రకంగా అంటే రాజకీయ కారణాలచేత ప్రపంచమంతా వ్యాపించి కూర్చున్నాడు. మనవాళ్లు అతన్ని బ్రహ్మరథం పట్టేసారు. ఎందుకంటే ఆయనకు నోబుల్ ప్రైజొచ్చింది. ఆయనో పెద్ద జమీందారీ కుటుంబానికి చెందినవాడు. వాళ్లనాన్న

పెద్ద వ్యాపారస్థుడు. ఆనాటికి విలాస జీవితం జీవించినవాడు ఠాగూరు తండ్రి. అంచేత అప్పటి విలాస సమాజంలో వున్న వాళ్లంతా ఫ్రెండ్సే. డబ్ల్యు.బి. ఈట్సు ఇంట్రడక్షన్ రాసాడు. నోబుల్ ప్రైజ్ విన్నర్, ఇలా అందరితోటి పరిచయం వుండేది. అందుకే ఈయనకి నోబెల్ ప్రైజ్ ఇచ్చారు. ఆ నోబుల్ ప్రైజ్ ఇంకెవరికో ఇస్తారనుకొంటే ఠాగూరుకి ఇచ్చారు. ఆ ఇంకెవరో ఎవరూ అంటే థామస్‌హార్డీ.

ఒక్కొక్కప్పుడు అదృష్టం చేతకూడా కొందరికి వస్తాయి. అలాగే వాళ్ల దృష్టిలో ఠాగూరువున్నాడు. ఇచ్చారు. భారతదేశానికి అలా నోబెల్ ప్రయిజ్ వచ్చింది. అంటే మాలోనూ ఇంతటి వారున్నారూ, ఒకరినొకరు పొగుడుకోవడానికి, మనల్ని మనం ఎక్కువ జేసుకోవడానికి పనికొచ్చింది. మనం భావదారిద్ర్యంలో వున్నాం గదా అంచాత అందరూ ఠాగూర్ని కీర్తిస్తూ వచ్చారు. ఆ కీర్తిస్తూవుండడంలోనూ మన గాంధీజీవున్నాడే - అతను శాంతినికేతన్ గురుదేవుడు. నాగురుదేవుడని కీర్తించాడు. అంచాత అంత బాగా పేరున్నవాడాయన!

అంతకీర్తివున్నవాడ్ని ఇక్కడేమో శ్రీశ్రీ అతన్ని కవి కాదన్నాడు. కానీ ఠాగూరు అంతర్జాతీయతత్వం ఉన్నవాడు. ఆయనలోవున్న మార్మిక కవిత్వం మాకు నచ్చదు. అది నిజమే. వ్యక్తిగతంగా ఆయన కవి కాదనడానికి మాకు అర్హతవుంది. ఠాగూరు రాసిన కథలున్నాయే చాలా చక్కటివి. కథానిర్మాణం ఠాగూరు చాలా బాగా చేస్తాడు. చాలా అందమైన కథలు రాసాడు. కథకుడుగా చాలా గొప్పవాడు. అతను రాసిన నవలల్లో అప్పటి సమాజం గురించి రాసాడు. బ్రహ్మసమాజం, మరొకటి, ఇంకొకటి రాసాడు. నవలల్లో వర్తమానకాల జీవితంలోనించి మంచి అభ్యుదయ భావాల్తో రాసాడు. మంచి నవలా కారుడుగా ప్రపంచప్రసిద్ధి వున్నవాడుగాదు గాని మన భారతదేశంలో ఆ విధమైన నవలలు రాసిన మొదటివాడిగానే లెక్కగట్టొచ్చు. ఠాగూరు కన్నా శరత్ చంద్ర చటర్జీ నవలాకారుడుగా చాలా గొప్పవాడు. అందులో అబద్ధమేమీ లేదు. ఠాగూరు కొన్ని నాటకాలు రాసాడు. ఆ నాటకాలు కూడా ఈ మార్మిక పద్ధతుల్లోనే రాసాడు. అవి నాకు రుచించవు వ్యక్తిగతంగా. ఆ నమ్మకాలున్నవాళ్లకి బాగానేవుంటాయి. ఆయనలో వున్న మరో విషయం ఎవరో ఒకప్రశ్న వేసారు. ఆయన ఎపిక్ ఎందుకు రాయలేదని! ఎపిక్ అంటే మన భారతం లాంటి పురాణం. అంటే మహాకావ్యం అని ఓ అర్థం వుంది. మన తెలుగుదేశంలో మహా కావ్యం రాసినవాడు ఒక్కడే మన ఆంధ్రదేశంలో. ఆయన విశ్వనాథ సత్యనారాయణగారు. రామాయణ

కల్పవృక్షం మహాకావ్యమే. అంటే పొడుగ్గా వుండే మహాకావ్యమనే. ఇక పాశ్చాత్యదేశంలో ఈనోబెల్ ప్రయిజ్ ఎవరికిచ్చారు. ఈగీతాంజలి అనే జానడేసి పజ్యాలకిచ్చారు. ఇంత పొడుగ్గలది గనుక మహాకావ్యమని అనాలని పాశ్చాత్యదేశాల్లో లేదు. అలాగే టి.ఎస్. ఇలియట్ కొన్ని పజ్యాలకి కూడా నోబెల్ ప్రయిజ్ ఇచ్చారు. ఠాగూరు ఆకాలంలో రావడంతో ఆయన్ని వినాలని నాకు కుతూహలం కలిగింది. మంచి వుద్దేశంతోటే బాగావిన్నాం. ఆయన మాట్లాడిన 'మేన్' గురించి ఫిలాసఫీ ఏంటో నాకు తిన్నగా బోధపడ్లేదు. చాలా మంది బోధపడ్లేదు అన్నారు. అంటే విద్యార్థులం మాకు బోధపడ్లేదంటే తప్పులేదు. తరవాత చదవలేదు దాన్ని.

ఆయనకి చేసిన పౌరసన్మానానికి వెళ్లాం అందరమూను. ఆ సభలో అధ్యక్షులుగా ధవళ లక్ష్మీనర్సింహం పంతులుగార్ని పెట్టారు. ఆయన విశాఖపట్నంలో వున్నటువంటి న్యాయవాదుల్లో చాలా గొప్పవాడు. సంస్కృత పండితుడు. అదీగాక 'లా'లో చాలా గొప్పవాడు. ఆనాడు ఆంధ్రదేశంలో జీవించివున్న అంటే మద్రాసు హైకోర్టుతో సహా, ఎవరికీ తీసిపోని లాయరు. ఆయనకి సంస్కృతం క్షుణ్ణంగావచ్చు. పౌర సన్మానంలో -దానికి వందిమాగధులు అంటే నారాయణబాబు వాళ్లంతా. ఠాగూరుగారి భక్తులు. ఆరోజుల్లో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారూ వీళ్లంతా అనుయాయులు ఠాగూరు గారికి. ఆయన భావాల్ని దొంగతనం చేసిన వారూ వున్నారు. భావకవుల్లోను, అతని పద్ధతే మన వెంకట పార్వతీశ కవులు ఏకాంతసేవ లేదూ. అది ఠాగూరుగారి భావాల్తో అలాగే 'నిరీక్షణ' ఠాగూరి గారి పద్ధతులే కృష్ణశాస్త్రిగారి భావాలుంటాయి. అందులో ఠాగూరుగారు కనబడతారు. అందులో ఏం పొరపాటు లేదు. ఠాగూరు మహాకవి. వీరందరూ కలసి ఎవ్రరాసారో నాకు తెలీదు గానీ ఓ సన్మాన పత్రం రాసి అచ్చువేసారు. బంగారపు అక్షరాలతో అచ్చువేసి మంచి చట్రంగట్టి చదివారెవరో, బహుశా తెన్నేటి విశ్వనాథం గారే చదివారనుకొంటాను. అందులో ఎన్నో సంబోధనలున్నాయి. 'విశ్వకవి' అని 'మహాఋషి' అని గూడా వుంది. పేరాకో సంబోధన పెట్టారు.ఆయన్ని ఋషి అని కూడా అనేవారు. ఆయన ఇంచుమించు నల్లబట్టలు వేసినా ఒకొక్కప్పుడు కాషాయి బట్టలు వేస్తారు. నాఅనుమానం ఏమిటంటే ఆ తెల్లని గెడ్డానికి జుత్తుకీ తెల్లరంగు వేస్తాడాయన. ఎంచేతా అంటే అది మిలమిలా మెరుస్తూ కనిపిస్తుంది. ఓ ఆడదాని మేకప్పు కన్నా ఎక్కువ టైమే తీసుకుంటాడు. చాలాసాఫీగా కనిపించడానికి.

ఆసభలో లక్ష్మీనర్సింహంగారేమో ఈ సన్మానపత్రం ఇంగ్లీషులోనే చెప్పారు. తాగూరుగారు ఫాలో అయిన భాషలోనే చెప్పారు. ఏంచెప్పారంటే మన మహా ఋషులేమో సిల్కు చోగాలు కట్టుకోలేదు. ఆయన్ని ఋషి అనడం తప్పు అని ఖండించి చెప్పారు. ఖచ్చితంగా ఆయన మొహమ్మీదే అన్నారు. సభంతా చప్పట్లు కొట్టారు. కరక్ట్‌ని తెలిసిందా! ఆయనేమో అన్ని మహాభోగాలు అనుభవిస్తున్నాడాయె, విలాస జీవితం అనుభవిస్తున్నవాడు.ఈ బట్టలు వేషమూ మహాఋషి వేషమా? మేం అంతా చాలా సంతోషించాం.

ఈయనను విజయనగరమూ తీసుకొచ్చారు. ఇక్కడ ఓ వుపన్యాసం ఇప్పించారు. మేం విశాఖపట్నంలోనే వుండగా ఇక్కడ ఆదిభట్ల నారాయణదాసుగారు, మరెవరో ఈ సభ ఏర్పాట్లు చేశారు. బుర్రా శేషగిరిరావు గారు వాళ్లంతా విజయనగరంలో గూడా సన్మానం చేశారు. బాగానే జరిగింది. నారాయణదాసుగారు ఇక్కడా బాగానే చేశారు. ఆ సభలో తాగూరుగారిని ఓపజ్యం చదవమని ప్రేక్షకులు కోరారు. "Where the mind is without fear" చాలా చక్కగా చదివారు. అందులోనున్న సెంటిమెంటంతా అంతామెచ్చుకొన్నది లేదు. ఆయన చదివిన తీరు మాత్రం మహాద్భుతంగా వుంది. భావయుక్తంగా వుంది. ఆ భావానికి తగ్గట్టుగా వుంది.

రాధాకృష్ణగారి గురించి మొదట్లోనే చెప్పానుగదా ఇంగ్లాండు నుంచి ఆయన కొనుక్కొన్న పుస్తకాలతో బాటు యూనివర్సిటీ కోసం కూడా వామపక్షానికి చెందినవి పెద్ద బండిలు పట్టుకొచ్చేవాడు. పాపం ఆకస్టమ్స్ వాళ్లకి తెలీక వొదిలేసేవారు. అవన్నీ నిషేధింపబడినవే. పెద్దాయన గదా, ఆ పుస్తకాలని బహిరంగంగా స్పష్టంగా ఆంధ్రవిశ్వవిద్యాలయంలో బెట్టారు. కానీ రాధాకృష్ణగారు ఐదేళ్లే పనిచేసాడు. ఆయన తరువాత సి.ఆర్.రెడ్డిగారు పనిచేశారు. ఆ సి.ఆర్.రెడ్డిగారు ఆ పుస్తకాలు ఎక్కడో మారుమూల ఎవరూ చూడకుండా దాచిపెట్టేసారు.

(1988లో చాసో చెప్పగా వెలుగురామినాయుడు రికార్డు చేసినది)

# 6. నేనూ - నా స్నేహితులు - అరసం

1942 సంవత్సరం ప్రారంభంలోనో మధ్యలోనో చదలవాడ సిబ్బయ్య మావూరు దిగబడ్డాడు. ముస్లింటోపీ ఒకటి నెత్తిమీద పెట్టుకున్నాడు. సెట్టి ఈశ్వరరావూ అతనూ కలసి మా ఇంటికి వచ్చారు. "ఇదేంటీ? మహమ్మదీయమతం పుచ్చుకొన్నావా? అని అడిగాను. ఆయన మహమ్మదీయ మతం పుచ్చుకోలేదు. తలమీద తీవ్రమైన దెబ్బ తగిలింది. ఆ దెబ్బకి మందు వేసుకుంటూ ఈ టోపీ పెట్టుకుంటూ తిరుగుతున్నాడు. ఆయనకి తలమీద దెబ్బ ఎందుకు తగిలింది? వాళ్ల స్వగ్రామంలో రైతు కూలీ సంఘం పెట్టాడు. ఆ రైతుకూలీ సంఘం వాళ్లు అస్పృశ్యులు, వాళ్లతో కలిసి, వాళ్లని సంఘటిత పరిచి వాళ్లతో తిరుగుతూ గ్రామంలోనే ఓ సంఘం పెట్టాడు. వాళ్ల నాన్నకి చాలా కోపం వచ్చింది. మానమని ఎంత చెప్పినా మానలేదు. ఇంటికి వెళ్లగానే కర్రతో ఓ బాదు బాదేడు. ఆ దెబ్బ తిని మరింత తీవ్రమైన 'పౌరుషం వచ్చి ఇల్లువదిలేసేడు. దెబ్బకి కట్టు కట్టించుకుని, తను అనుకున్న పని చేసేవిపరీతమైన పట్టుదలగలమనిషేమో అలాగేఆ దెబ్బతోనే విజయనగరం వచ్చేసాడు. మేం అందరం ఎక్కడికక్కడ అభ్యుదయ రచయితల సంఘం పెట్టాలనుకొంటున్నాం. అంటే ప్రొగ్రసివ్ రచయితలందర్నీ కూడాగట్టుకొని ఓ సంఘం ఏర్పాటు చేసే ప్రయత్నం. దాని కాయనగారు నియోగించబడి విజయనగరం వొచ్చాడు. అది సెట్టి ఈశ్వరరావుకూ నాకు అభిమతమైనదే. ఆ ఏర్పాటు మావూళ్లోనే చెయ్యాలనే పట్టుదల ఈశ్వరరావుకీ ఉంది. నాకూ ఉంది. మేం ఇద్దరం ప్రధానమైన వాళ్లమని చెప్పొచ్చు. కుర్రవాళ్లం. కాని ఈశ్వరరావూ నేను ఎంతో చెప్పినా పిచ్చయ్య ఒప్పుకోలేదు. పిచ్చయ్య తెనాలిలో పెట్టడానికే నిర్ణయించాడు.కాస్త మధ్యస్తంగా కోస్తాలో ఉంటుంది. అటువాళ్లూ ఇటువాళ్లు వస్తారు. చెన్నపట్నంలో మనవాళ్లు చాలామంది

ఉండిపోయారు. వాళ్లొస్తారు. అంచేత తెనాలిలోనే పెడదాం అన్నాడు. అదే బాగున్న కారణంచేత ఒప్పుకున్నాం.

1943లో తెనాలిలో సభా చేసాం. ఈ సభ చేసినప్పటికి దానిలో ఉన్న సభ్యులందరం ముప్ఫై సంవత్సరాల లోపు వాళ్లమే. 30 ఏళ్లు దాటిన వాళ్లెవరూ లేరు. అధ్యక్షులుగా తాపీ ధర్మారావుగారిని పెట్టుకున్నాం. ఎంచేతా అంటే ఆయన వామపక్షానికి కాస్త మొగ్గుచూపిస్తున్న మనిషీ, కాస్త శాస్త్రీయమైన ఆలోచనాక్రమం ఉన్నవాడు. కాబట్టి! తెనాలిలో ఆ సభ బాగానే జరిగింది. అన్ని జిల్లాల నుంచీ ఇంచుమించు వచ్చారు. అయితే రాయలసీమ నుంచి ఎవరూ రాలేదు. అదేం విచిత్రమోగాని రాయలసీమలో భావకవుల్లేరు. అభ్యుదయ సంఘం స్థాపించిన నాటికి అభ్యుదయ రచయితలూ లేరు. ఎవరూ రాస్తున్న వాళ్లు లేరు. కాని ప్రతినిధులు వచ్చారు. మొత్తం మీద సభ బాగానే జరిగింది. వామపక్ష రచయితల సభ అని మేం పెట్టుకున్నాం. ప్రజాసాహిత్యం అన్న మాట కూడా దానికి తోడుగా ఉన్నాది. అయితే మాకు సహకరించని వాళ్లు ఇద్దరు ప్రముఖులున్నారు. వాళ్లిద్దరూ బాగా సహకరిస్తారని మేం అనుకున్నాం. అందులో ఒకరిపేరు మా విజ్ఞప్తిలో ప్రధానంగా వేశాం. అతను శ్రీరంగం శ్రీనివాసరావు, రెండోవ్యక్తి కొడవటిగంటి కుటుంబరావు. ఈ ఇద్దరూ మాకు తప్పకుండా సహకరిస్తారనుకుంటే వాళ్లు తప్పకుండా సహకరించలేదు!

తెనాలిలో సభ అయిపోయిన తర్వాత వాళ్లిద్దరితో పోరాడ్డానికి చెన్నపట్నం వెళ్లాం. శ్రీశ్రీ మీరు చేస్తున్నారు కదా నాకిష్టమే చెయ్యండి అన్నాడు. కాని తాను చేస్తాననలేదు. కుటుంబరావు రచయితలకి సంఘమెందుకు ఎవరి మా నానవాళ్లు రాసుకోండి అన్నాడు. తెనాలిసభలో ఓ తీర్మానం చేశాం. మహాప్రస్థానం అచ్చువెయ్యాలని. కాని శ్రీశ్రీగారు మాకన్నీ విషమషరతులు పెట్టాడు. ఆ పుస్తకం అచ్చువెయ్యడం అసాధ్యం చేసిపెట్టాడు. సైజు ఇంతుండాలి. ఎక్కడా ఎప్పుడూ ఎవరూ వెయ్యని సైజు. కాయితం ఫలానా కాయితం ఉండాలి. అప్పటికి అది అన్నిటికన్నా మహా ఖరీదైన కాయితం. పుస్తకాలన్నీ బైండింగు చేయించాలి. దానికి చచ్చేటంత అవుతుంది. ఆ రోజుల్లో పుస్తకాన్ని మామూలుగా మహాప్రస్థానాన్ని రూపాయికివ్వొచ్చు. కాని ఆయన పెట్టిన షరతులపుస్తకం పదిరూపాయలక్కూడా రాదు. వామపక్షాన వ్రాస్తున్న వాళ్లమంటున్నాం, ప్రజలపక్షాన అంటున్నాం. ఇంత ఖరీదయిన పుస్తకం పెట్టడం తప్పు అని ఎంత ఆర్గ్యు చేసినా ఆయన ఒప్పుకోలేదు. ఆయన నాకు

ఉత్తరం కూడా అలాగే రాశాడు. 'మీరు మీరు అంటూ రాశాడు. మీరిది చేస్తారా అది చేస్తారా అంటు రాశాడు. మేం అది చెయ్యలేక దానికో నమస్కారం పెట్టి ఊరుకున్నాం.

కుటుంబరావు మాత్రం మరుసటి సంవత్సరంలో మాతో చేరిపోయాడు. తరువాత సహకరించిన వాళ్లలో బుర్రా సుబ్రహ్మణ్యం ఒకడు. చెన్నపట్నం వాళ్ల తదితరులెవ్వరూ మాకు సహకరించలేదు. తెనాలిలో మేం అంత సభ చేస్తే నార్ల వెంకటేశ్వరరావుగారు ఆంధ్రప్రభలో న్యూస్‌వెయ్యలేదు. ఆగ్రహం వచ్చింది. ఆయన దగ్గరకెళ్లి అడిగాను. అప్పుడు వార్ టైమ్ యుద్ధకాలంలో పత్రికలు నాలుగే పేజీలు ఉండేవి. స్థలాభావం. ఎక్కడవెయ్యం. బోల్డంత న్యూసొస్తున్నాది. అంతర్జాతీయంగా యుద్ధన్యూసులొస్తున్నాయి. మధ్యన మీకు మీ న్యూస్‌కి స్థలం ఎలా ఇవ్వగలం అన్నాడాయన. వెయ్యడానికి ఇష్టం లేక కాదు అన్నాడాయన. రేపో ఎల్లుండో వేస్తానన్నాడు. సరే మంచిదే అని చెప్పి రెండ్రోజులపాటు ఆంధ్రప్రభ చూశాం. న్యూస్‌రాలేదు. చెన్నపురి ఆంధ్రమహాసభకి ఓ రెండు బిల్డింగులు ఉండేవి. వాట్లో ఓ క్లబ్బు కింద ఉండేది. అక్కడికి తెలుగువాళ్లు చాలామంది చేరేవారు. నార్లవారి ఆఫీసుకు వెళ్లకుండా అక్కడికి వెళ్లి ఏవండీ వేసేరుకాదు అని అడిగితే లేదు రేపొస్తుందన్నారు. ఆమర్నాడు తిన్నగా రెండంగుళాలు కూడా లేదు. ఆంధ్రఅభ్యుదయ రచయితల సంఘం ఏర్పడ్డాది. దాని కార్యవర్గం ఇది అని వేశాడాయన! సభ జరిగిన వారం రోజుల నాడు నేనాయనకు పెట్టిన ఇబ్బంది పడలేక అంగుళంన్నర న్యూస్ వేశాడాయన! ఆయన మాకు సభ్యుడుగా ఉంటాడనుకున్నాం. సభ్యుడుగా కూడా లేడు. ఇదీ అరసం ప్రారంభ కథ!

రెండవ సంవత్సరం అరసంతో దేశం మీద బయలుదేరాం కదా! గురజాడ కందుకూరులను మీదకెత్తుతూ తిరుగుతూ ఉంటే ప్రాచుర్యం లభించింది. అరసం పదిమందిలో పడ్డాది. రెండవ సభ బెజవాడలో జరిగింది. దానికి పండితవర్గంలో అయుల సోమయాజుల నర్సింహశర్మగారిని సభ్యుణ్ణి చేసి తీసుకొచ్చాం. నారాయణబాబు తొలినుంచీ సభ్యుడేకాని వాడు రాలేదు. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి తరవాత మాకు సభ్యుడయ్యాడు. పిలకా గణపతిశాస్త్రి సభ్యుడయ్యాడు. నవ్యసాహిత్య పరిషత్తులోని యువతరం వాళ్లు చాలా మంది మా సంఘంలో చేరారు. ఈ చేరడం వల్ల మా ఆశయాలకు విరుద్ధమయినవారు చేరారనే చెప్పొచ్చు. కొంచెం పలచబడ్డాదని చెప్పొచ్చు. మేం చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారి

జీవిత చరిత్ర అచ్చువేశాం. పాపం ఆయనకి కళ్లు లేవు. వృద్ధుడు. వాళ్లింటికి వెళ్లి మీ పుస్తకం వేస్తామని అడిగితే ఆయన చాలా సంతోషించాడు. మీరు నిజంగా వేస్తారా అన్నాడు. ఆయన రాసాడుగాని ఆరాసింది తన జీవితంలో అచ్చవుతుందని కలగూడ కనలేదు. ఆయన కనుకూలంగా ఆయనకిద్దాం అదిద్దాం అని నిర్ణయాలు చేసి ఆపుస్తకం తీసుకొచ్చాం. సభ వారం రోజులు కూడా లేదు. కొన్ని వందల పేజీల పుస్తకం అచ్చువేసి సభలో ఆవిష్కరించాలి. ఆయనని జాగ్రత్తగా తీసుకొచ్చి (అంధుడైనా) ఆయనని సన్మానించాలి. ఆయనకి ఆ పుస్తకం అందచెయ్యాలి. ఇది కష్టసాధ్యమైన పనే! కాని కమ్యూనిస్టు పార్టీకి ప్రజాశక్తి అని పత్రికుండేది. దాని అచ్చుయంత్రం పనివాళ్లకి ఈ విషయం చెబితే మేం రాత్రంబవళ్లు కష్టపడి ఆరోజుకి ఆపుస్తకం ఇచ్చేస్తాం అన్నారు. అన్న ప్రకారం సభ రోజు రాత్రయేసరికి అచ్చుపని పూర్తిచేసేసారు. ఆపొద్దున్న బైండుచేసి సభా సమయానికి అరడజనో ఎన్నో పచ్చి ఆరనివి పట్టుకొచ్చి సభలో పెట్టారు. సాయంకాలానికి వందో ఎన్నో కాపీలిచ్చారు. పచ్చిపచ్చిగానే ఆ పుస్తకం ఆవిష్కరించబడ్డాది. ఆ వందకాపీలూ ఆ సభలో ఆ సాయంకాలానికే చెల్లిపోయాయి. ఆ మర్నాడు మరిన్ని కాపీలు ఇచ్చారు. అవీ చెల్లిపోయాయి. అలాగ ఆ పుస్తకాల మదుపంతా వచ్చీడమే గాక మా సభలో కొంచెం లాభం కూడా వచ్చింది. ఆయన కాపీరైటు మాకిస్తామన్నాడు. ఆకాపీ రైటు మాకొద్దు బాబూ! మిగిలిన పుస్తకాలు మీరమ్ముకోండి అని ఆయనకి ఇచ్చేసాం. నష్టపోతాం అనుకుంటే వెంటనే లాభంతో పాటు అమ్ముడు పోయిందా పుస్తకం! లాభసాటి అయినా మాకు అక్లర్లేదుకదా! ఆయనకి ఆ పుస్తకాలూ ఇచ్చేశాం. కాపీరైటూ అక్కర్లేదనీసేం. చిలకమర్తివారి కారణంచేత మాసభ విశేషాలను పత్రికలన్నీ ఫుల్‌పేజీ కవర్‌చేశాయి. ఆయనఫొటోలు వేసి సభను మెచ్చుకున్నాయి.

ఆ తర్వాత రాజమండ్రి మూడోసభ నాటికి శ్రీశ్రీగారు కూడా మాతో కలిసిపోయాడు! కొ.కు. శ్రీశ్రీ కలియడంతోమాకేం ఆశ్చర్యం లేదు. వాళ్లిద్దరూ తప్పకుండా మావాళ్లే. కాని మాతో కలిసినవారిలో దేవులపల్లి కృష్ణశాస్త్రి అకస్మాత్తుగా మాపక్షం వహించేశాడు! ఈ ప్రొగ్రెసివ్ రైటర్స్ వచ్చారు. వాళ్లతో మనం కలిసి ఉండకపోతే దేశంలో మనం పాతబడిపోయాం. నవ్యసాహిత్య పరిషత్తు వారం. అందుచేత మనం దానిలో ఉంటే దేశంలో మనకీర్తి ఎప్పటిలాగే వుంటుంది అనే భావంతో ఆయన చేరాడని నా నమ్మకం! ఆయన చేరడం నాకు వాస్తవంగా ఇష్టం

లేదు. మేం ఆయనకి విరుద్ధంగా ఉండేవాళ్లం కాని రాజమండ్రి మహాసభకి ఆయన అధ్యక్షుడయ్యాడు. ఆయన  మా మాటలే మాట్లాడాడు. మేం ఏవయితే కావాలని కోరుకుంటున్నామో దానికనుగుణ్యంగానే ఉపన్యాసం ఇచ్చాడు.

ఈ సభ అయిన తర్వాత ముక్త్యాల్లో నవ్యసాహిత్య పరిషత్తు సభ జరిగింది. 1945లో దేవులపల్లి కృష్ణశాస్త్రి మరికొంతమందీ నేనూ అందరం కలిసి రాజమహేంద్రవరం నుంచి బయల్దేరి వెళ్లాం. అక్కడ నుంచి ఒక బస్సు ఏర్పాటు చేశారు. మేం వెళ్లేసరికి ఉదయపు సభ ప్రారంభమయిపోయింది. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు రాలేదని ఆసభలో అందరూ ఎదురుచూస్తూ ఉన్నారు. ఆయనవెంట మేమూ ఉన్నాం. యువతరంవాళ్లం. వారు ఏంకోరేరంటే మీరు కాఫీ అయిపోయిన తర్వాత సభకి తిన్నగా వొచ్చెయ్యాలి. స్నానం తర్వాత చేసుకుందురు అన్నారు. కృష్ణ శాస్త్రి కేశ సంస్కారం చేసుకోవాలి. బట్టలుమార్చుకోవాలి. ఇవన్నీ విధిగా ఉండి తీరాలి. అవన్నీ లేకుండా అలాగే రమ్మన్నారు. శ్రీ జగన్నాథ స్వామి దేవాలయానికి వెళ్లి ఆస్వామివారిని దర్శనం చేసుకోవడానికి ఓ పద్ధతుంది. రైలుదిగ్గానే ఆ దుమ్ముదుస్తులతోటి అలాగే జగన్నాథస్వామి ఆలయానికెళ్లి దర్శనం చేసుకోవాలి. దానిని వాళ్లు ధూళి దర్శనం అంటారు. అల్లాగ్గానే ధూళితో వచ్చి సభలో కూర్చోమన్నారు. అతిపెద్ద సభ. ముక్త్యాలఅంటే జమీందారు గ్రామం. నవ్యసాహిత్య పరిషత్‌కి అన్ని ఖర్చులు పెట్టుకొంటున్నవారు ఆ జమీందారుగారే. అందుకే ఆ మారుమూల పల్లెటూర్లో ఆ జమీందారు ప్రాసాదంలో ఈ సభ ఏర్పాటు చేసారు. ఇలాంటివి ఏర్పాటు చేయడంలో నవ్యసాహిత్య పరిషత్ కార్యకర్తలు చాలా సమర్థులు. ఎప్పుడో నాలుగు వందల సంవత్సరాలకు పూర్వం రాజుల ఆస్థానాలలో సాహిత్య సభలు జరిగేవే దాంతో సమానంగా ఈ రాజప్రసాదంలో సభకు తయారు చేశారు. మహా ఘనంగా అయిన సభ. అసలున్నదే రాజప్రసాదం. ముక్త్యాల జమీందారుగారి ప్రాసాదం. ఆ జమీందారే ఈ సభ నిర్వహణాధికారి. దాని డబ్బూ మంచీచెడ్డా అంతా ఆయనే పెట్టారని నా నమ్మకం. మరెవరూ ఇచ్చినట్టు లేదు. అంచేత సభ చూడ్డానికీ బాగా ఉంది. రమ్యంగా ఉంది. చాలా ఖరీదుగా ఉందంతా! కూర్చున్నాం. చూస్తున్నాం. ఏదో సభ అయింది. ఆ తరువాత భోజనాలు, వెండిపళ్లాలందరికీ పెట్టారు. మంచినీళ్లు తాగడానికి వెండి పాత్రలే పెట్టారు. పులుసూ వగైరా వేసుకోవడానికి వెండిపాత్రలు. వడ్డించేవారు వెండిచేటలతో వడ్డించారు. వెండి

గోకర్ణాలు, వెండి నేతి గిన్నెలు, అంతా వెండే! ఆపంక్తి చూడ్డానికి చాలా ముచ్చటగానే ఉంది. శ్రీనాథుడుకి హేమపాత్రలే వాడి పంక్తి యందు ఉన్నాయన్నాడే అయితే ఇక్కడ హేమపాత్రలు లేవుగాని రజతపాత్రలు మాత్రం సమస్తం ఉన్నాయి. ఆ సభకి తల్లా వఝుల శివశంకరశాస్త్రి గారు రావాలి. ఆయన రాలేదు. ఏడాది కోసారి నవ్యసాహిత్య పరిషత్తు ఒక కవిగారికి సన్మానం చేస్తుంది. ఆ సంవత్సరం శివశంకర శాస్త్రిగారికి సన్మానం. ఆయన రాలేదు. ఎందుకు రాలేదంటే ఆ సభకి వచ్చిన ప్రముఖులుఎవరయ్యా అంటే విశ్వనాథ సత్యనారాయణగారు, ఆయనకీ ఈయనకీ పడదు.ఆ శివశంకరశాస్త్రి కవి ఏమిటి? అకవి! అనే ధోరణిలో ఆయన మాట్లాడుతూ ఉండీవాడా రోజుల్లో! అంతేకాదు అది ఎక్కడో మీదగ్గరా నాదగ్గరా కాదు. సభలో ఆయన ఎదురుగుండా అనేవాడు. ఆయన బాగా పెళుసుకదా! ఆ పెడసరితనంగా ఆమాటంటాడనేటటువంటి భయంతో ఆయనుండగా నాకు సన్మానం వొద్దనుకున్నారాయన! రావడం మానేసాడు. అయితే ఇంకొక ఘన సన్మానం సభలో ఉంది. అది గడియారం కవిగారికి! పొద్దుటూరువారు. శివభారత కర్త. వారికి ఘన సన్మానం జరిగింది. హేమపాత్రాన్నం లేదుగాని ఆయనకి నలుగుపెట్టి బంగారపు కలశంతో తలమీదనీళ్లు పోసి, అభ్యంగనస్నానం అయాక నూతన వస్త్రాలిచ్చి రాజలాంఛనాలతో సన్మానం జరిగింది. విశ్వనాథ సత్యనారాయణ గారు ప్రత్యేకించి ఎందుకొచ్చారూ అంటే దానికొక విశేషం ఉంది. ముక్త్యాల జమీందారుగారి వంశంలో ఆడపిల్లని, ఓ ఆడపడుచుని చల్లపల్లి జమీందారీకి ఇవ్వడం ఓ ఆచారం! ఆ ప్రకారం చల్లపల్లి జమిందారుకివ్వడానికి సరియైన వయస్సు ఉన్న ఆడపడుచు లేదు. అందుచేత ఆ ఇంటికి అల్లుడు రాకుండా పోయాడు. ముక్త్యాలజమీందారుగారు విశ్వనాథవారి రామాయణ వృక్ష కల్పతరువులో నుంచి ఒక భాగమో రెండు భాగాలో నాకు జ్ఞాపకం లేదు. వారి స్వంత ఖర్చులమీద అచ్చువేయించి దానిని దత్తత చేసుకున్నారు. ఆ కావ్యాన్ని అంటే అక్కడ అచ్చయిన దానిని దత్తత చేసుకున్నారు. దత్తత చేసుకుంటే దత్తతపుత్రిక అయిందికదా! దానికి కృతిపతిని చేసి చల్లపల్లి జమీందారు గారికి ఇచ్చారు. అంటే ఏమన్నమాట? కావ్యకన్యను కన్యాదానం చేసినట్టయింది. ఆకారణంచేత ఆయన ముక్త్యాలవారికి అల్లుడయ్యాడు. ఈ కార్యక్రమానికి ఆ జమీందారుగారూ అందరూ వచ్చారు. విశ్వనాథ సత్యనారాయణగారూ ఉన్నారు. ఇవన్నీ చూడ్డానికి మాకు విచిత్రంగానూ చాలా గమ్మత్తుగానూ ఉన్నాయి. ఇదీ సభకి

ముఖ్యమైన విశిష్టత!

ఆ సభలో మా తరఫున దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు మాట్లాడారు. కుర్రవాళ్లలో నన్నూ మాట్లాడమన్నారు. నేను పెద్ద ఉపన్యాసకుణ్ణికాను. అందులో కుర్రవాణ్ణి. కూర్చున్నవారంతా హేమాహేమీలు. సరే అని నేన్నమ్ముకున్న వేవో నాలుగు మాటలు చెప్పడానికి అభ్యంతరం లేదు కాబట్టి ఆ నాలుగు మాటలూ నేను చెప్పాను. ఎవరికీ ఇబ్బందిపెట్టకుండా నా అభిప్రాయాన్ని చెప్పడానికి సావకాశమైన పద్ధతిలో మామూలుగా చెప్పాను. దానికి నేనే అభ్యుదయకవిని. వీళ్లు కారు అన్నారు విశ్వనాథ సత్యనారాయణగారు. ఎంచేతా అంటే దేశానికేది కావాలో ఏది ప్రయోజనాన్నిస్తుందో ఏది కాదో ప్రజలకి అదే నేను రాస్తున్నాను. అందుచేత నేనే అభ్యుదయ కవినన్నారాయన!

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు గంటో గంటన్నరో ఉపన్యాసం ఇచ్చారు. ఆయన ప్రజల పక్షాన మాట్లాడారు. అభ్యుదయ సాహిత్య సంబంధంలో మాట్లాడారు. మేం మాట్లాడిన, మాట్లాడవలసిన భావాలే ఆయన వ్యక్తం చేశారు. చాలా ఆవేశంతో మాట్లాడారు. దేశం ఆపత్తులో ఉంది. ప్రజలు మహాదరిద్రంలో ఉన్నారు. దేశం బానిసదేశమై ఉంది. ఈ కారణంచేత దాని కనుగుణ్యంగా కవులు రాసి తీరాలి. నడిరోడ్డుమీద వాళ్లు నిలబెట్టి అడుగుతున్నారు. నువ్వు ఏం చేస్తున్నావ్! ఏమిటి రాస్తున్నావ్! మేమిట్లా చచ్చిపోతున్నాం. దేశం ఈ దశలో ఉంది. బ్రిటిషువాళ్లు పరిపాలిస్తున్నారు. ఈ పరిపాలనంతా అసందర్భంగా ఉంది. ఇవన్నీ మనల్ని వాళ్లు ప్రశ్నిస్తున్నారు. మనమేమిటి సమాధానం చెప్పడం? అందుచేత వాళ్లకి అనుగుణ్యంగా మనం రాయాలి. ఇలాగట్టిగానే మంచి ఉపన్యాసం ఇచ్చారు. అందర్నీ కదిలించే విధంగా ఇచ్చారాయన. అక్కడున్న వాళ్లలో సనాతనవర్గం వాళ్లు కూడా ఉన్నారు. వాళ్లని కూడా కదిలించాడాయన! తర్వాత విశ్వనాథ సత్యనారాయణగారు నువ్విలాంటి ఉపన్యాసాలు నేనుండగా ఎప్పుడూ ఇవ్వకు అన్నారు. నన్నేం చెయ్యమన్నావ్? రామాయణ కల్పతరువింకా రాయలేదు. నేనింకా పూర్తి చెయ్యలేదు. అది నన్ను పూర్తి చెయ్యమన్నావా? ఇలాంటివి రాసుకోమన్నావా? మానేస్తే బాగున్ననే భావం నాకూ కలిగింది. నేనేం చేయను? అని ఆయన మందలించారు.

సాపాటైన తర్వాత ముక్త్యాల నుంచి బస్సులో బెజవాడకి తిరుగుప్రయాణం. మాబస్సు మహాఘనమైన బస్సు. ఎందుచేతా అంటే కృష్ణశాస్త్రిగారు, కాటూరివారు,

గ్రంథాలయోద్యమంవారు అయ్యంకి వెంకటరమణయ్యగారు అందరూ ఉన్నారు. కాటూరి వారు కృష్ణశాస్త్రిగారు మంచి స్నేహితులు. అవినాభావసంబంధం గల స్నేహితులు. ఆయనంటే ఈయనకీ ఈయనంటే ఆయనకీ చాలా గౌరవమైన భావాలున్నాయి. అయినా ఈ అయినింటివాళ్ళా అందరూ కలిసి సరసల్లాపాలాడుకుంటూ కృష్ణశాస్త్రిగారిని ఆటపట్టించడానికి 'గోదావరికద్దరిని ఊళ్లులేవు' అన్నారు. అంటే కృష్ణశాస్త్రి గారిది పిఠాపురం కదా! అంచేత గోదావరికి ఇవతలభాగంలోనే ఉండవలసిన వాళ్లంతా ఉన్నారు. అంటేగొప్ప వాళ్లంతా కృష్ణా, గుంటూరు జిల్లాల్లోనే ఉన్నారని వాళ్ల ఉద్దేశ్యం. గోదావరికి అవతలకిపోతే ఇంకేం లేదు. అది తమ నానుడి అని కూడా చెప్పారు. నేను వెంటనే 'ఏమండీ నేనంతా విన్నాను. మాసైడు మేంకూడా 'గోదావరి కద్దరిని ఊళ్లు లేవనే' అంటూ ఉంటాం. ఈనానుడి నిజమేనండీ! అన్నాను. దానికి కృష్ణశాస్త్రిగారు గొల్లున నవ్వారు. ఈ కుర్రవాడు ఎందుకలా అన్నాడో పాపం వాళ్లకి తెలీలేదు. కృష్ణశాస్త్రిగారిని వాళ్లంతా ఏదేదో అంటున్నారు. దానికి నేనూ తిరిగి అన్నాను దానికి కృష్ణశాస్త్రిగారు ఎందుకునవ్వుతున్నారో ఏం అర్థం కాలేదు అద్దరి వారికందరికీ! మొత్తం మీద మేమూ గోదావరి కద్దరి ఊళ్లు లేవని అంటున్నాం గదా! వాస్తవంగానే అంటున్నాం అన్నమాట. మరోసారి నేను నొక్కి చెప్పేను. కృష్ణశాస్త్రిగారు నవ్వడం పూర్తయిన తర్వాత 'సోమయాజుల్ది విజయనగరం. గోదావరికి అద్దరివాడే' అన్నారు.

ముక్త్యాల సభలోమరో విశేషం కూడా జరిగింది. ఆ సభలో 15 సంవత్సరాల లోపు కుర్రవాడి చేత పద్యాలు చదివించాం. ఆ కుర్రవాడి పేరు శరభయ్య. తను రాసిన పద్యాలే ఆ కుర్రవాడు చదివాడు. ఆ కుర్రవాడు నా శిష్యుడంటే నా శిష్యుడని ఇద్దరు ప్రముఖులు వాదోపవాదాలు చేస్తున్నారు. ఆ కుర్రవాడు వాస్తవానికి ఇద్దరికీ శిష్యుడిలాగానే ఉన్నాడు. ఒకరు కాటూరి వెంకటేశ్వరరావుగారు, రెండోవారు విశ్వనాథ సత్యనారాయణగారు, కుర్రవాడు చిన్నవాడే గాని చాలా చక్కగా పద్యాలు రాయడం అలవర్చుకున్నాడు. చక్కగానే చదివాడు. కుర్రవాడు మల్లంపల్లివాడు. సభలో మల్లంపల్లి సోమశేఖరశర్మగారూ ఉన్నారు. ఆ సభకి ఆయనే అధ్యక్షుడు ఆయన వెంటనే ఆ కుర్రవాణ్ణి కావలించుకుని ఆనందాశ్రువులలో మామల్లంపల్లిలో ఈ మాత్రం కుర్రవాడింత చక్కగా పద్యాలు రాసేవాడుద్భవించినందుకు నేను చాలా గర్వపడుతున్నానంటూ చాలా చెప్పారు. విశ్వనాథ సత్యనారాయణగారు

కృష్ణశాస్త్రిగారిని నా ఎదుట అలాగ ఉపన్యాసామియ్యద్దు అంటూ నన్ను రాయడం మానేయమంటావా అని కాదు. ఈ శరభయ్యని పద్యాలు రాయడం మానేయమంటావా! లేక నువ్వు చెప్పినట్టు రాయమంటావా! అని ప్రశ్నించారు.

అప్పటికి జమీందారీలు రద్దు కాలేదు. చాలా మంది జమీందార్లు చాలా మంచి స్థితిలో ఉన్నారు. వారిలో ముక్త్యాల జమీందారు గారు ఒకరు. ఆ పాత కాలాన్ని గుర్తుకు తెస్తూ నవ్యసాహిత్య పరిషత్తు ఆ సంవత్సరం జరిగింది. కాని నవ్యసాహిత్య పరిషత్తు అంతటితోసరి. ఆ తరువాత మరి జరగలేదు. మరి నవ్య సాహిత్య పరిషత్తు లేదు. ఎందుకాగిపోయిందో తెలీదు. కాని ఆ జమీందారీ ప్రాసాదంలో ఆగిపోయింది. ఆనాటి జమీందార్లు వాస్తవంగానే సాహిత్యపోషకులు. చాలా మంది కవులకు సన్మానాలు చేస్తూండేవాళ్ళు. వాళ్లింటికి వెళ్లి నమస్కారం చేస్తే ఏదో ఓ వెయ్యినూట పదహార్లు నుండి నూటపదహార్లు వరుకు డబ్బు కూడా ఇచ్చేవారు. అలాగే నాకో జమీందారు నూట పదహారు రూపాయిలిచ్చారు. అదీ ఓ విచిత్రమైన సన్నివేశం. చాలా ఇబ్బందిపడి పుచ్చుకొని బైటికి రాకతప్పలేదు. అది ఇచ్చినందుకు నేను చాలా వ్యథ పొందాను. ఎందుకంటే నేను దాన్ని ఆశించి నేనాయనదగ్గరికి వెళ్లలేదు. వారిస్తారని నేను అనుకోలేదు. నేను సంతోషించలేదు. ఇబ్బందిపడ్డా. ఆనాటి జమీందార్లు చాలా మంచిస్థితిలోనే ఉండేవారు. ముక్త్యాల జమీందారుగారు నవ్యసాహితీ పరిషత్తు నిర్వహణ చేసి ఆనాటి కాలాన్ని కళ్లకి కట్టేటట్టు యువతరమైన మా అందరికీ తెలియజేశారు. నవ్యసాహిత్య పరిషత్‌కి నేనేకాదు అనిసెట్టి సుబ్బారావు, బెల్లంకొండ రామదాసు మొదలైన వారందరూ వచ్చారు. నవ్యసాహిత్య పరిషత్తు ప్రాచీన కాలపు శోభతో **1945**లో జరిగింది.

ఆ మరుసటి సంవత్సరం బూర్జువా సాహిత్య వేత్తల మహాసభ జరిగింది. బూర్జువా సాహిత్య వేత్తల మహాసభ అన్నాను గానీ దాని పేరు మాత్రం అది కాదు. దాని కోపేరు ఉంది. ఆ పేరులో నేనున్నాను. పేరులో చింతించవలసిన పేరది! ఆ పేరే అభ్యుదయ రచయితల మహాసభ. నాల్గవది! రాజమండ్రి మహాసభ అంటే తృతీయమహాసభ అభ్యుదయ రచయితల సభ అయిన నాడే అరసం పలచబడిపోయింది. దాంట్లోకి ఈ నవ్యసాహిత్య పరిషత్తు సభ్యులంతా చేరేరు. అంటే వామపక్షపు భావాలు లేని వారంతా చేరారు. అందులో ప్రధానమైన వాళ్లు ఎవరయ్యా అంటే దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు. ఆయన దానికధ్యక్షుడు. చదలవాడ

పిచ్చయ్య మా కార్యదర్శి. పిచ్చయ్య పిచ్చయ్యే. అతన్ని పిచ్చయ్యగా పూర్తిగా చేసినవాడు దేవులపల్లి కృష్ణశాస్త్రి. మద్రాసు మహాసభంతా పిచ్చయ్య అనుకున్నట్టూ, మేమనుకున్నట్టు జరగలేదు. కృష్ణశాస్త్రిగారు ఏంచెప్తే ఆప్రకారం జరిగింది. మేమంతా దూరాభారానున్నాం. పిచ్చయ్య మద్రాసులో చేద్దాం అన్నాడు. రాజమన్నారు గార్ని అధ్యక్షులుగా పెడదామన్నారు. ఆయన ఆమోదించారు. దానికి మాకేం అభ్యంతరం లేదు. ప్రారంభ ఉపన్యాసం ఇచ్చేందుకు కె.ఎ.అబ్బాస్‌ను బొంబాయి నుంచి తెప్పిస్తాం అన్నారు. దీనికీ మాకభ్యంతరం లేదు. మా భావాలకు దగ్గర భావాలున్నవాడు. అంచేత ఆయన ప్రారంభోపన్యాసం చేయడం బాగుంటుంది. కాని ఆసభ కొచ్చిన వాళ్లెవరు? ఆ ప్రణాళిక మీద సంతకం పెట్టిన వారంతా మా సభ్యులే. ఆ ప్రణాళిక చదువుకుని దాన్ని ఆమోదించేవాళ్లు ఎంతమాత్రం కాదు. ఆ సభకి ఆహ్వానించినవాళ్లలో విశ్వనాథ సత్యనారాయణ దాకా అందరూ ఉన్నారు. ఈ సభకి రావలసినదిగా కోరుతూ ఎన్ని ఉత్తరాలు రాసినా "నేను రాలేను. రావడానికి అవకాశం లేదని'' రాసినవారు రాయప్రోలు సుబ్బారావు. మనం టెలిగ్రాం ఇచ్చి విమానంలో రండి అని అందామా అని కృష్ణశాస్త్రిగారు అడిగారు.-పిచ్చయ్యా, మేమంతా ఉండగా అడిగారు. విమానం చాలా ఖర్చయిపోతుందండీ అని మేం అంటే దాని కేముందీ ఎక్కడైనా ప్రయత్నిద్దాం అని కూడా అన్నారు. మేం దాన్నామోదించలేదు. విమానంమీద రాయప్రోలు వారిని రప్పించి ఆసభల్లో పాల్గొనేటట్టు చేయాలని వారి కోరిక. ఇదేదీ మాకు సమ్మతం కాదు. నాకేకాదు మా యువతరం ఎవరికీ సమ్మతం కాదు. ఆ సభలో అందరూ ప్రసంగాలిచ్చారు. ఈ ప్రసంగాల్లో సాహిత్యానికి ప్రయోజనం ఉండాలని అందరూ వ్యక్తం చేశారు. సనాతనులూ ఆధునికులు కూడా. ప్రయోజనం అంటే ఏ ప్రయోజనమనే తేడా ఉంది. ఆ తేడానే వారికీ మాకూ ఉండనే ఉంది. అంచేత వారందరూ ఈ వేదిక ఆక్రమించడం చాలా అన్యాయంగా ఉంది.

ఈ పిచ్చయ్యగారు వేదిక మీద ఎవరెవరు మాట్లాడతారో పరిచయం చెయ్యడం దండలు వేయడం - ఈ కార్యక్రమమంతా నిర్వహించవల్సినదిగా దేవులపల్లి కృష్ణశాస్త్రిని ఆయనకి అసిస్టెంటుగా నన్నూ పెట్టారు! దానికి అసిస్టెంటుగా ఉండడం నా కిష్టం లేదు. కింద కూచుంటాను అంటే అబ్బే అలా కాదు నువ్వే ఉండాలని అన్నాడు. అలాగే అ.న.శర్మగారిని (పండిత ఆయలసోమయాజుల నరసింహశర్మ) నాలుగు రోజులు ముందేరమ్మని, అతనికి కొన్ని పన్లు అప్పచెప్పి

ముఖ్యంగా వచ్చిన ప్రతినిధులందరికీ కాఫీలు, టిఫిన్లు, భోజనాలు వగైరా సదుపాయాలు చూడమని అప్పచెప్పారు. ఆయన ఎర్రటి శాలువా ఒకటేసుకుని, ఎర్రగా ఉండేవాడేమో, గుర్తుచెప్పి ఆయన దగ్గరికి వెళ్లండని చెప్తూ ఉండేవాళ్లం. ఆయన కనబడుతుండేవాడు. ఎక్కడో ఓచోట. ఆయనదగ్గరకెళ్తే కార్డులు అవీ ఇచ్చేవాడు. మా అ.న.శర్మగారి ఉద్యోగం బానే ఉంది. అది నాకిమ్మంటే పిచ్చయ్య ఇచ్చేడుకాదు. ఈ ఉద్యోగం నాకెందుకు? తలకాయనొప్పి. చుట్టకాల్చుకుంటుండే వాణ్ణి. అస్తమానం ఆ చుట్టకాల్చడం చేత దానికి ఆటంకంగా ఉన్న కారణంచేత, అంటే ఇంత మహాసభకి వచ్చి చుట్ట కాల్చడం గొప్పా అంటే అక్కడ వేదిక మీద ఉపన్యాసాలు వినడం కంటే చుట్ట కాల్చడమే మంచిదని నాకు అభిప్రాయం కలిగింది. లేకపోతే ఆవేదిక నిర్వహించడం సంతోషంగానే గర్వపడుతూనే ఒప్పుకునేవాణ్ణి. అదీ అసలు సంగతి.

ఉదయాన్నుంచి మధ్యాహ్నం 12 గంటల ప్రాంతాల దాకా సభలయ్యాయి. అలాగే సాయంకాలం ఏ ఐదుగంటలకో ప్రారంభమయ్యేవి. చెన్నపట్నంలో ఉన్న సాహితీవేత్తలందరూ సభకి విచ్చేసారు. పై ఊళ్ల నుండి వచ్చిన మేమందరం కూడా ఏ రెండు మూడు వందలమో ఉంటాం. ఈ సభల విశేషమేమిటంటే అవి చెన్నపట్నం అంతా ఆకర్షించాయి. చెన్నపట్నంలో ఉన్న తమిళ రచయితలూ, కన్నడ రచయితలు కలసి సభ అంతా ఆక్రమించి ఉన్నారు. కొందరికి తెలుగువస్తుంది. కొందరికి రాదు. అయినాసరే ఆంధ్రదేశంలో ఉన్న ప్రముఖ తెలుగు రచయితలందరూ వస్తున్నారు. సభ చేస్తున్నారని, వాళ్లందర్నీ చూద్దామని వాళ్ళొచ్చారు.

సభ మాత్రం చాలా గంభీరంగా ఉంది. మాంబళంలో వాణీమహల్ అని ఓ హాలుంది. హాలు మనదే! - అంటే మేం ఆ సభపెట్టిన రోజులకి! ఎందుచేత అంటే ఆ హాలు చిత్తూరు నాగయ్యగారిది. ఆయన కట్టించుకున్నహాలు. తర్వాత దాన్నమ్మేసారు. ప్రస్తుతం అయితే మనదికాదు! ఆహాల్లో ఈసభపెట్టడం చాలా సంతోషంగా ఉంది. అదీకాక మాకు జీపెవరో ఇచ్చారు. ముఖ్యంగా కాంచనమాల, నటీమణి విదేశీకారొకటి మాకు సొంత కారుగానే వాడమంది. ఆకారు కూడా ఉంది. కారూ, జీపు, ఘనంగా పెద్ద ఎత్తుగానే సభలు జరిగాయి. మేముండడానికి వసతులూ బాగానే ఉన్నాయి. కృష్ణశాస్త్రిగారింట్లోనే బసచేశాం. ఆయనింటి పక్కనే ఒక భాగం మాకు కేటాయించారు. మేమంతా అందులో పడుకునేవాళ్లం. అయితే

సభలు జరుగుతున్నాయిగానీ సంతృప్తిగా లేదు!

ఆవేళ సాయంకాలం సభ అయిపోయింది. ఎనిమిది గంటలు ఆ(ప్రాంతాలైంది. వేదిక మీదున్న వాళ్లంతా కిందకి దిగాల్సివచ్చింది. సాంస్కృతిక కార్యక్రమం ఆవేళ ఓ నాటకం ఉంది. ఆ నాటకం అభ్యుదయ భావాల్తో కూడుకున్న మా సభ్యులు రాసిన నాటకం. ఆనాటకం తప్పకుండా చూడాలని ముందు వరసల్లోనే కూర్చున్నారు. నాపక్కన కృష్ణశాస్త్రిగారు, ఆపక్కన రాజమన్నారు కూర్చున్నారు. ఉదయం గానీ సాయంకాలం గానీ ఆసభలో ఎంతమంది ఏ రెండువేలమందో వెయ్యిమందో పడతారు. అదినాకు తెలీదు కానీ హాలు నిండిపోయారు. అవతలా ఉన్నారు. ఇవతలా ఉన్నారు. జనంకిటకిటలాడుతున్నారు!
ఎప్పుడూ ఎవరూ చుట్టగానీ సిగరెట్టుగానీ కాల్చలేదు! నాటకం చూడ్డానికి మొత్తానికి ఆసక్తితోటే ఉన్నాం. అప్పుడు రాజమన్నారుగారు ఠపీమని ఓ సిగరెట్టు వెలిగించారు. అది నేను చూసాను. చాలా కోపమొచ్చింది. ఆయన ఆ సిగరెట్టు వెలిగించడం తప్పని చెప్పడానికి ఆయన మాకధ్యక్షుడు. హైకోర్టు జడ్జిగారు. ఏంమర్యాదాగా ఉంటుంది! కానీ ఆయన మార్గంవేశాడుకదా! ఆపని నేనెందుకు చేయకూడదని ఠపీమని నేనొక చుట్టతీసి వెలిగించాను. అప్పుడు చుట్టకాల్చినవారు సాహిత్యలోకంలో పెద్దలు చాలామందే ఉన్నారు. అందులో కృష్ణశాస్త్రిగారు కూడా ఉన్నారు. నాపక్క ఇలాజూసి 'బతికించావని' ఆయనా ఓ చుట్టతీసాడు. మేం చుట్టపొగ వదుల్తుంటే అది కిందనుంటుందా? మీదకెళ్లింది. అది జూసి ఇహనొక్కక్కడూ ముట్టించాడు. ఓ ఐదు, పది నిమిషాలైందో లేదో వాణీమహలు మీదని పొగ చాందినీ లాగ కప్పేసింది. అందుచేత ఈ సభ పొగపట్టేసింది. మా అభ్యుదయ రచయితల సంఘం అలా పొగపట్టేసింది. మా పొగకూడా దీనికి సహకరించింది.

సభలన్నీ అయిపోయిన తరువాత ఊళ్లో చాలా చోట్లకి తీసుకెళ్లారు. క్రిష్టియన్ కాలేజీ వాళ్లు ఈ వచ్చిన వాళ్లనందర్నీ ఆహ్వానించడం ఘనసన్మానం చేయడం వాళ్ల చేత పేలించడం అన్నీ చేశారు. చదలవాడ పిచ్చయ్య ఇన్నాళ్లూ రాత్రినిద్రలేదు. పగలు ఆహారం లేదు. చాలా కష్టపడి పనిచేశాడు. దానిలో ఏంలోటులేదు. అయితే లోటల్లా ఏమిటంటే అభ్యుదయభావాలకి విరుద్ధంగా ఉన్నవాళ్లందరికీ వేదిక ఇవ్వడం! అంచేత సభ సక్సెస్ కన్నా అన్‌సక్సెస్.

కృష్ణశాస్త్రిగారింటిముందు మామిడిచెట్టుంది. దానికింద బెత్తుకుర్చీలుండేవి. వాహిణీవాళ్ల సప్లై చేసినవి. మల్లీశ్వరికి కృష్ణశాస్త్రిగారు పాటలు రాస్తున్నారు. బి.ఎన్.రెడ్డిగారు వచ్చి అక్కడ కూర్చుంటుండేవారు. మేమంతా ఆ మామిడిచెట్టుకింద కుర్చీల్లో కూర్చుని ఉంటే పిచ్చయ్యవచ్చాడు. సభలు అయిన మర్నాడు. మర్నాడెందుకున్నాడంటే ఇవ్వాల్సిన డబ్బులుగిబ్బులు, ఏవేవో బాకీలు, అప్పచెప్పాల్సిన సామాన్లు - అన్నీ అప్పగించేసి పూర్తిగా సభ తాలూకు వ్యవహారాలన్నీ చక్కబెట్టేసి, చేతులు కడుక్కుని వచ్చాడు. కుర్చీల్లో ఎక్కడా ఖాళీ కూడా లేదేమో. ఇంటిగుమ్మం ముందు మెట్లున్నాయే ఆ మెట్లమీద కూలబడి వలవల వలవల ఏడవడం మొదలుపెట్టాడు.

'ఏవిటి పిచ్చయ్య ఏడుస్తున్నావ్' అంటూ అడిగాడు కృష్ణశాస్త్రి. చెప్పడే! ఎవరడిగినా చెప్పడు. ఏడ్చేస్తున్నాడు. "చెప్పు. అలాఏడుస్తువేంటి?'' అని భుజం పట్టుకుని అడిగితే జేబులోంచి ఓకాగితం తీసి బైటపెట్టాడు. ఆ కాగితం ఓ టెలిగ్రాం. ఆ టెలిగ్రాంలో చదలవాడ పిచ్చయ్యని వెంటనే రమ్మనిమని ఉంది. కారణం ఏమిటీ? ఆయన తండ్రి చచ్చిపోయాడు. అదెప్పుడుచచ్చిపోయాడు? ఈ సభలకి ముందే చచ్చిపోయాడు. ఈసభాకార్యక్రమం అంతా అతగాడి నెత్తిమీద ఉంది. ఆకాగితాన్ని జేబులో పెట్టేసుకుని, అది పూర్తిగా మర్చిపోయి, ఇంతసభా నిర్వహించి, సభంతా అయిపోయి దాని ఖర్చువెచ్చాలు కూడా సెటిల్ చేసి ఆతర్వాత వచ్చి కూలబడ్డాడు. పిచ్చయ్య అంత పట్టుదలైనవాడూ. అంత నిగ్రహంఉన్నవాడు! ఓదార్చాం. ఓదార్చిన తర్వాత ఆసాయంకాలం బండెక్కించాం. అతడేమో వెళ్లిపోయాడు.

మేమేమో ఆసాయంకాలమో ఎప్పుడో చెంచయ్యగారింట్లో ఉన్నాం. ఆయన విప్లవకారుడు, అదే గదర్‌పార్టీలో. అక్కడ కూచునికొంత కాలక్షేపం నేనూ, అనిసెట్టి చేస్తూండేవాళ్లం. తెల్లారేసరికి మెద్రాసంతా గందరగోళం అయిపోయింది. టంగుటూరి ప్రకాశంగారు కమ్యూనిస్టులమీద విరుచుకుపడ్డారు. ఎక్కడ వాళ్లనక్కడ అరెస్టు చేసేస్తున్నారు. ఎక్కడ చూసినా పోలీసువేన్లే. మా చుట్టూ కూడా వేన్లు తిరుగుతున్నాయి. ఎక్కడెక్కడ స్టూడెంట్లో ఏంజరిగాయో అన్నీ వచ్చి చెబుతున్నారు. 'కమ్యూనిస్టు పార్టీ మీద దండయాత్ర జరిగింది. దక్షిణదేశం నుండి అంటే తమిళనాడు లేబర్ నాయకుడు ఎవరో-అతను కావాలిట. అతనిక్కడ లేడు. పోలీసులుపట్టుకుపోయారు. మీరెవరు ఏమిటి ఎందుకతను మీక్కావాలి అంటే అతను ఫలానా అని చెప్పారు.

''ఎందుకైనా మంచిది. మీరెళ్లిపోండి. ఇక్కడ ఉండకూడదు. మిమ్మల్నీ పట్టుకుపోతారు.''అన్నారు. ''ఈ పక్కనుంచే వచ్చాం. అక్కడ పోలీసు వేన్లు ఉన్నాయి. అంచేత ఈ పక్క నుంచి వెళ్లిపోతామని పాపం ఆ స్టూడెంట్లకి చెప్పాం.

ఆ విధంగా అభ్యుదయరచయితల నాల్గవ మహాసభలు మేం పూర్తి చేశాం. ఈ నాల్గవ అభ్యుదయ రచయితల మహాసభ వాస్తవంగా అభ్యుదయ రచయితల మహాసభ కన్నా బూర్జువా రచయితల మహాసభ అని నేను మనసులో అనుకున్నాను. అయితే అందులో ఉన్నటువంటి సాంస్కృతిక కార్యక్రమాలన్నీ అభ్యుదయపరమైనవే. హాలు నిండా జనంఉండి అవి చూశారు. అందుచేత నాల్గవ అభ్యుదయరచయితల మహాసభ బూర్జువా రచయితల మహాసభగా అనుకున్నా ఈ సాంస్కృతిక కార్యక్రమాల వల్లకొంత ఊరట కలిగించాయి.

(1988లో వెలుగు రామినాయుడుగారు చాసో చెప్పగా రికార్డు చేసినది)

# 7. ఫణ విపణి – వుండవిల్లి సూర్యనారాయణ

వుండవల్లి సూర్యనారాయణ బి.ఎ. విద్యార్థి. విజయనగరం మహారాజా వారి కళాశాల. ఈ కుర్రవాడు ఆనాడు నాకు స్నేహితుడు. నాకు దగ్గర వయస్సువాడే. ఓనాడు చాలా Precious Tears కార్చేనని చెప్పేడు. వాడికి కొంచెం డబ్బు గావాల్సొచ్చింది. మా ఇంగ్లీషు హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంటు పెద్దమాస్టారు సుబ్బకవిగారి దగ్గిరికెళ్లి తన కేదో విపరీతమైన ఆపద వచ్చిందని ఓ బొంకు బొంకి కళ్లల్లో నీళ్లు తిప్పుకుంటూ ఆయన్ని అతగాడికి కావలసిన డబ్బు అడిగాడు. ఆయన సంతోషంతో ఆడబ్బిచ్చాడు. ఇచ్చి వెళ్లబాబూ అన్నాడు. చాలా తెలివైన కుర్రాడు. పాటలుబాగా పాడేవాడు. కవిత్వం కూడా బాగా చదువుతూ వుండేవాడు. కవికిందే లెఖ్ఖ అప్పుడు గూడా. ఈ వుండవిల్లి సూర్యనారాయణ కాలేజీనొదిలి వాళ్ల జిల్లా వాళ్లవూరు వెళ్లిపోయాడు. ఆ వెళిపోయిన తరువాత, కొంతకాలం తెలీదు ఏవయ్యాడో!! కాని ఆ తరువాత ఓ కొత్త పేరొకటి వినబడ్డాది. అదేమిటి అంటే నళినీరంజన్ కుమార్ అని. ఇదేంటీ పేరంటే సూర్యనారాయణ పేరు నచ్చలేదు. అందుచేత నళినీ రంజన్ కుమార్‌అని మార్చేసానన్నాడు. ఎప్పుడో కనబడి ఆ తరువాత ఆపేరు మళ్లీ మార్చాడు. నళినీకుమార్ అనే పేరు తోటే లోకవ్యవహారంలో తిరగడం మొదలెట్టాడు. అతడు చాలా సమర్ధుడు. ఎక్కడికైనా వెళ్లి ఏదైనా పని చేసుకురమ్మంటే అవలీలగా చేసుకురాగలడు. ఢిల్లీ వెళ్లి ప్రధానమంత్రిని గలుసుకొని ఫలానా పని చేసుకురమ్మంటే చేయగలడు. లేక మనదేశం విడిచి ఇంగ్లాండో, జపానో, హాంకాంగో పంపించి ఫలానా పని చేసుకురా అంటే ఆ పని చేసుకు రాగలడు. అటువంటి వుద్యోగమే చేస్తూ నాక్కనబడ్డాడు.

ఇల్లాగ్గా అతను తిరిగి తిరిగి ఓనాడు నాకు ఓ నాటకశాలలో కనబడ్డాడు కాకినాడలో. అవసరాల సూర్యారావు పంజరం అనే ఓ నాటకం రాసాడు. దాన్ని ప్రదర్శిస్తున్నారు. ఆ నాటిక కాలేజీ విద్యార్థులు కొందరు, తదితరులు. ఆనాటకం చూడ్డానికి అవసరాల సూర్యారావు ప్రత్యేకంగా నన్ను కాకినాడ తీసికెళ్లాడు. ముందు కూర్చున్నాం. నాటకం చూస్తూ వుంటే ఎదురుగుండా కనబడ్డవాడు నళినీకుమార్. మాతోపాటు కొసదాకా నాటకం చూసాడు. ఆ నటులు ఆనాటకం చాలా చక్కగా నటించారు. మేం బాగా సంతృప్తిపడ్డాం. ఆనాటకానికి నాటక కళాపరిషత్ ప్రథమ బహుమతి కూడా వచ్చింది. అందులో సినిమాలో ప్రసిద్ధి గాంచిన హరనాధరావు ఒక పాత్ర వేసాడు. అప్పుడు అతగాడు విద్యార్థి. అతని గదిలోనే ఆరాత్రి పడుకొన్నాను.

నాటకం అయిన తర్వాత మమ్మల్నందరినీ నళినీకుమార్ మోసుకు పోయాడు. ఎక్కడికీ? డి.వై.నారాయణ ఎండ్.కో స్టీమ్ లోడ్స్‌లో వున్నాడు. అంటే ఓడల్లో సరుకు ఎక్కించడం దించడం ఆ కంపెనీ వుద్యోగం. దాంట్లో ఆయన చాలా పెద్ద ఉద్యోగో ఏదో. ఆ ఉద్యోగపు వాళ్లాఫీసుకి తీసుకుపోయాడు. అక్కడ కుర్చీలు, బెంచీలు అక్కడవసరమయినవన్నీ వేయించాడు. మమ్మల్ని కూర్చోపెట్టాడు. విదేశీ సారాబుడ్లు - ఒకటో, రెండో, సోడాలు, ఓదస్తా పక్కనపెట్టుకున్నాడు. తెల్ల చక్రకేళీ అరటిపళ్లు రెండు పెడలు, అక్కడ పెట్టాడు. నేను ఆల్కహాలు సేవించలేను. అక్కడ సేవించే వాళ్ళు కొందరున్నారు. వాళ్ళే సేవించారు. అక్కడకి వచ్చినవాళ్ళలో నాగ్గుర్తుందెవరంటే ఆవంత్స సోమసుందరం, అవసరాల సూర్యారావు మరికొంతమంది ఓ అయిదారుగురు. అందరూ సాహిత్య సంబంధీకులే. ఇంతకీ మమ్మల్ని నళినీకుమారెందుకు తీసుకువెళ్ళాడక్కడికీ? ఆయన పుస్తకం అచ్చేసాడు. ఆ పుస్తకం అతను రాసినట్టూ తెలీదు. పుస్తకం అచ్చువేస్తాడనీ తెలీదు. ఈ కావ్యం రాయక పూర్వం ఆయనేంరాసాడో మాకు తెలీదు. ఆరోజు మాత్రం ఆ పుస్తకం పట్టుకొని నేను చదువుతాను మీరు వినండన్నాడు. అది చాలా దీర్ఘకావ్యం. ఆరుమాత్రల ఛందస్సులో చక్కగానే నడిపించాడు. పకడ్బందీగానే నడకుంది. భాషా బావుంది. అయితే వాడుక భాష కాదు. అరసున్నాలు కూడా పెట్టాడు అందులో. కానీ సరళంగా చక్కగా వుంది. రాసిన పద్ధతి అంతకుముందు ఎవరూ రాయని పద్ధతి. అందుచేత వ్యక్తిత్వం కనబడుతున్నటువంటిది. దాని పేరు 'ఫణవిపణి' అది ప్రారంభించేడు. అలా చదువుతున్నాడు మేం వింటున్నాం. అందులో కొంత దూరం

వెళ్లాక ఏం కనబడ్డాదీ అంటే ఆశావాదం కనబడింది. నిరాశావాదం కనబడుతున్నాది. అయ్యా ఇందులో మీరు ఆశావాదులో నిరాశావాదులో ఏది ఇందులో మీరు? ఇది Nie gsche (నీఛ) ఫిలాసఫీ. ఇందులో ఆశా నిరాశా రెండు వుంటాయి. అయితే నిరాశ ముందు చూపించి, ఆశ తరవాత చెప్పాలి అన్నాడు. అంటే నిరాశా వాదిగా ఆశావాదిగా రెండూ వున్నాయి జర్మనీ నీఛుడూ, ఆ నీఛుడు ఫిలాసఫీయా అది అనుకొన్నాను. అందరం నవ్వుకున్నాం. ఎప్పుడూ జర్మన్ నిఛని నీఛుడు అనడం ఓ సరదా. అయితే ఆ ఫిలాసఫీకి నాకు ఏం సంబంధం లేదు. ఆ నళినీ కుమార్ వ్యక్తం చేస్తున్న కొన్ని భావాలికీ నాకు నప్పదు. కానీ ఆయన నిజాయితీగా రాస్తున్నాడు. ఆ నిజాయితీ ఈ చివర్నుంచి ఆ చివర్దాకా వుంది. అది మెచ్చుకోక తప్పదు. నిజాయితీ మనకి ఎవరిలో కనబడ్డా హర్షించదగ్గ విషయమే. కవిత్వం అంతా అయేసరికి రెండో, మూడో గంటలు అయింది. తరువాత మమ్మల్నెక్కడికో తీసికెళ్లి కాస్తతిండి పెట్టించి చాలా కష్టపడ్డాడు. తలో పుస్తకం ఇచ్చాడు. నా దగ్గరాపుస్తకం ఇప్పటికీ మిగిలుంది. దీనిమీద ఎవరైనా ఎక్కడైనా ఏదైనా అంటాడా అని చూసాను. కానీ ఏ పత్రికలలోనూ ఫణ విపణి అన్న పేరు కనబడలేదు. చాలా కోపంగా వుండేది. నేనెప్పుడు ఏ వ్యక్తులమీదగాని, పుస్తకాల మీదగాని రాసినవాడ్నిగాను. రాయడానికి వుత్సుకత వున్నవాడ్ని కాను. ఎవరైనా రాస్తే బాగున్నూ అంటే ఫణవిపణి మీద వ్యాసం రాసారీమధ్య ఎవరో. ఈ సంవత్సరంలోనే **(1989)** అది నాకు దొరకలేదు. కాని ఎవరో రాసారూ అని సంతోషించాను. కాని దీనికి రాసి ఏదో చెయ్యవలసిన వాడు శ్రీరంగం శ్రీనివాసరావు. అతను ఎందుకు రాయలేదో నాకు తెలీదు. ఎంచేత అంటే, ఈ పుస్తకం మీద శ్రీశ్రీ ఏదో చేస్తానన్నాడని నళినీకుమార్ ఆరోజు మాకు చెప్పాడు. కాని అతనేం చెయ్యలేదు. ఏదో అతనికున్న పనులు మధ్యని దీన్ని మర్చి పోయుంటాడు. అయితే ఈ నళినీకుమార్‌కీ, శ్రీశ్రీకి, మాకు ముఖ్యమయిన సంబంధముంది. అది **1950** ఆ ప్రాంతంలో ఈ నళినీ కుమార్ శ్రీశ్రీ మహాప్రస్థానాన్ని అచ్చువేసాడు. అది అచ్చు వెయ్యడమన్నది ఓ ఘనకార్యమే. శ్రీశ్రీ తన మహాప్రస్థానాన్ని చాలా విషమమైన షరతుల్తో మా అందర్నీవేధిస్తూ వుండేవాడు. ఎవరు వెయ్యడానికి వెళ్లినా, అసలు అరసం మహాసభలో నేను ఓ తీర్మానం చేసి **1943**లో నా అభిప్రాయం అంటే **5000** కాపీలువెయ్యాలని, చవగ్గా వెయ్యాలని అది అందరికీ అమ్మి కొంత శ్రీశ్రీకిచ్చి కొంత అరసానికి వుంచుకొందామని లోపల కోరిక. అతగాడు మాకు

అవకాశమైనట్టువంటి పద్ధతి ఏదీ చెప్పలేదు. అతనికి పెద్ద డీలక్సు పుస్తకం అచ్చు వేయాలని కోరిక. ఖరీదు 15-20 పెట్టమంటాడు. ఆరోజుల్లో పావలా పుస్తకం కొనలేని రోజుల్లో. కాని మహాప్రస్థానం అచ్చు పడ్డం కావాలి అందరికీ. శ్రీశ్రీ కన్నా మాకే కావాలి. ఏవంటే శ్రీశ్రీ అభ్యుదయ కవి కదా. ఆ మహా ప్రస్థానం అభ్యుదయ కావ్యం. అందుచేత అది అచ్చువెయ్యాలని తాపత్రయం వుండేది. 1943 నుండి 1950 దాకా అతగాడు కలగజేయలేదు. అతడు వెయ్యడు, ఒకరికి ఇవ్వడు. పుస్తకం అతనిదే. మనం కాదంటామా. అతని కోరిక ఎప్పటికీ సఫలమయ్యే పరిస్థితులో చెప్పాలి. ఇంతటిలో ఈ నళినీకుమార మాత్రం పట్టుకొని వేయించాడు. అందుకు చాలా అభినందించాం ఆయన్ని. తలో పుస్తకం ఇచ్చారు. నాదగ్గరుండేది. ఎవరో పట్టుకుపోయారు. ఆ పుస్తకం నా దగ్గిర లేదు. వుండవల్లి సూర్యనారాయణ, నళినీకుమార్ అయి ఫణవిపణి అన్న కావ్యం రాసి ఎప్పుడో ఆమధ్యన కీర్తిశేషులయిపోయారు.

(1988 చాసో చెప్పగా రామినాయుడు రికార్డు చేసినవి)

# 8. 'ఎందుకు పారేస్తాను నాన్నా!' కథారచన'

తే.23.10.1977 నాడు విజయనగరంలో చాసో చెప్పగా చాగంటి తులసి రాసినది.

'నాకు బాగానచ్చిన కథల్లో "ఎందుకు పారేస్తాను నాన్నా" ఒకటి. ఇది రాద్దామన్న భావం నాకు కలిగిన మూడు సంవత్సరాల తర్వాత కథని రూపొందించడం అయింది. ఈ మూడుసంవత్సరాల కాలంలోనూ కనీసం ఐదారుసార్లు కొంత దాకా రాస్తూవచ్చి నేననుకున్న పద్ధతిలోకథ రాలేదన్న అసంతృప్తి చేత రాసిందాన్ని చించి వేస్తూరావడం జరిగింది. ఆ అయిదారుసార్లు రాసిన కథ పూర్తి చేస్తే సర్వ సామాన్యంగా మంచి కథ కిందే లెక్కబెట్టడానికి వీలవుతుంది. కాని నేనూహించిన, ఉద్దేశించిన కుర్రవాడి పాత్ర వాటిలో బహిర్గతం కాలేదు. అందుచేత వాటిని చించిపారవేయడం జరిగింది.

నన్నొక కుర్రవాడు ఇబ్బంది పెట్టడం ప్రారంభించేడు. ఆ కుర్రవాణ్ణి నేను ఏ ఊళ్లో పడితే ఆ ఊళ్లోనే చూస్తూ వచ్చేను. మూడో ఫారమ్ పాసయిన తర్వాత తల్లిదండ్రులు చదువు చెప్పించలేక చదువు మాన్పించేయడం దేశం పొడుగునా సర్వసాధారణమైన విషయంగా ఉండేది. నాలుగో ఫారం నుంచి నెలకి ఐదుంపావలా జీతం హైస్కూళ్ళలో పుచ్చుకునేవారు. బస్తా బియ్యం 8 రూపాయలకు అమ్మేవారు. 30 రూపాయల లోపు జీతాలతో అనేకమంది బతుకుతూ ఉండేవారు. 30 రూపాయిలే గుమాస్తాకి జీతం. ఎలిమెంటరీ స్కూలు మాస్టర్లకి 20 రూపాయిలకి అటు ఇటూ జీతం. ఇది 1940 సంవత్సరానికి ఇటూఅటూ పరిస్థితి. ఆ చిన్న జీతగాళ్లు వాళ్ల పిల్లలకి మూడో ఫారము దాటి చదువు చెప్పించడం చాలా గడ్డుగా ఉండేది. థర్డు ఫారం పాసయ్యేక హయ్యరుగ్రేడు ట్రైనింగు అని ఉపాధ్యాయవృత్తికి ఓ దిక్కుమాలిన

ట్రైనింగు ఉండేది. ఎలిమెంటరీ అయ్యవారి కొడుకు ఎలిమెంటరీ అయ్యవారు అయ్యేవాడు. కొంతమంది గడుసువాళ్లు బి.ఎన్.ఆర్.రైల్వేకి పోయి ఇంజనులోకి బొగ్గు వెయ్యడానికో, వర్క్‌షాపులో సహాయక పనులు చెయ్యడానికి రైల్వేని పట్టుకుపోయేవారు. వాళ్ళ స్థితి కాస్త మెరుగ్గా ఉండేది. ఈ బాపతు కుర్రవాళ్ళని నా చిన్నప్పట్నించీ వందలకొద్దీ నేనెరుగుదును. ఈ ఎరిగిన వందలకొద్దీ కుర్రవాళ్ళని మొత్తం చేసి ఓ కుర్రవాడిగా రూపొందించి వాడికి కథలో ప్రాణం పోసి తెలుగు వారందరికీ ఎదురుగుండా చూపెట్టాలని ఎంత కాంక్షించినా కృతకృత్యుణ్ని కాలేకపోయాను.

నాకు లోకంలో మన కళ్ల ఎదుట జరిగిన ఏ సంఘటననీ తీసుకుని కథరాసే పద్ధతి లేదు. అలాగ్గానే లోకంలో మన ఎదురుగుండా కనపడే ఏ మనిషినో దృష్టిలో పెట్టుకుని కథలో పాత్ర పోషణ చెయ్యడం కూడా నా పద్ధతిలో లేదు. సామూహికంగా మనకు కనపడే అనేక మందిని పరిశీలించి, ఆ మనుషులందరిని మొత్తం చేసి అందులోంచి ఒక కాల్పనిక వ్యక్తిని సృష్టించి ఆ వ్యక్తిని కథలో మలచటం నా పద్ధతి. ఆ కథకి కావలసిన సన్నివేశాలో, సంఘటనలో లోకంలో జరిగినవి కాక నాకు నేను సృష్టించుకోవడమే నా పద్ధతి.

తల్లిదండ్రులు చదువు మానిపిస్తే ఆ చిన్న కుర్రవాని మానసిక ప్రవృత్తిని పట్టుకోవడం కోసం ఎన్నిసార్లు ఆలోచించినా నా బుద్ధికి తోచలేదు. ఒక్కొక్క సన్నివేశాన్ని సృష్టించుకుని, గంటలకొలదీ చుట్టకాలుస్తూ కూర్చుని, ఎంత ఆలోచించినా ఆ పాత్ర నా చేతికి చిక్కలేదు. మూడుసంవత్సరాలుదాటేక ఓ వేసవికాలంలో నర్సాపురం నేను వెళ్ళడం తటస్థించింది. అక్కడ మా పినమావగారు కీర్తిశేషులు శ్రీ పోడూరి సూర్యనారాయణగారి ఇంట్లో నేను ఉదయాన్నే స్నానం చేసి, సావిట్లో కొచ్చిపడక్కుర్చీలో కూర్చున్నాను వాళ్ళిచ్చిన కాఫీ తాగుతూ. ఉదయం ఏడు గంటలు అయిపోయిన కారణం చేత టైలర్ హైస్కూలుకి విద్యార్థులు, విద్యార్థినులు, ఉపాధ్యాయులు రోడ్డు మీంచి పోతూ ఎదురుగా కనబడ్డారు. వాళ్ల ఇల్లు హైస్కూలు తోవలో ఉండడం, ఆ రోడ్డు ఎదురుగా ఉండడాన్ని నాకు హైస్కూలుకి వెళుతున్న పిల్లల కోలాహలమంతా కనపడగానే నేను రూపకల్పన చేద్దామనుకున్న కుర్రవాని పాత్ర మనస్సులో మసలడం మళ్లా మొదలుపెట్టింది. ఆ విధంగా ఆ కుర్రవాడిపాత్ర కోసం ఎన్నిసార్లో ఆలోచించేను కాని ఆరోజుని నా

ఆలోచనలో మెరుపులాగ ఒక భావం కలిగింది. అదేమిటంటే ఆ కుర్రవాడు తనతోటి విద్యార్థులకి తన మొహం చూపించలేడని, వాళ్లెవరు కనబడ్డా చిన్నబోతాడని, హైస్కూలు పరిసర ప్రాంతాలకి వెళ్లడానికి బాధపడతాడని ఆలోచన వచ్చింది. ఆ కుర్రవాడు వీధి మొహం చూడకుండా లోపల వంటింట్లోకి పోయి చెల్లినాడించుకుంటూ బడి పెట్టేవేళ నాకంటికి కనపడ్డాడు. వాణ్ణి రోడ్డు మీదకి, స్కూలు పరిసరాలకి పంపితే వాడి పాత్ర బహిర్గతమయిపోయింది.

వెంటనే కలం కాగితం తీసి ఆ కూర్చున్న ఈజీ చైర్లోనే కథ రాయడం ప్రారంభిస్తే కథంతా తృటికాలంలో మెదడులో సంపూర్ణమైపోయింది. కథని రాయడానికి చేతికి వేగం లేదు. కథ ముందుకు పరిగెడుతూ ఉంటే రాత వెనకబడిపోతూ వచ్చింది. మరొక అవాంతరం వచ్చింది. మా పినమామగారు ప్లీడరుగారు అయిన కారణం చేతాయన వాకిట్లోకి కొంతమంది పార్టీలు వచ్చి వాళ్లవ్యవహారాలు మాట్లాడుకోవడం మొదలు పెట్టేరు. ఇది అక్కడ రాసుకోవడం సాధ్యపడదని తిన్నగా గోదావరి గట్టంట మైలుదూరం పైరు వెళ్లి గోదావరి పక్కన ఉన్న ఒక కొబ్బరితోటలో నక్కేరు చెట్టునీడలో కూర్చుని కథ పూర్తి చేశాను. కథ కాగితాల మీద అక్షరం అక్షరం రాయడం గంటపైనయింది కాని కథ మెదడులో మొదటి నుంచి చివర వరకూ క్షణంలో పూర్తి అయిపోయి ఉంది. ఆ కుర్రవాణ్ణి తండ్రి చుట్టలు తెమ్మని రోడ్డుమీదకి హైస్కూలు పక్కనున్న కిళ్లీ కొట్టుకి పంపించడంతో ఆ కుర్రవాని మానసిక పరిస్థితి అంతా చిత్రీకరించడానికి అవకాశం వచ్చింది. కథరాస్తున్నప్పుడు ఆ కుర్రవాని ఆవేదన, స్థితి పేరాపేరాకి వృద్ధి పొందుతూ వచ్చింది. తండ్రి వచ్చిన తర్వాత ఆ కుర్రవాని పరిస్థితి సంభాషణాత్మకంగా రాస్తూ ఉంటే నా కళ్లు చెమర్చాయి. కథరాస్తున్నంత సేపూ నేను ఆ కుర్రవాడిగా, వాడి దృష్టిలోంచి, వాడి బుద్ధిలోంచి, వాడి బాధలోంచి రాసిన కారణంగా వాడి బాధ నన్ను పట్టుకుని గుండె వేగంగా కొట్టుకోవడం ప్రారంభించింది. కథ పూర్తయిన తర్వాత రాస్తున్నప్పుడు లేని ఉద్వేగం మళ్లా చదువుతూ ఉంటే నాకు అనేకరెట్లు అధికమైపోయింది. కథ నేను కోరుకున్న పద్ధతిలోవచ్చిందనే ఆత్మవిశ్వాసం కలిగింది. పాతిక కథలు రాయడం ఎందుకు? ఇటువంటి కథ ఒకటి రాస్తే చాలు అని నా మనసు నాకు ఆ సమయంలో చెప్పింది.

నేను గొలుసుకట్టుగా రాస్తాను. అది నాకు తప్ప ఇంకొకరికి బోధ పడదు. అందుచేత ఏ అక్షరానికాఅక్షరం చొప్పున విడదీసి ఫెయిర్ కాపీ చేసేను. ఫెయిర్ కాపీ చేస్తున్నప్పుడు చిన్నచిన్న మార్పులు ఒకటి రెండు వచ్చేయేమో కాని చెప్పుకోదగ్గ మార్పులు రాలేదు. నేనింటికొచ్చేసరికి దగ్గర దగ్గర పన్నెండు గంటలు అయింది. భోజనం చేసి ఆ కథని బహుశా పది పదిహేనుసార్లు నాకు నేను చదువుకుని ఉంటాను. ఎక్కడన్నా ఏ లోట్లన్నా ఉన్నాయేమోనని బహు నిశితంగా విమర్శనాదృష్టితో పదం పదం వాక్యం పట్టిపట్టి చదువుకున్నాను.

ఆ సాయంకాలం ఆ కథని పట్టుకుని వీధిలోకి బయల్దేరాను. నర్సాపురంలో సాహిత్యంలో నిష్ణాతులైన కొందరు పూజ్యులు, సాహిత్యాభినివేశనం ఉన్న పెద్దలు, గేయాలు పద్యాలురాస్తున్న కుర్రవాళ్లు పది పదిహేనుమంది మిత్రులు నాకు ఉండేవారు. మేమంతా సాయంకాలం రైల్వేస్టేషన్ ప్రాంతానికి షికారుకి వెళ్లి అక్కడ ఒక పంటకాలవ గట్టుమీద కూర్చుని వ్యాసంగం చేసేవాళ్లం. వారందరిలో వయస్సు చేత నాకన్నా పెద్దవారు, బహుభాషాకోవిదులు, ముఖ్యంగా సంస్కృతం, తెలుగు, హిందీ, ఇంగ్లీషు సాహిత్యాలు బాగాతరచి చూచిన వారు అయిన శ్రీ ఆలమూరు రాజగోపాలరావుగారు ఉండేవారు. ఆయన హైస్కూలు ఉపాధ్యాయుడిగా, కాలేజీ అధ్యాపకుడిగా బహు సమర్థుడు. సాహిత్యం ఎక్కువైపోయిన కారణం చేత ఆయన కవిత్వం ప్రారంభంలో చాలా చెప్పినా పెద్దయేక దాని మీద మనస్సు తప్పిపోయి నాలుగు భాషల్లో సాహిత్యాధ్యయనంలో నిమగ్నులైపోయేరు. ఆయన రచనా పాటవాన్ని బాగా ఎరిగినవారు. ఆయన సమక్షంలో ఆ సాయంకాలం పది పన్నెండుగురు సాహితీ మిత్రుల మధ్య ఆ కథని నేను చదవగా ఆ కథలో ఉన్న కరుణరసం అందర్నీ ఉద్విగ్నుల్ని చేసింది. శ్రీ రాజగోపాలరావుగారిని మేమంతా మాస్టరుగారు అనేవాళ్లం. మేష్టరుగారు ఆ కుర్రవాని పాత్రలో మునిగిపోయి ఏమాటా ఆడకుండా పావుగంట పైగా ఉండిపోయేరు. మిగతా మిత్రులంతా వారి వారి అభిప్రాయాలు ఎన్ని చెప్తున్నా ఆయన మాట్లాడలేదు. ఆఖరికి ఆయన నోరు విప్పి " నాకు మాటలురావడం లేదు. ఆ కుర్రవాడు నాకు కనబడుతున్నాడు. ఆ కుర్రవాడు ఎదురుగుండా వస్తే వాడికి స్కాలర్‌షిప్పు ఇవ్వాలని ఉంది. వాడు భగవంతుడిలా ఉన్నాడంటే ఉన్నాడు. లేడంటే లేడు అన్నట్టుగానే నా ఎదురుగుండా తాండవిస్తున్నాడు. మీరెవరైనా కుర్రవాణ్ణి దృష్టిలో పెట్టుకుని రాస్తే చెప్పండి. నిజంగానే ఆ కుర్రవాడికి స్కాలర్‌షిప్పు యిస్తాను.

ఈ కథలో మీరు ఒకమాట వెయ్యక్కర్లేదు. ఒక మాట తియ్యక్కర్లేదు. నన్ను ఇంత సంతృప్తి పరిచి నా మనస్సుని కలచివేసిన కథ నేనీమధ్య తెలుగులో చదవలేదు'' అని నన్ను అభినందించారు. నాకు ఆయన ఇచ్చిన అభిప్రాయమెప్పుడూ శిరోధార్యంగా ఉండేది. ఆయన ఏదైనా వ్యతిరేకత చెపితే సంతోషంగా మార్చుకునేవాణ్ణి.

ఆ మర్నాడు ఉదయమే పోష్టుకి ఆ కథని భారతి సంపాదకులకి పంపించేను. భారతి ఆ రోజుల్లో ఏడో తారీఖ్కో, ఎనిమిదో తారీఖ్కో వస్తూ ఉండేది. నేను పది తారీఖున పోస్టు చేసినట్టు జ్ఞాపకం. ఆ రాబోయే నెలకాక ఆ పైనెలలో అది భారతిలో వస్తుందని పంపించేను. ఆ రోజుల్లో భారతికి కీర్తిశేషులు నర్సింహాచార్యులు సంపాదక బాధ్యత నిర్వహిస్తూ ఉండేవారు. నాపేరుతో రాసిన ఆ కథని చూడగానే వెంటనే చదివి కంపోజింగు కిచ్చిన కథల్లో ఓ కథని తీసివేసి ఆ నెలలోనే భారతిలో ప్రచురించేరు. ఆ విషయాన్ని ఆచార్యులవారుఅలా వెయ్యడం నాకు చాలా ఉత్సాహాన్నిచ్చి గర్వాన్ని కలిగించింది. భారతి ప్రతి అచ్చు అయి రాగానే సంచికని పట్టుకుని మిత్రులు శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు ఇంటికి వెళ్లేరు.ఆ రోజుల్లో శ్రీ కుటుంబరావుగారు ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక ఉపసంపాదకులుగా ఉండేవారు. రాత్రి భోజనం చేసి చాసోగారి కథ ఉంది. చదువుకుందామని ఆయన, ఆయన శ్రీమతిగారు వగైరా వారి కుటుంబ సభ్యులంతా కూర్చున్నారు. శ్రీ కుటుంబరావుగారే చదివేరట. కథ చివరికి వచ్చేసరికి కళ్లనిండా నీళ్లునిండిపోయి గొంతుక గాద్గదికమైపోయి చాలా ఇబ్బందిపడి చివరిబాగం చదివేరట. ఆవిషయం ఆయన నేను చెన్నాపట్నం వెళ్లినప్పుడు చెబితే చాలా ఆనందం కలిగింది.

ఈకథ ప్రచురించిన కొద్ది రోజుల్లో కీర్తిశేషుడు శ్రీరంగంనారాయణబాబు ఒక సమావేశంలో ఈ కథని ఉల్లేఖించి శ్లాఘిస్తూ మాట్లాడి కథాంతంలో చుట్టలు మానేస్తానని తండ్రి అనుకున్నట్టు రాయడం తనకి నచ్చలేదని ఖండించేడు.కాని వెంటనే కీర్తిశేషులు జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి నారాయణబాబుని తీవ్రంగా నిరసించేడు. కథా రచనకి నన్ను శ్లాఘిస్తూఉత్తరం రాసేడు. ఇదంతా అయేక నేనువిజయనగరం రాగా మిత్రుడు శ్రీ రోణంకి అప్పలస్వామి ఈ కథకి నూటికి నూరుమార్కులు ఇచ్చేడు. అతను కాలేజీ అయ్యవారు కదా! మార్కుల్లోనే తన అభిప్రాయాన్ని చెప్పేడు.

ఈ కథ ప్రచురణ అయిన తర్వాత మమ్మల్ని ఎరిగిన కుటుంబాలలో, ముఖ్యంగా మూడు కుటుంబాలలో ఇదే పద్ధతిని కుర్రవాడి చదువు ఆపివెయ్యడం జరిగిన కారణం చేత నేను వాళ్ల మీదే ఈ కథరాసేనని చెప్పుకున్నారు. అయితే వాళ్లకీ, నేను కథలో రాసిన వివరాలకీ ఏమాత్రం సంబంధం లేదు. అయినా వాళ్లు ఆ విధంగా మూడు ఊళ్లల్లో చెప్పుకున్నారు.వాస్తవానికి ఆ కథ చదువు మాన్పించిన చిన్నపిల్లలనందరినీ ఉద్దేశించే రాసేను.

కథ సామాన్య పాఠకులని ఉద్దేశించి రాస్తాము.ఈకథని చదవవలసిన వారు సామాన్యులే. పై వివరాలన్నీ ఎందుకు ఇచ్చేనంటే- సామాన్యుడు మెచ్చుకుంటాడు. ఆ మెప్పు రచయితకి ఘనమైనదే. కాని సామాన్యుడికి శిల్పం అవగతం కాదు. కథ ఎందుకు బావున్నది-బాగుంటేసామాన్య పాఠకుడికి తెలియదు.కథ ఎందుకు బాగులేనిది అడగ్గానే తెలియదు. సాహిత్యంలో నిష్ణాతులైన విమర్శకులు ఏ అభిప్రాయాన్ని ఇస్తారో ఆ అభిప్రాయమే సరియైనది అవుతుంది. వాళ్లని మెప్పించేది, సామాన్య పాఠకుణ్ణి మెప్పించేది అయిననాడే రచన ఉత్తమ సాహిత్యమవుతుంది.

నేను పాఠకుల కోసమే రాసింది ప్రచురణ చేసినా నాకు సన్నిహితులైన కొద్దిమంది పండితుల అభిప్రాయం కోసం ఎదురుచూసేవాణ్ణి, ముఖ్యంగా శ్రీరోణంకి అప్పలస్వామిని మెప్పించి ఏ కథరాసినా చాలు అనుకునేవాణ్ణి. అప్పట్లో అనగా ప్రారంభంలో ఆయన మెచ్చుకోని కథ నేను ప్రచురించలేదు. ఒక్కటీ అరా ప్రచురించినా ఆయన మెప్పుకోసం ఎదురుచూసేవాణ్ణి. విశ్లేషించి ఏదీ చెప్పకపోయినా శ్రీ రోణంకి అప్పలస్వామి ఇందులో ఏదో పొరపాటు ఉంది. సరిగ్గా లేదని ఎవరికి చెప్పినా అందులో ఏదో పొరపాటు ఉండడం ఖాయమే.

## 9) శుక్లపక్షం - అనంతపంతులరామలింగస్వామి

1930లో శుక్లపక్షం అచ్చవక పూర్వం శ్రీ అనంతపంతుల రామలింగస్వామిగారు, విజయనగరం మహారాజా కళాశాల 'ఫోర్త్ ఇయర్' హాలులో శుక్లపక్షంలోని శీర్షికలను సభచేసి చదివి వినిపించాడు. విజయనగరంలో భావకవిత్వాన్ని ఖండించే పెద్దలు సాహితీవేత్తలు ఆనాడు ఉన్నారు. భావకవులని అవహేళనాత్మకంగా ఆయన చదవగా నేను విన్నాను. విద్యార్థిగా నేను కాలేజీలో చదువుతున్నాను. నేను ఆ రోజుల్లోనే నేను భావకవిత్వానికి వ్యతిరేకిని. శ్రీ స్వామిగారు భావకవి రూపాన్ని వర్ణిస్తూ రాసిన

శీర్షిక భావనని (అక్షరాలా నిజం) నేను బాగా నవ్వాను. నేను అప్పటికి భావకవుల్ని చాలామందిని చూశాను. అందుచేత ఆయన అవహేళన నాకు చాలా నచ్చింది. ఆనాడు నుంచి ఈనాడుదాకా భావకవిత్వంలో పలాయనవాదం ఉందనే భావంతో నేనూ నా మిత్రులూ శ్రీరంగం నారాయణబాబూ, శ్రీరంగం శ్రీనివాసరావు ఏకీభవించేవాళ్ళం. అయితే అనంతపంతులవారు మాదృష్టితో భావకవులని విశ్లేషించి విమర్శించినవాడు కాడు. భావకవిత్వాన్ని భావకవులను అవహేళన మాత్రమే చేసినవాడు.

ఆరోజులు భావకవిత్వానివి. భావకవులు, వాళ్ళని సమర్ధిస్తున్న పండితులు, పండిత విమర్శకులు ఊరూరా సభలు చేసి భావకవిత్వాన్ని ప్రబల ప్రచారం చేశారు. భావకవిత్వాన్ని ఎవరు రాసినవి వారు చదివి సభల్లో వినిపిస్తూ వారి మిత్రులైన భావకవులవి వినిపిస్తూ పెద్ద సంచలనాన్ని ఆరోజులలో సృష్టించారు. చారిత్రక దృష్టితో అప్పుడు ఇప్పుడు శాస్త్రీయ దృక్పథంలో 1930ల్లోనూ ఇప్పుడూ కూడా నేను బేరీజు చేసేవాడ్ని కావడం వలన భావకవిత్వానికి అంత ప్రభంజనం వస్తున్నా నేను వ్యతిరేకంగా ఉండేవాడ్ని. ఇప్పటికీ అంతే. భావకవిత్వం మీద మార్పులేదు.

అనంతపంతుల రామలింగస్వామిగారు పద్యరచనలో చాలా గట్టివారు. ఆయనశయ్య మనని ఊపుతుంది. శుక్లపక్షం నాదగ్గర ఉండేది. ఆ పద్యాలు చదవడానికి అప్పుడప్పుడు ఉత్సాహం కలిగి చదివేవాడిని. ఈ విషయం రామలింగస్వామిగారితో చాలాసార్లు చెప్పాను. ఆయన పద్యరచన నాకు హృద్యంగా ఉండేది. భావకవుల పద్యాలకు తీసిపోవు.

భావకవుల ప్రచారంతో భావకవులని అవహేళన చేసిన శుక్లపక్షం అవహేళన పాలైంది. రానురాను విస్మరింపబడ్డాది. ఆఖరికి రామలింగస్వామి గారే ఏదోహాస్యానికి రాసాను అని చెప్పుకోవలసిన స్థితికి వచ్చారు. కానీ ఆయన భావకవులకి బుద్ధిపూర్వకంగా అవహేళనే రాశారు. ఆ విషయం కూడా నాకు స్పష్టంగా తెలుసు. ఇప్పుడు ఎవడేనా శుక్లపక్షాన్ని పరిశోధిస్తే ఈ దృష్టితో చూడటం న్యాయం. పాశ్చాత్య దేశాల్లో హ్యూమరు, సెటైరు రాసేవాళ్ళు వ్యక్తులమీద ద్వేషంతో రాయడం కూడదనే భావమే ఉంది. తనను చూసి తాను కూడా నవ్వుకునే పరిస్థితి పాశ్చాత్యుల హ్యూమర్‌కి మూలం. సెటైర్‌కీ అంతే. రామలింగస్వామిగారు భావకవుల మీద కవిత్వం మీద సెటైర్ ఆవిధంగానే రాశారు. వ్యక్తిగత ద్వేషం లేదు.

ఆయన అన్ని వర్గాలవారితోనూ మైత్రితో ఉండేవారు. ఆయన జైలులో వీవింగ్ సూపరింటెండెంట్. విశాఖపట్టణం కురపాం మార్కెట్ దగ్గర ఆరోజుల్లో ఆఊరిలో ఉన్న సాహితీపరులందరూ చేరేవారు. అన్నివర్గాలకు చెందినవారు. అందరినీ సాదరంగా ఆహ్వానించి పక్కనున్న హొటల్‌లో అందరికీ ఎవరికి కావలసిందివారు సేవించి కాఫీతాగితే ఆమొత్తం బిల్లు ఆయనే రోజూ ఇచ్చేవారు - ఇంకెవరినీ ఇవ్వనిచ్చేవారుకాదు. అలాగ్గా ఆయనతో పాటు ఉదయం, సాయంకాలం హొటల్‌కి వెళ్ళిన వాళ్ళల్లో నేనూ ఉన్నాను. శ్రీశ్రీ ఉన్నాడు. ఆ ఊరివాళ్ళు కావలసినంతమంది ఉన్నారు. పై ఊళ్ళవాళ్ళూ ఉన్నారు. నాలాంటి ఆయనొస్తే కాఫీ తాగచ్చు అని ఎదురుచూసేవారు ఉండేవారు.

ఆయనకి హస్తసాముద్రికం బాగా తెలుసు. ఆయనని కలిసిన వాళ్ళందరూ చూపించుకుంటుండేవాళ్ళు, నమ్మకం లేక నేను తప్ప. అందులో చాలామంది వామపక్షపు కబుర్లు చెప్పేవాళ్లుండే వాళ్ళు. కనబడితే అభిమానంతో నన్ను పలకరించే విశాఖజిల్లా పెద్దల్లో ఆయనొకడు. కవిత్వం అనేక రకాలు. తెలుగులో సెటైర్ చాలా తక్కువ. సెటైర్ రచన ప్రారంభించినవారిలో బహుశా ఆయన ప్రథముడేమో. ఆకారణం చేత ఆయనని పరిశోధించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

(5-11-89 నాడు డా.కాండూరి సీతారామచంద్రమూర్తిగారు ఎంఫిల్ కోసం 'సరసపరిహాసకావ్యం శుక్లపక్షం' అంశంపై నాగార్జున యూనివర్సిటీలో పరిశోధన చేస్తున్న సందర్భంగా చాసోను సంప్రదించారు. చాసో తన సంతకంతో యిచ్చిన అభిప్రాయం.)

# చాసో వ్యాసాలు

## 1. గురజాడ అనుయాయుడు రాయప్రోలు

ఆధునిక తెలుగు సాహిత్యానికి మార్గదర్శక కవిగా, నాటకకర్తగా, కథకుడుగా శాస్త్రీయ దృక్పథాన్ని ప్రవేశపెట్టిన మహాకవి గురజాడ అప్పారావు. ఆధునిక సాహిత్యానికి ఆద్యుడు గురజాడా? రాయప్రోలా? అనే విచిత్రవాదానికి పక్షపాతంతో కూడిన అనేకులు అర్థశతాబ్దం నుండి గురజాడను తక్కువ చెయ్యడానికీ, రాయప్రోలును ఆద్యుడని నిర్ధారించడానికీ చాలా అగచాట్లు పడి వారి తక్కువ తనాన్ని విశదపరచుకొన్నారు. గురజాడకీ రాయప్రోలుకీ హస్తిమశకాంతరం వుంది. గురజాడ ప్రతిభావంతుడైన ప్రపంచ మహాకవి, రచయిత. రాయిప్రోలు ప్రాంతీయుడు, పక్షపాతి, విశ్వవిశాలమైన ఆలోచనాక్రమం లేనివాడు. మానవజాతి ఏక కుటుంబంగా అవగాహన కానివాడు. తెనుగువాడు మాత్రమే! అందులోనూ పక్షపాతంతో కూడిన తెనుగు ప్రేమ, స్వాతిశయం, పరనింద విపరీతం. మహాకవికి వుండవలసిన లక్షణాలు పూజ్యం.

గురజాడ తాను జీవించిన కాలంలో యావత్ మానవజాతికీ ప్రతినిధి. రష్యాలో చెహోవ్, నార్వేలో ఇబ్సన్, ఫ్రాన్స్‌లో ఎమిలీ జోలా, ఇంగ్లాండులో కొంచెం కొంచెం తర్వాత బెర్నార్డ్‌షాలకు సమకాలికుడు. సర్వసమానుడు. ఆయన జీవితకాలంలో ప్రతి ప్రపంచ సంఘటనకి స్పందింపబడి భవిష్యత్ జ్ఞానంతో మహా ఋషియై నాటకం రాశాడు. కవిత్వం చెప్పాడు.

కన్యాశుల్కం రాసిన నాటికి బెర్నార్డ్ షా తన వచన నాటకాలను రాయనే లేదు. గురజాడ వచన నాటక ప్రక్రియకు ప్రపంచ మూలపురుషులలో ప్రధానుడు. అప్పటికి ఇబ్సన్ నాటకాలు నార్వే భాష నుంచి పాశ్చాత్య భాషలలోనికి, ముఖ్యంగా ఇంగ్లీషులోనికి అనువదింపబడలేదు. బెర్నాడ్డ్ షా ఆ తరువాత స్వయంగా ఇబ్సన్

నాటకాలను ఆంగ్లంలోనికి అనువాదాలు చేయించి, ఇబ్సన్ మీద విమర్శ గ్రంథం రాసి ఆ మహా రచయితకు ప్రపంచ వ్యాప్తంగా ప్రచారం చేశాడు. చెహోవ్ నాటకాలు, కథలు అప్పటికి పాశ్చాత్య భాషలలోనికి రాలేదు. ఎమిలీ జోలా కూడా ఇంగ్లీషులోనికి అనువదింపబడలేదు. గురజాడ భావాలు ఎవరికి వారు అజ్ఞాతంగా రాస్తున్న పై మహారచయితల భావాలు సైద్ధాంతికంగా ఒక్కటే! వాళ్ళు వాళ్ళ భాషలలో గొప్పవాళ్ళయితే గురజాడ తెలుగులో మహాకవి, నాటకకర్త. ఈ పరమ సత్యాన్ని తెలుగు విమర్శకులు ఏనాడూ నోరారా వేదికమీద చెప్పడం గాని, వారు రాసిన అనేకమైన చవకబారు విమర్శలలో గాని ప్రస్తుతించిన పాపాన పోలేదు.

గురజాడ టాగూర్ కవికి మిత్రుడు. టాగూరు విశ్వజనీనతకు ముగ్ధుడు. రాయప్రోలుకు టాగూరు గురుదేవుడు. శాంతినికేతనంలో విద్యార్థి. కాని టాగూర్ ఉన్నతాదర్శాలేవీ రాయప్రోలును అంటలేదు. టాగూర్ కుటుంబం తండ్రి నాటి నుంచి బ్రహ్మసమాజికులు. వర్ణవ్యవస్థకి వ్యతిరేకులు. సర్వమత సహనం కోరేవారు. టాగూర్ మనిషి అంటే భారతీయుడు మాత్రమే కాడు. ప్రపంచ మానవుడు. టాగూరు వ్యావహారిక భాషలో జానపదుల పద్ధతిని తన పద కవిత్వం వంగ రాష్ట్రం అంతా విరజిమ్మేడు. ఆ భాషను, ఆ కవిత్వాన్ని, కలకత్తా విశ్వవిద్యాలయం మొదలైన తావులలో వున్న వంగ ఛాందసపు పండితులు ఆమోదించలేదు. నొబెల్ బహుమానం రాగానే టాగూరు ఇంటికి ప్రత్యేక ప్రయాణాలు చేసి, ఆయనను కీర్తించబోయిన పండితులనందరినీ టాగూర్ చెడామడా విమర్శించాడు. టాగూర్‌నిదుయ్యబట్టిన వాళ్లే మళ్లీ అతన్ని శ్లాఘించడం ఆనాటి కలకత్తా విడ్డూరాల్లో ఒకటి!

సంక్షిప్తంగా చెప్పిన పై భావాలకు రాయప్రోలు టాగూరు అనుయాయుడై, శిష్యుడై జీర్ణించుకొన్నదేమీ లేదు. ఒక విధంగా ఆయన మొదటి భావకవి. భావ కవులంతా ఆయన్ని అనుసరించి, వాళ్ళకు ఆద్యుడుగా ఆమోదించుకున్నారు.
శాస్త్రీయ దృక్పథం రాయప్రోలుకి లేదు.

హేమపాత్రల చందన మెండిపోయె
ద్వారములు మోయు చున్నవి హారములను
సానలందింకె స్నాన కషాయగంధ
మబల ఎవని కోసము సగమయి తపింతు

ఈ బాపతు పద్యాలు భావకవులకు మార్గదర్శకాలయ్యాయి. ఈరోజుల్లో

హేమపాత్రలు ఎవరింట్లో వున్నాయి? పాత్రల నిండా చందనం తీసుకునే వాళ్ళెవరు? 'సానలందింకె' అంటే ఎన్నో సానలమీద స్నాన కషాయ గంధం తియ్యబడ్డాది. ఆ పిల్ల ఎవరికోసమో సగం చిక్కి తపిస్తోంది. 'నీ లేత హృదయాన్ని ఎవడాహరించేడమ్మా? అని అడుగుతున్నాడు కవి. పడుచు వగలు నమ్మి మనస్సెవడికో అమ్ముకుందిట! పై భావాలు నేటి కాలానికి, రాయప్రోలు రాసిన కాలానికి కూడా వర్తించవు. ఇవి ఏ గోపిక గురించో లేక ఏ రాజకుమారి గురించో ఐతే నప్పుతాయి.

'నిశలు పులకించె కనులకు నిదుర రాదు. అమ్మాయీ! నన్నెందుకు బాధపెడతావు'' మొదలైన పద్యాలు భావకవులకే వరవళ్ళు.

భావకవులు వచనం వ్యావహారిక భాషలోను, కవిత్వం గ్రాంధిక భాషలోను రాయడం అంగీకరించారు. టాగూరు కవిత్వం వ్యావహారిక భాషలోనే చెప్పాడు. ఐతే భావకవిగా రాసిన పద్యాలు, ఆంధ్రుల మీద రాసిన పద్యాలు గ్రాంధిక భాషలో వున్నా శ్రీరాయప్రోలు సుబ్బారావు 'జడకుచ్చులు'లోనూ 'ఆంధ్రావళి'లోను కూడా ముత్యాల సరాలలోను, మరికొన్ని ఇతర ఛందస్సులలోనూ రాసి గురజాడను అనుసరించాడు.

గురజాడ 'మలిన చిత్తులకధిక కులముల నెలవొసంగిన వర్ణధర్మ మధర్మధర్మము' అని ఉద్ఘాటించాడు. మంచీ చెడ్డా అనేవి రెండే కులాలనీ అందులో మంచి అన్నది మాల ఐతే మాలనే అగుదునని అన్నాడు. ఆయన వొట్టి శాస్త్రజ్ఞులను తత్వమెరుగని శుకములకింద జమకట్టాడు. ఎక్కడ చూసినా ఆయన శాస్త్రీయ దృక్పథం అందరినీ ఉత్తేజపరుస్తూ కనబడుతుంది. ఇంగ్లీషు మేధావులు కల్లని ఇష్టపడరు. వాళ్ళ చదువుల్ని చదువుకొని తారతమ్యజ్ఞానంతో వాస్తవాన్ని తెలుసుకున్నానని అన్నాడు. ధూమకేతువుని శాస్త్రీయ దృక్పథంతో తాను ఆనాడు నమ్ముతున్న సంఘ సంస్కరణోద్యమానికి పతాకంగా స్వీకరిస్తానన్నాడు. ఎల్లలోకము ఒకే ఇల్లవుతుందనిన్ని, వర్ణభేదాలు కల్లలైపోతాయని, మతములన్నీ మాసిపోతాయనీ, జ్ఞానమొక్కటే నిలిచి నరజాతికి వెలుగునిచ్చి స్వర్గసుఖాలను కలుగజేస్తుందని ఆయన ప్రవచించాడు. అంతేకాదు. ఆనాటి ఆంగ్ల భాష మనుషుల్లో ఏ పరివర్తన తీసుకురాబోతున్నదో క్రాంతదర్శిగా ఊహించి, 'ఇంత ఔతుందని ఆనాటి పెద్దలకు తెలిస్తే ఇంగ్లీషు చెప్పించేవారు కారని, ఏవో పెద్దవుద్యోగాలు చేస్తారని, పొట్టకూటి విద్యగా నేర్చుకున్న ఇంగ్లీషు పుట్టకీట్లు కదిల్చి వేస్తున్నా'దని ముందుగా

చెప్పగలిగాడు.పుట్టకీట్లు అనగా మట్టిగోడల పునాదులలోని కీట్లను ఒక కదుపు కదిపి వేస్తుందనే సంగతి మనకి ముందుగానే తెలియజేశాడు.

ఐరోపా ఖండంలోని సమకాలిక కవుల కవిత్వం చదవకపోయినప్పటికీ, గురజాడ కవిత్వం వారికవిత్వంతో సరితూగుతుంది. ఇంగ్లాండులో ఆయన సమకాలికులైన జార్జియన్ కవులను, కళకళ కోసమే అని వాదించే ఆర్.యల్.స్టీవెన్‌సన్ లాంటి రచయితలను, ఆయన ఆమోదించలేదు. కళకు విశిష్ట ప్రయోజనం వుండాలనిన్నీ, ప్రజలకు అంకితం కావాలని, జీవితాన్ని లోతుగా విమర్శించాలనీ ఆయన అభిప్రాయం.

రాయప్రోలు వారి 'జన్మభూమి' గేయాన్ని చూడండి ఈ గేయాన్ని చదివితే ఏ తెలుగువాడూ గర్వపడనక్కరలేదు. ఏ భారతీయుడూ చదవనక్కర లేదు. " ఏ పూర్వ పుణ్యమో! ఏ యోగ బలమో! జనియించినాడ వీ స్వర్గఖండమున'' ఇందులో యోగమంటే ఏమిటో! పూర్వపుణ్యము అన్నా చిక్కుగానే వుంది. ఈ రెండూ వైదికమతస్థులు నమ్ముతారు. బౌద్ధులు, జైనులు మొదలైన వారు నమ్ముతారు కానీ వారు మన దేశంలో తక్కువ మంది వున్నారు. మహమ్మదీయులు, క్రైస్తవులు ఈ రెండింటినీ ఎలా నమ్ముతారు? వైదికమతస్థులలో కూడా ఇప్పుడీ నమ్మకం లేనివాళ్ళు అనేకులున్నారు. రాయప్రోలువారు ఆ కారణం చేత స్వర్గఖండంలో పుట్టావు అంటున్నారు. ఇది స్వర్గఖండమైతేగా! అధిక సంఖ్యాకులకి ఈ దేశం దారిద్ర్యాన్ని, అనారోగ్యాన్ని, ఆకలిచావుల్ని, అర్థాకలినీ ప్రసాదిస్తోంది. పదవుల్లో వున్న వాళ్ళ భవనాలలో మాత్రం ఈ బీదరికం కనబడదు. సకలైశ్వర్యాలూ కనబడతాయి. ప్రజల మధ్య దారిద్ర్యం నిత్యం తాండవం చేస్తున్నాది. పాపం రాయప్రోలు సుబ్బారావుగారు 'నువ్వుమంచి పువ్వుల్ని ప్రేమించిన కారణం చేత ఈ తల్లి కనక గర్భంలో నిన్ను మోసింది' అని అన్నారు. ఆ మొయ్యబడే వ్యక్తి భారతీయుడా? ఈ దేశంలో వున్న ఎవడో ప్రజాద్రోహి ఐన ఐశ్వర్యవంతుడు. వాడిని ఈ తల్లి కనక గర్భంలో కంటుంది. సామాన్య ప్రజలందర్నీ, ముష్టివాళ్ళగాను రెక్కల కష్టం మీద బతుకుతున్న వాళ్లగాను ఆయమ్మకంటున్నాది. రాయప్రోలు వారికి ఇవేవీ కనబడలేదు.

పైగా ఈయన కవిత్వంలో వున్న డచ్చీలు మనల్ని విస్మయపరుస్తాయి. ఆంధ్రదేశం మీద, జన్మభూమి మీద రాసిన గీతాలు డచ్చీ కవిత్వం అని మనం

చెప్పవచ్చు. ఇటువంటి భూదేవి ఇంకెక్కడా లేదనీ, మనవంటి ధీరులింకెక్కడా లేరనీ చెప్పడం పెద్ద కోచా. ఇందులో సత్యం లేదు. ప్రపంచం అన్నిదేశాలలోనూ ధీరులుంటారు. భీరువులుంటారు. మన దేశంలోనూ వున్నారు. భారతంలో ఉత్తరకుమారుడు లేడా? సూర్యుడి వెలుతురు పడేటంత దూరంలోనూ మన భూమిలాంటి చల్లనితల్లి ఇంకెక్కడా లేదట! ప్రపంచదేశాలలోని ప్రజలు వాళ్ళ దేశాల గురించి ఏమనుకుంటారు?

ఋషులు తమ తపస్సుని ధారపోశారట! ఇదొక మూఢ విశ్వాసం. వాళ్ళు అనాదిగా మనదేశంలో తపస్సులు చేస్తున్నారే గాని వెయ్యి సంవత్సరాల మధ్యని భారతదేశంలో వారి తపస్సు వల్ల దాస్యవిముక్తి కలగలేదు. మహమ్మదీయులు మీదపడినప్పుడు ఖండగిరి, ఉదయగిరి గుహల్లో తపస్సు చేసుకొంటున్న ఋషులు రాజులిచ్చే భత్యాలు ఆగిపోగానే బర్మా మొదలైన దేశాలకు పలాయనం చిత్తగించారు. ఇలాగే 'ప్రబోధము' అనే పద్యాలలో కొన్ని పంక్తుల్ని పరిశీలిద్దాము "తనగీతి అరవ జాతిని గాయకులనుగా దిద్ది వర్ధిల్లిన తెలుగువాణి" ఇదేం న్యాయం? ఇంతకన్నా అసందర్భం మరొకటుందా? తమిళులు అనాదిగా మనకన్నా సంగీతంలో అభినివేశం ఎక్కువగా వున్నవాళ్ళు. జాతి మొత్తాన వాళ్ళ రాష్ట్రంలో కనబడే సంగీత జ్ఞానం తెలుగువారికి జాతిగా కనబడదు. త్యాగరాజుని, శ్యామశాస్త్రిని దృష్టిలో పెట్టుకొని ఈ పంక్తిని ధైర్యంగా అనేశాడు. ఆ కాలంలో ఆంధ్రులు రామేశ్వరం దాకా విస్తరించి వుండేవారు. చాలా కాలం తెలుగు నాయకులు పరిపాలించారు. త్యాగరాజు మహాభక్తుడు. అరవజాతి జాతిగా మంచి భగవద్భక్తులు. వాళ్ళకున్న భక్తి మన రాష్ట్రంలోని ప్రజలలో ఎక్కడా కనబడదు. త్యాగరాజు వాస్తవంగా నిజాయితీగా భక్తుడు. బోగస్ భక్తి గేయాలు రాసినవాడు కాదు. ఆ కారణం చేత ఆయన తిరిగిన దక్షిణదేశం అంతా ఆయనకృతుల్ని పాడుకుంటూ ఆయనకు సమాధికట్టి పూజిస్తూవున్నారు. దానికి తెలుగువాళ్ళేమీ గర్వపడనక్కరలేదు. అది అరవ వాళ్ళ గొప్పతనం. అరవ వాళ్ళు లేకపోతే త్యాగరాజు పూర్తిగా అంతర్థానమైవుండేవాడు.

'కృష్ణా తరంగ పంక్తులలో ఆంధ్రనౌకలు నాట్యమాడిన నాడు' అంటూ ఒక వాక్యముంది. ఇంత సంకుచితంగా ఒక్క కృష్ణానదిమీద నౌకల్ని గురించి ఎందుకు రాయవలసి వచ్చిందో తెలీదు. వాస్తవంగా అతి ప్రాచీన కాలం నుంచి కళింగపట్నం, కోనాడ, భీమునిపట్నం, విశాఖపట్నం, దివిలి మొదలైన ఆంధ్ర ప్రాంతపు రేవుస్థలాల

నుంచి చాలా భారీ ఓడలు బర్మా, ప్రస్తుతపు ఇండోనేషియా, అటు కొరియా, ఫిలిప్పీన్స్ దాకా విదేశ వాణిజ్యాన్ని భారీ ఎత్తున చేసేవి. తెలుగు వాళ్ళు ఆయా దేశాలకు వలసలూ వెళ్లారు. రాజ్యాలు స్థాపించుకున్నారు. కృష్ణానదిలో నౌకలు త్రుళ్ళింతలాడితే ఏం ప్రయోజనం!

చిన్ని గొర్రెలు మేపు చిన్నారి గొల్లాడిని " నీ పెళ్ళాం పెరుగమ్మడానికి పోయింది. నీ జున్నపాలు మేమేమీ తాగేము. నీ పాడి గొర్రెలమంద పారిపోదు" అంటూ వ్యావహారిక భాషలో జానపదశైలిలో గురజాడ పద్ధతిని వేరొక ఛందస్సులో రాయబడ్డాది. ఈ గేయం చాలా మంచి గేయంలాగానే చాలామంది చేత పాడబడుతుంది. సర్వసాధారణంగా గొర్రెలు పాలివ్వవు. ఇచ్చినా నాలుగైదు చుక్కలు. వాడిపెళ్లాం గొర్రెపాలతో పెరుగమ్మే సమస్యలేదు. జున్నుపాలను పాలుగా ఎవరూ తాగరు. జున్ను చేసుకుతింటారు. ఎక్కువగా జున్నుపాలు గొర్రెలమందలో దొరకవు. పాడిగొర్రెల మంద అనడం ఏమీ బాగాలేదు. గొర్రెస్థానంలో బర్రె అని పెడితే బాగుండేది.

మనుషులు ఈసురోమని ఉన్నారనీ, అలాగ ప్రజలుంటే దేశం ఎలా బాగుపడుతుందనీ, తిండిగట్టిగా వుంటేనే కండగలవాడవుతాడు. కండవున్నవాడే మనిషి అంటాడు గురజాడ. విద్యలోనే స్పర్ధలు పెట్టుకోమంటాడు. వాణిజ్యంలోనే వైరాలు పెట్టుకోమంటాడు. కత్తివైరం కాల్చమంటాడు. మతాలు వేరైనా మనసులొకటై మనుషులుంటే, 'జాతము' అన్నది మనదేశంలో లేచి లోకంలో రాణిస్తుందన్నాడు. జాతులు మతాలు అన్నదమ్ములలాగమెలగాలన్నాడాయన. గతంలో మంచి చాలా కొంచెమేనని చెప్పాడు. గురజాడ యావద్భారత దేశానికే సందేశాలనిచ్చాడు. రాయప్రోలు ఆంధ్రదేశస్థులనే కంకణాలు కట్టుకొమ్మని చెప్పాడు. దేశ ప్రజలకు చెప్పినా ఏవిధంగా చెప్పాడో 'జన్మభూమి' గీతం నుండి వివరింపబడ్డాది. గురజాడ వారి గీతాలు ప్రపంచంలో ఏదేశానికి వెళ్ళినా ఆదేశస్థులు గర్వించదగ్గవి. రాయప్రోలు గీతాలు- గురజాడకి అనుయాయుడుగా రాసినవి కూడా సంకుచిత భావాలతో నిండి సరియైన విమర్శకుల చేతిలో ఆంధ్రదేశంలోనే ఆమోదించబడవు.

# 2. కన్యాశుల్కం

ముప్పై సంవత్సరాల యువకుడు రూపకం రాశాడు. రంగస్థలంమీద ప్రదర్శించాడు. 1892లో తెనుగువారు మాట్లాడుకొనే భాషలో రాశాడు. 800 సంవత్సరాల చిల్లరగా నన్నయ నాటి నుంచి వస్తున్న తెనుగుభాషా సాహిత్య స్వరూపాలు తల్లకిందులై పోయాయి.

ఈ రూపకం విజయనగరంలో ఆనందగజపతిమహారాజావారి నాటకశాలలో విద్యా జ్ఞానుల సమక్షంలో ప్రదర్శింప బడ్డాది. ఈ నాటక శాలలో సంస్కృత నాటికలు ప్రదర్శిస్తూ సంస్కృత నాటక పునర్వికాసానికి మహారాజావారు దోహదం చేశారు. ఆ ఆనందగజపతి మహారాజులుంగారే ఈ వినూత్న రూపకాన్ని అంకితం పుచ్చుకున్నారు. ఆ రూపకకర్త గురజాడ అప్పారావు. ఆ రూపకమే కన్యాశుల్కం.

ఈ రూపక ప్రదర్శనము భారతదేశానికి చరిత్రాత్మకమైనది. అంతేకాదు ఇంగ్లాండుతో సహా బ్రిటిష్ సామ్రాజ్య దేశాలకీ చరిత్రాత్మకమైనదే. అంతేకాదు ఐరోపాఖండ దేశాలకీ చరిత్రాత్మకమైనదే! ఒక్క నార్వే తప్ప. కన్యాశుల్కం పద్ధతి నాటకాలు గురజాడ వారికి ముందు ఇబ్సెన్ మహాశయుడు రాసి నార్వేలో ప్రదర్శించాడు. ఆయన నాటకాలు నార్వేభాషలో కన్యాశుల్కానికి ముందువచ్చాయి. అవి ఆంగ్లభాషలోకి 1892 నాటికిగాని అనువాదం కాలేదు.

కన్యాశుల్కం ప్రదర్శించిన నాటికి ఇంగ్లాండులో బెర్నార్డుషా రాసిన రెండు నాటకాలు ప్రదర్శించడానికి లండన్‌లోతంటాలు పడుతున్నాడు. రష్యాలో ఏంటన్ చెహోవ్ కూడా తన వినూత్న పద్ధతి నాటకాలు ఆంగ్లంలోకి ప్రదర్శించలేదు. బహుశారాయలేదు. ఆనాటకకర్తల సమకాలికుడు గురజాడ కన్యాశుల్కాన్ని

ప్రదర్శించగలిగాడు. ఆ ప్రపంచ నాటకకర్తల సరసను సమవుజ్జీగా రాసినవాడు. ప్రపంచ నాటకకర్తలలో ఒకడు. ప్రపంచ సాహిత్య గతిని మార్చిన ప్రపంచ విప్లవాత్మకమైన రచనలు చేసిన వారిలో నాటకకర్త, కథకుడు కూడ గురజాడ. తెనుగువారు మాత్రం భారతదేశభాషలలోనైనా 'కన్యాశుల్కా'నికి సముచిత స్థానం కలగచెయ్యలేకపోయారు. ప్రస్తుతం కూడా మన పొరుగు రాష్ట్రాలలోనే కన్యాశుల్కం నాటకం ఉందని, అక్కడ సాహిత్య ప్రపంచానికి తెలియదు. దాని ప్రశస్తి తెలియదు. ప్రపంచ సాహిత్యంలో సముచిత స్థానం గల నాటకం ఈ తెనుగు నాటకం.

ఈమధ్యనే రష్యన్ మొదలైన సోషలిస్టు దేశాల భాషలలోకి అనువదించ బడడం కాస్త సంతోషదాయకం. భారతదేశ సాహిత్యవేత్తలలో గురజాడ ప్రముఖుడన్న సత్యాన్ని అద్యతన భవిష్యత్తులో తెనుగువారు ప్రకటించుకోగలరని ఆశించడం కూడా కష్టమే. గురజాడవారు పాశ్చాత్య నాటకాలను, నాటకశాస్త్రాన్ని చక్కగా అధ్యయనం చేసినవారు. షేక్స్పియర్, మోలియర్, కాంగ్రోవ్, షెరిడాన్ మొదలైన వారి నాటకాలను అవగాహన చేసుకొన్నవారని కన్యాశుల్కంలో తేటతెల్లంగా కనబడుతుంది. గ్రీకు నాటక ప్రకాండుల, విమర్శకుల లక్ష్యలక్షణాలను ఎరిగినవారు. పాశ్చాత్య దేశాల్లో వస్తున్న సాహిత్య లక్షణాలను, భాషా పరిణామాలను తెలుసుకొన్నవారు.

భాస, భవభూతి, కాళిదాస, శూద్రకాది సంస్కృత కవుల నాటకాలను ఆలంకారికుల సాహిత్య, రూపక వివరణలను లోతుగా తెలిసిన వారని కన్యాశుల్కంలో వాటి ప్రభావం స్పష్టంగా తెలుస్తుంది. అనగా మానవ కుటుంబం ప్రపంచం మొత్తం మీద సృష్టించిన, సృష్టిస్తున్న సాహిత్య పరిణామాలకి గురజాడ వారసుడు. ప్రాచీన కాలం నుంచి తన కాలం వరకూ ఆ పరిణామాలకు స్పందించి ముందుబాట వేసినవారు. పాత కొత్తల మేలు కలయికగా ప్రాక్ పశ్చిమాల సంగమంగా కన్యాశుల్కం రూపొందింది. ఈ రూపకానికి ప్రధాన రసం హాస్యం. అది బీభత్సంతో అంతమవుతుంది. హాస్యరసం కావ్యానికి ప్రధాన రసంగా సంస్కృతాలంకారికులు, కావ్యకర్తలుఆమోదించలేదు. హాస్య రసాన్ని ప్రధాన రసంగా ఆమోదించి సంస్కృతంలో వారు ఏనాడూ కావ్యాన్ని రాయలేదు. ప్రహసనాలని చెప్పబడే ఏకాంకికలు హాస్యరసంలో రాసుకొన్నారు. బూతుల బుంగలతో హాస్యరసం ఉత్తమ కావ్యానికి పనికి రాదని నిశ్చయించుకొన్నారు. అదీ వాళ్ల భావన.

గురజాడవారు పాశ్చాత్యుల హాస్యరస పద్ధతి మన సాహిత్యంలో ప్రవేశపెట్టి తన వర్తమాన కాలజీవితాన్ని విశ్లేషిస్తూ మన బతుకుల్లో అవకతవకల్ని అవహేళన చేస్తూ మనలో సంస్కరణభావాలను కలిగించాడు. కలిగిస్తున్నాడు. కన్యాశుల్కంలో హాస్యం భారతీయ పద్ధతిది కాదు. అది పాశ్చాత్యజన్యము. ఇందులో హాస్యరసం ఉన్న కారణం చేత మన తెనుగు పండితులు ప్రహసనంగా జతకట్టి తక్కువ చెయ్యడానికి విశ్వప్రయత్నం చేసి బోర్లా పడ్డారనే చెప్పవచ్చు. రోజురోజుకీ కన్యాశుల్కం మన దృష్టికి ఎవరెస్టు శిఖరమంత ఉన్నతమైనదని గోచరమౌతున్నాది. మన ప్రాచీన కాలపు సాహిత్య వేత్తలకు శృంగారం ప్రధాన రసం. మొన్నటి ఈ భావ కవులదాకా శృంగారమే ప్రధాన రసం. తప్పితే విప్రలంభ శృంగారం అదే కరుణ. ఈ రెండు ప్రధాన రసాలని గురజాడ తెలిసే పరిత్యజించాడు. హాస్యరసానికి అత్యున్నత స్థానం కలిగించాడు. దానిని సామాజికమైన మార్పురావడానికి ఆగ్నేయాస్త్రంగా ప్రయోగించి కృతకృత్యుడయాడు. పాశ్చాత్య సాహిత్యాలలో హాస్యరసానికి మహోన్నత స్థానం ఉంది. ఆ హాస్యానికి కరుణరసాన్ని జోడించి రాసిన నవలాకారుడు. చార్లెస్ డికెన్స్. ఆ కరుణ రసం మన ప్రాచీనకాలంలో మృగ్యం. ఆకరుణరసాన్నే గురజాడవారు తమ కన్యక, పూర్ణమ్మ కథా కావ్యాల్లో నాటకీయంగా అనుసరించి మనలను శోకసంతప్తులను చేస్తూ మనలో పరిణామాన్ని కలిగించాడు, కలిగిస్తున్నాడు. పాశ్చాత్య పద్ధతులలోంచి కన్యాశుల్కంలో గురజాడవారు పాత్రీకరణ పద్ధతి ప్రతిభావంతంగా ప్రవేశపెట్టాడు. ప్రధాన పాత్రల నుంచి అతి చిన్న పాత్రలదాకా సజీవంగా మన ఎదుట కనబడతాయి. కన్యాశుల్కం చదివినా, ప్రదర్శించినా ఆ పాత్రలు సజీవమైన మనుషులుగా మన ఎదుటి నిలబడతారు. కన్యాశుల్కంలో జీవితం ఈనాడు చాలా మార్పులకు గురి అయింది. కాలంలో వచ్చిన మార్పు అసాధారణమైనదే. ఈ నాడు అగ్నిహోత్రావధానులు, బుచ్చమ్మలూ భూమ్మీద లేరు. అయినా కన్యాశుల్కం చదివితే మనకళ్లకి కట్టినట్టు కనబడతారు. పాత్రలకు ఆయన ప్రాణ ప్రతిష్ట చేశాడు. కన్యాశుల్కం రాసి వందేళ్లు అవుతున్నా, మరో వందేళ్ల తరువాత చదివినా, ప్రదర్శించినా దానిలో పాత్రలు సజీవంగా మనకి సాక్షాత్కరిస్తాయి. అతి ప్రాచీన కాలపు సంస్కృతిలో నాటకాల ఛాయ కన్యాశుల్కంలో లేదా అంటే కొట్టొచ్చినట్లు కావలసినంత కనబడుతుంది. కన్యాశుల్కంలో కాళిదాసు కనబడతాడు. భవభూతి కనబడతాడు. శూద్రకుడు కనబడతాడు. ఆయన

తీసుకొన్నది మన జీవితము. అందులో ఆయనకి వర్తమానకాల జీవితం. దాని నిజస్వరూపాన్ని విశ్లేషిస్తూ మన ఎదట ప్రదర్శించాడు. మన నమ్మకాలు, మన మూఢాచారాలు, మన అవివేకం కన్యాశుల్కంలో చూసి ఈ నాటి మనం కూడా విస్తుపోయి ఆలోచనలో పడతాము.

ఇంతకీ కన్యాశుల్కంలో ఏముంది? మనలో చాలా మంది కన్యాశుల్కం చదివిన వారే. చదవని తెనుగువారు చదివితీరవలసిన మహా కావ్యం. ఆనాడు అనగా గురజాడవారి కాలంలో కన్యాశుల్కమనే దురాచారం ఉండేది. ఆడపిల్లలని వృద్ధులకి తమ కన్నతల్లిదండ్రులే నిర్దాక్షిణ్యంగా అమ్మేసేవారు. బాలవితంతువులై ఎక్కడపడితే అక్కడకనబడేవారు. వారికి పునర్వివాహం చేయడం మంచిదని సంఘ సంస్కర్తలు చెప్పడం ప్రారంభించారు. ఈ రెండు ప్రధానమైన సమస్యలూ ఈ నాటకంలో ఉన్నాయి. ఆయన మనభాషలో చెప్పేడు. ప్రజల వాడుక భాష. గ్రంథాలలోభాషకానే కాదు. మహా ప్రవాహంగా ముందుకు పోతున్న జీవద్భాషలోమహా కావ్యం సృష్టించాడు. కావ్యం ఆభాషలో ఉత్పన్నం అవుతుందని రుజువు చేశాడు. తెనుగు భాషా స్వరూపంలో తలకిందులైపోయింది. పండితుల కృతకభాష వెనక్కి పోయి ప్రజలభాష సాహిత్య గౌరవాన్ని పొందింది. 'నానేర్పు కొలది నేనొక కొత్త తోవ తొక్కితిని. తప్పేమి? నలుగురు ఆమోదించారా నేను కల్పించిన వృత్తము అవలంబింతురు. ఆమోదించరా పరిత్యజింతురు' అని గురజాడవారన్నారు. "వాడుక భాష జీవిక కలది. దాని ప్రవాహం మహానదీ ప్రవాహం" అని కూడా చెప్పేరు.

వర్తమాన కాల జీవితంలోంచి ఇతివృత్తాన్ని తీసుకొని సానలు పట్టిన జాతిరత్నముగా భాషింపజేశారు. దానితో తొమ్మిది శతాబ్దాల పండిత కవులభాష వెనక్కి పోయింది. కృతకభాషగా వేరే మరొక భాషగా ఈనాడు అది కనబడుతున్నాది. గ్రాంధికభాష ఇప్పుడు మనది కాని వేరొక భాషే! మన భాష నిత్యము మన ప్రజలువాడుకొనే భాష.

కన్యాశుల్కం తీసుకొచ్చిన మార్పు గురజాడవారు ఆశించినట్టే జరిగింది. "నాది ప్రజల ఉద్యమం", అని ఆయన ఘంటాపదంగా చెప్పినది అక్షరాలా నిజమైంది. ఆయన కల్పించిన వృత్తాన్నే మనం అవలంబిస్తున్నాం. ఆమోదిస్తున్నాం.

# 3. మాలపల్లి

క్రొత్త సాహిత్య ప్రక్రియ బయటపడ్డాది. దానిలో ఉన్నదంతా కొత్తే. ప్రజల జీవితంలోంచి పుట్టుకొచ్చింది. ప్రజల భాషలో వచన కావ్యం ఆవిష్కరించబడింది. పెద్ద చదువులు లేని అతి సామాన్యులు రచయితలయ్యారు. వారు మాట్లాడుకొనే భాషలో వారు వ్రాసారు. దాన్ని నవల అన్నారు. నవల అంటే కొత్తది. భారతరామాయణాది పురాణాలస్థానం లేక ఈలియట్, ఒడిస్సీల వంటి ఎపిక్కులస్థానం ఆధునికంగా నవల ఆక్రమించింది. లోకవర్తనమెరిగి, మనఃప్రవృత్తులు ఆకళింపుజేసుకున్న ఎవరైనా నవలను అత్యుత్తమ సాహిత్య విలువలతో వ్రాయవచ్చు. నవలకు మానవజీవితమంతా కథావస్తువే. మనం మాట్లాడుకున్న భాషే దాని భాష. తెలుగు నవలకు నూరేళ్లు అంటున్నారు.

తొలి నవలగా చెప్పబడుతున్న రంగరాజ చరిత్రగాని, తొలినవలగా, మలినవలగా పరిగణింపబడుతున్న రాజశేఖర చరిత్రగాని, నవలకు కావలసిన సహజమైన భాషలో వ్రాయబడలేదు. వాడుక భాషలో అట్టడుగు ప్రజలజీవితంలోంచి అతివిశాలమైన యితివృత్తం తీసుకొని ఉన్నవవారు మాలపల్లి వ్రాశారు. అందుచేతనే మాలపల్లినే తొలి నవలగా ప్రస్తుతిస్తాను.

ఉన్నవవారు గాంధీజీ అనుయాయులు. బారిష్టరు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. వితంతుశరణాలయం పెట్టి, శారదానికేతనం నడిపించి, గాంధీజీ తలపెట్టిన నిర్మాణ కార్యక్రమంలో జీవితం గడిపినవారు. ఆనాటి దేశ పరిస్థితులలోంచి మాలపల్లి నవలను వెలయించారు. యాదార్ధ జీవితంలోంచి, వారు నమ్మే ఆదర్శాలతో పాత్రలను మలిచారు. అదేకాలంలో భావ కవిత్వోద్యమం విజృంభించింది. కాల్పనిక వాదుల ఆత్మాశ్రయ కవిత్వంలో తలమునకలైనారు.

వర్తమాన కాలంలో వున్న జీవితానుభవాన్ని మరిచి ఊహాలోకంలోకి పోయి, దంతభవనాల్లో లేని ఊర్వశులపై ప్రేమగీతాలు ఆలపించారు. సహజంగానే తరువాత తరం వారిని పలాయనవాదులన్నారు. మాలపల్లి నవల ఆనాటి జీవితంలోంచి బహిర్గతమై మహోత్కృష్టమైన రచనయ్యింది.

గుంటూరు మండలంలో మంగళాపురంలో రామదాసు అనే మాలదాసరి ఉంటాడు. శ్రీరామభక్తుడు, పెళ్లాం, పిల్లలూ, కాస్త ఆస్తిపాస్తి ఉండి మమకారాలతో జీవితం గడుపుతూ, సరియైన యోగమార్గాన్ని అన్వేషిస్తూ ఉంటాడు. బహుశాంతస్వభావుడు. మహాభారతంలో ధర్మరాజే! చివరకు స్థితప్రజ్ఞుడు. త్రిగుణాతీతుడు. వేదాంతవేది అయి రామదాస మహర్షిగా పరబ్రహ్మంలో ఐక్యమైనాడని చెప్పుకుంటారు.

రామదాసు జీవితం సకలమానవులకు పురుషార్థాలకీ, ఆదర్శప్రాయంగా వుందని శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు తన తొలిపలుకులో చెప్పారు. మాలదాసులు ఒకప్పుడు మతప్రచారకులు, సాంప్రదాయికంగా కాస్త జ్ఞానసంపన్నులు. అంచేత వారిని మాలబ్రాహ్మణులనడం ఉంది. అటువంటి కుటుంబాలకు చెందిన రామదాసు - అతని కొడుకులు వెంకటదాసు, సంగదాసు, కూతురు జ్యోతి, మేనల్లుడు అప్పాదాసు నవలలో ప్రధానమైన పాత్రలు.

సంగదాసు హత్య నవలకు తొలి ఘట్టం. సంగదాసు మంగళాపురంలో అతిపెద్ద భూస్వామి. అయినా చౌదరీలకు గుమస్తా. చౌదరయ్య కొడుకు రామానాయుడు సంగదాసువలన ప్రబోధితుడు. అది ప్రధానంగా చౌదరీలకు మంటగా ఉండేది. ఆర్యవిజ్ఞానం అందరిసొమ్మని, అది అందరికీ పంచిపెట్టాలన్న దయానందుతో ఏకీభవిస్తాడు. భక్తిజ్ఞానయోగాలు వ్యాప్తిలో ఉన్నాయి. కాని కర్మపరులు లేరని సంగదాసు అభిప్రాయం. తాను కర్మయోగిగా రూపొందుతాడు. కర్మయోగం, భక్తియోగారూఢమై మానవధర్మ పరిణామానికి సాధనం కావాలి. శైవ, వైష్ణవ బృందావనములందు జంగమదాసరులకు సారథ్యం సాధ్యమైంది - అని సంగదాసు అభిప్రాయం. మాలపల్లి నవలకు అది రెండవ ప్రాణం. సంగదాసు వర్ణవిభజన, వృత్తులవలన వచ్చిందని, దానివల్లనే ప్రపంచానికంతా అద్భుతమైన గ్రామ పరిపాలనా పద్ధతి స్థాపించబడిందని, ఆంగ్లేయులు గ్రామపరిపాలనా ప్రతిష్టాపనం విధ్వంసం చేసారని అందులకు ఆంగ్లధర్మశాస్త్రకర్త 'మెయిన్' ఆంగ్ల ప్రభువులను ఈ

దుండగానికై ఎంతో నిందించాడని చెబుతాడు. వర్ణవిభజనమనే మహాసౌధము శిథిలమైందని చెబుతాడు. హిందూసంఘం పునర్నిర్మాణం కావలసిందే అని అభిప్రాయపడతారు. వేమన, వీరబ్రహ్మం, సిద్దప్పల మొదలు వీరేశలింగందాకా వీర సంఘసంస్కర్తలు వర్ణవృక్షంమీద తమ గొడ్డళ్లను ప్రయోగించారు. అది క్రిందపడలేదు. మొండిగోడవలె ఉందని చెబుతాడు. అంచేత సంఘం నిర్జీవమై, శవాకారంగా వుందని నిశ్చితంగా చెబుతాడు. అందుకే సంఘ నిర్మాణానికి పూనుకుంటాడు.

ఉన్నవవారిపై, రష్యాలో వచ్చిన బోల్షవిక్ విప్లవం అసాధారణమైన ముద్రవేసింది. దాని ప్రభావం నవలనిండా కనబడుతుంది. చౌదరయ్య, మిగతా భూస్వాములు కూలివాళ్లకిచ్చే కూలి తగ్గించడానికి సిద్ధపడతాడు. ఆ అన్యాయాన్ని ఎదిరించడానికి సమ్మె చేయవలసిన పరిస్థితి వస్తుంది.

భూస్వాములు దోపిడీదారులు, కూలీలు దోపిడీ చేయబడుతున్న పీడితులు. ఇది వర్గకలహం. సంగదాసు సహజంగా దాని వెనుక ఉన్నాడు. ఇది మాలమాదిగల తగవు కాదు ఉన్నవాళ్లకి లేనివాళ్లకీ మధ్య తగువు.

భూమి మందిది. అనగా ప్రజలందరిదీ. లేక ప్రభుత్వానిది. భూస్వాములు కేవలం వ్యవసాయం మీద పెత్తనం చేసేవారని, న్యాయంగా కూలివాళ్లకు పంటలో ఎంతవాటారావాలో సంగదాసు చౌదరయ్యకు చెబుతాడు. కూలీలు తమ న్యాయమైన హక్కుల కోసమే సమ్మెచేపడతారు. బెజవాడలో సంఘనిర్మాణం జరుగుతుంది. సభాపతి వెంకటరెడ్డి మాలవాడే. ఇక్కడ నాయకత్వం మాలవారే వహిస్తారు. మాలలను ఎవరో ఉద్ధరించక్కరలేదు. మాలలే నాయకత్వం వహించి సంఘాన్ని పునర్నిర్మాణం చేయడం వారి ఆశయం. కార్మికుల నాయకత్వం మార్క్సిస్ట్ సిద్ధాంతమే. సభాపతి వెంకటరెడ్డి రష్యాదేశంలో సోవియట్ పంచాయితీ ప్రభుత్వం స్థాపించబడ్డాది. భూములపై ప్రత్యేక హక్కులు తొలగించి మంది హక్కుగా మార్చి, చేతితో వ్యవసాయం చేసుకునే వారికే చేయగలిగినంత భూమిని పంచియిస్తారు అని చెబుతాడు. అతనికైనా బోల్షవిక్ విప్లవంపై నమ్మకం లేదు. కాని ఆ వెంకటరెడ్డే ఇంగ్లండులో కూలీల ప్రభుత్వం ఏర్పడుతుందని, ఇంగ్లండులో వచ్చే పద్ధతుల్ని అనుసరించి అడుగువేయడం మనకు మంచిదని అంటాడు. సభనుంచి తిరిగి వచ్చిన సంగదాసుని చౌదరయ్య రాగోలతో తలమీద కొట్టడమేమిటి? చావడమేమిటి?

ఒక్కసారే జరిగిపోయాయి. మాలపల్లెలను మునుపల్లెలను చేద్దామన్న సంగదాసు నేలకొరిగాడు. "మనం గెలుస్తాం" అని ఆఖరిశ్వాస వదిలాడు. పెద్దదినం నాడు సంఘపీఠం ఒకటి నెలకొల్పారు. సంగదాసు తలపెట్టిన కార్యక్రమం కొనసాగించడానికి అంతా పూనుకుంటారు. అందుకే నవలకు 'సంగవిజయము' అని మరోపేరు పెట్టారు ఉన్నవవారు.

అక్కడ్నించి కష్టాలపరంపర రామదాసుని పట్టుకుంటుంది. దావాలో యావదాస్తిపోతుంది. వృత్తాంతమంతావిని రామదాసు 'సద్గురూ' అంటాడు. మాసొమ్మయితే మాకుండేదే! విచారించి ఏం ప్రయోజనం అంటాడు. పెళ్లానికి మూడుపూటలా తిండిలేదని, పిల్లలకి పాలులేవని తెలిసి 'సద్గురూ' అంటాడు. భగవత్సాన్నిధ్యాన్ని పొందటానికి దారిద్ర్యమే దగ్గరితోవ. ఆకు నలిపినపుడే సువాసన బయలుదేరుతుంది. కష్టములే భగవంతుడు మెచ్చిన వారికిచ్చే వరాలంటాడు. కారాగృహవాసం, వనవాసానికి బదులు వచ్చింది. 'నిస్సంగత్యం నాకు కుదరదా! హా! భగవంతుడా' ఆపదలు మోస్తరుగా తెచ్చిపెట్టి వాటిని మహావరములుగా మారుస్తావు - అంటాడు. వెంకటదాసు నిశ్చయించుకున్నాడు. 'నీధర్మశాస్త్రాలన్నీ భాగ్యవంతులు పేనించిన పురులు - బీదల కంఠానికి ఉరులు - నేను మీ రాజుమీద, దేవుడిమీద సవాల్' అని వెంకటదాసు కుటుంబాన్ని విడచి వెళ్లిపోతాడు. చౌదరయ్యకి, రామానాయుడకి కష్టకాలమొస్తుంది. చౌదరయ్య కోడలు, రామానాయుడు పెళ్లాం కమల మోహనరావుతో చెన్నాపట్నం లేచిపోతుంది. చౌదరయ్య పెళ్లాం చచ్చిపోతుంది. మనవడు సాహుక్రిష్ణ కూడా చచ్చిపోతాడు. ఆఖరికి చౌదరయ్యా చచ్చిపోతాడు. అప్పాదాసుని మోహకృష్ణగా చూసుకుంటుంది జ్యోతి. జ్యోతిని అప్పాదాసు రాధగా చూసుకుంటాడు. ఆ ప్రేమ సౌరభం బ్రహ్మాండమంతా గుప్పించి తావులు వెదజల్లుతున్నాయి. వాళ్లప్రేమ మోక్షమును సమకూర్చింది. కానీ, సెటిల్‌మెంట్‌లో పాల్ అనే క్రైస్తవుడు జ్యోతిని మానభంగం చేయబోతే 'కృష్ణా!' అంటూ కృష్ణలోకి దూకుతుంది. ప్రాణాలు విడిచి ఒడ్డునకు జేరింది. అప్పాదాసు జ్యోతిని పూలతో అలంకరించి దాన్ని భుజాన వేసుకొని కృష్ణాప్రవాహంలోకి పోతాడు. ఆలింగనంలో మునిగితేలి కొట్టుకుపోయారు.

వీరహనుమాన్ నినాదంతో తక్కెళ్ల జగ్గడు రాష్ట్రం పొడుగునా బందిపోట్లకు శిక్షణనిచ్చాడు. విజృంభించారు. నిజాం రాష్ట్రం, మైసూర్‌కి విస్తరించాడు. ప్రభుత్వం

పెద్దదై సైన్యాన్ని జగ్గడు మీదకు పంపారు. ధర్మకన్నాలు వేసి లక్షలకులక్షలు దోచుకుంటున్నాడు. సంకులసమరం యిరుపక్షాలకి జరుగుతుంది. రామసింగు కంఠం జగ్గడు తెగగోసి సింహనాదం చేస్తాడు. జగ్గడి అనుచరులైన సంతాలులంతా కొనఊపిరిదాకా పోరాడుతారు. జగ్గడు, సంతానులు కర్నూలు, నంద్యాల జైలుతాళాలు బద్దలుకొట్టి ఖైదీలను విడపిస్తారు. కాని జగ్గడి కాలూచెయ్యీ తెగగొట్టబడి దొరికిపోతాడు. కోర్టులో పెద్ద స్టేట్‌మెంట్ ఇచ్చారు. సృష్ట్యాదిని హక్కుపత్రాలు లేవు. పంటను అందరూ అనుభవిస్తూ ఉండేవారు. పుడమిదయ్యాలు ఐశ్వర్యవంతులు పుట్టారు. యథాశక్తిగా దేశాలు, గ్రామాలు, ధనధాన్యాలు ఆక్రమించుకున్నారు. మనుషులను బానిసలనుచేసి వారిమీదసైతం స్వామిత్వం సంపాదించారు. కష్టపడి, పంటలు పండించి, చేతిపనులు చేసి అమర్చిన పదార్థమంతా ధనవంతులపహరించి తొక్కి, తొండాడి, శ్రమపడి పనిచేసే వాళ్లకు ఆహారం లేకుండా చేస్తున్నారు. వీటికనుకూలంగా చట్టాలు చేసుకున్నారు. భాగ్యవంతులు బీదలను దోచుకుంటే అది వ్యవహారం, బీదలు తమ హక్కులు తీసుకుంటే అది చౌర్యం. భాగ్యవంతులు తమ వర్తన మార్చుకోకపోతే బీదలే చట్టాలను మార్చి, లోకంలో భూతలస్వర్గం స్థాపిస్తారు. ఈ ధర్మం నెరవేరడానికి దయాసత్యశౌచాలు సాధనంగా తీసుకుంటాం అని చెబుతారు. మరణమాసన్నమవుతున్న వెంకటదాసుని రామదాసు - 'బాబూ! నామాటవిని ఒక్కమారు నారాయణా! అనుకో' అన్నాడు. 'నీ దయామయుడు లోకమంతా పంచమహాపాతకం చేశాడు. దేవుడంటే జనమంతా తిరగబడి సన్మార్గవర్తిని చేయవలసిన అవసరం ఉంది. కాలుతెగింది, చేయివిరిగింది, మిగిలిన మొండేన్ని వేయిగా విభజించినా శిరస్సు వంచను. ఆ చీలికలు కూడా వంగవు, అంటాడు వెంకటదాసు. రామదాసు "పిచ్చి తండ్రీ" నీ నమ్మకం ప్రకారమే ఉండు. భగవంతుడికి నీమీద నమ్మకం లేకపోవడం నీతప్పేంకాదు. ఇది చాలా కొత్తనాటకం. నీ నాటకనియమాలు కూడా వేరే. నేను మామూలు దారిని పోయేవాడిని. నీదిమార్గం కాదని చెప్పతాను. నీమార్గం నియమబద్ధంమటుకు అవును. ఆ నియమాలు చాలా ఉత్కృష్టమైనవి - అని రామదాసు వెంకటదాసుకి చెబుతాడు. వెంకటదాసు ఆఖరి సమయమొచ్చింది. అతని శరీరంలో నుంచి లోకమంతా వెలిగిన నీలకాంతి గల మహాతేజం గుప్పున ఆకాశానికి లేచింది. అది రామదాసు దృష్టికి మాత్రం గోచరమైంది. వెంకటదాసు - తక్కెళ్ల జగ్గడు దోచుకున్న ధనం అయిదుకోట్లు సంతాలులని

పంచుకొని న్యాయజీవితం గడపమని చెబుతాడు.

పంచమోద్యమానికీ పాటకోద్యమానికీ సనాతనుల ధర్మమని చెరి 5లక్షలు తక్కెళ్ల జగ్గడు సంతకంతో వస్తుంది. కార్మికోద్యమానికివ్వబడ్డ 5 లక్షలు ఆంధ్రకార్మిక మహాసభకు యిచ్చివేశాడు. మంగాపురంలో 'విజయకళాశాల' అనేపేరుతో గురుకులం స్థాపించాడు. దానికి 5 లక్షలు యిచ్చివేశాడు. తిరుమంగయాళ్వారు పూర్వం చేసిన కైంకర్యాలు సాధనశుద్ధి తక్కువనుకున్నా పూజనీయంగానే వున్నాయి. కాబట్టి రామదాసు ఆడబ్బు పుచ్చుకోవడానికి ఆమోదిస్తాడు. ఆఖరికి మోహనరావు, పంతులు, వెంకటయ్య, రామానాయుడు అంతా 'విజయ కళాశాల'కి డబ్బుయిస్తారు. పాటుపడతారు. సన్యాసం పుచ్చుకున్న రామదాసుని కళాశాలకు కులపతిని చేస్తారు. కళాశాలలో అస్తమయసూర్యునివలె మగ్గంనేసుకుంటూ బ్రహ్మతేజస్సుతో ఉండేవాడు. తరువాత రావడం మానేశారు. ఏమైనాడో ఎవరికీ తెలీదు.

ఉన్నవవారు గుంటూరు మండలం పల్లెటూళ్లలో వారే. అతి అపురూపమైన పదజాలం నవలలో పుష్కలంగా వాడేరు. ఇంగ్లీషుమాటలకు పొరపాటునైనా తావీయలేదు. కాని జైలులో పారావాండ్లు తిరుగుతూ రాత్రి, All is well 'అంతాక్షేమం' అనడానికి బదులుగా ఆల్ ఈజ్ హెల్ - అంతా నరకం అంటూనే ఉండేవారు. అది చదివేవాళ్లకి ఒకే ఒక వాక్యమైనా, గింగుర్లు పెడుతూ ఉంటుంది. ఇందులో పాత్రలు - ఉన్నవవారి ఆదర్శాలు. వారి భాషని జ్ఞానాన్ని పాత్రలకు కలగజేసి, ఒక పరిణామానికి నమూనా తీసుకువచ్చారు. గ్రాంధిక పదజాలం కూడా సమ్మిశ్రమంగా విరివిగా వాడేరు. అల్లూరి సీతారామరాజుగారి మన్యం తిరుగుబాటు తక్కెళ్ల జగ్గడు ప్రభావంతో వచ్చివుందా అని సందేహంకలుగుతూన్నది. మాలపల్లి నవల వచ్చిన వెంటనే అది ప్రారంభమైంది!

# 4 గురజాడ అప్పారావు

విజయనగరం పెద్ద చెరువు గట్టున డాబా తోటలో ఆనందజగపతి మహారాజా వారి నాటకశాల ఉండేది. ఆ నాటకశాలలో 1892లో విద్వజ్జనవరేణ్యుల సమక్షంలో వినూత్నమైన తెనుగు రూపకం ప్రదర్శించబడ్డాది. ఆ రూపకం 'కన్యాశుల్కం'. అది రాసిన మహాకవి గురజాడ అప్పారావు. యావద్భారత దేశంలోనే కాక బ్రిటిష్ సామ్రాజ్య దేశాలనగా ఇంగ్లాండుతో సహా అటువంటి నాటకం ఇంగ్లాండులో ఎవరూ రాసి, ప్రదర్శించలేదు. ముప్పయి సంవత్సరాలయువ్వనుడు గురజాడ అప్పారావు. భాస, భవభూతి, కాళిదాసాది సంస్కృత కవుల నాటకాలను చదివినవాడు. సంస్కృతాలంకారికుల రూపక వివరణలనుఎరిగినవాడు. గ్రీకు నాటక ప్రకాండుల, విమర్శకుల లక్ష్య లక్షణాలను ఎరిగిన వాడు. పాశ్చాత్య దేశాలలోభాషాశాస్త్ర, భాషా చరిత్రలను అధ్యయనం చేసినవాడు. 'కన్యాశుల్కం' రాసిన మహాకవి గురజాడ అప్పారావు. కన్యాశుల్కం నాటకం ప్రపంచ భాషలలో వాస్తవికవాద రచనకి మూలమైన మహాకావ్యాలలో ఒకటి. ఈ వాస్తవాన్ని మనం సరిగ్గా ఎరిగిలేము, ఎరిగినా దానికి గుర్తింపు తేవడానికి ప్రయత్నించనూ లేదు.

1892లో కన్యాశుల్కం ప్రదర్శించిన నాటికి బెర్నార్డ్‌షా తన నాటకాన్ని ఇంగ్లాండులో ప్రదర్శించడానికి విశ్వ ప్రయత్నాలు చేస్తున్నాడు. ఆయన నాటకం ప్రదర్శించడానికి ఆనాటి బ్రిటిషు ధర్మశాస్త్ర ఆమోదం లభించలేదు. ఆ కారణం చేత కన్యాశుల్కం ప్రశస్తి ఏమిటో సులువుగానే తెలుస్తుంది. కాని తెలుగువారు మన దేశ భాషలలోదానికి సముచిత స్థానం కనీసం కలగజేయలేకపోయారు. ఇది ప్రపంచ భాషలలో సముచితస్థానం గలనాటకం. ఈ మధ్యనే ఇది రష్యన్ మొదలయిన సోషలిష్టు రాజ్యాల భాషల్లోకి అనువదించబడడం కాస్త సంతోషదాయక విషయం.

ఇప్పుడిప్పుడే 'ఆంధ్రప్రదేశ్ హిందీ ఎకాడమీ' 'కన్యాశుల్కం' మరికొన్ని గురజాడ ఇతర రచనలు హిందీలోకి అనువదించి ప్రచురించే ఏర్పాట్లు చేస్తున్నట్లు తెలుస్తోంది, సంతోషం.

విజయనగరం డాబా తోట నాటకశాలలోనటులకి జీతాలిచ్చి సంస్కృత నాటకాలు ప్రదర్శించేవారు. సంస్కృత నాటక పునర్వికాసానికి దోహదం చేశారు. ఆనాటకాల ప్రదర్శనా పద్ధతిని కన్యాశుల్కం ప్రదర్శించబడ్డాది. సంస్కృత నాటకమర్యాదని అనుసరించి శ్రీముడుంబై పండిత కవిగారి చేత సంస్కృతంలోనాంది రాయించి ఆ నాందితో కన్యాశుల్కాన్ని ప్రదర్శించేరు. (1892లో!

తొలి కన్యాశుల్కం పుస్తకం పందొమ్మిదవ శతాబ్దాంతంలో అచ్చయింది. అప్పట్నుంచి కన్యాశుల్కం తెలుగు సాహిత్య వాతావరణంలో మైక్రో శబ్ద తరంగాలై విస్తరించి వినిపిస్తున్నది. తెలుగుభాషకి, సాహిత్యానికి కన్యాశుల్కం తీసుకొచ్చిన పరిణామం మహా విప్లవాత్మకం. దేశ భాషా స్వరూపాలు తక్షణమే మారిపోయాయి. "బతుకునందు లేని స్థిరత, వెతకనేల భాషయందు'' అని అప్పారావుగారు చెప్పారు. 'వాడుక భాష జీవిక కలది. దాని ప్రవాహం మహానదీ ప్రవాహం'' అని కూడా చెప్పేరు. నన్నయ నాటి నుంచి తొమ్మిది శతాబ్దాలై పండిత కవుల భాష వెనక్కి పోయింది. కృతక భాషగా, వేరే మరొక భాషగా అయిపోయింది. ప్రాచీన గ్రాంథికభాషలో నిరర్గళముగా తూగిన వారు ఆ భాషనే వ్రాసి ఆనందింతురుగాక. ఎవరు వద్దనిరి?'' అని గురజాడవారు ప్రశ్నించారు. "నా నేర్పు కొలది నేనొక కొత్తతోవ తొక్కితిని. తప్పేమి? నలుగురూ ఆమోదించారా నేను కల్పించిన వృత్తమును అవలంబింతురు. ఆమోదించరా, పరిత్యజింతురు'' అన్నారు గురజాడ అప్పారావుగారు. పన్నెండే పన్నెండు 'ముత్యాల సరాలు' పేరుతో కవితలు రాశారు. అక్కణ్ణుంచి తెనుగు కవిత్వం వారి మార్గాన్ని పడిపోయింది. వారు ఆశించేదే జరిగింది.

కవిత్వంలో గరజాడ వారు ఆంగ్లకవిత్వంలో వర్డ్సువర్తు నాటి నుంచి తన నాటివరకు వచ్చిన మార్పులని పూర్తిగా అవగాహన చేసుకొని ఈ పన్నెండు ముత్యాలని సరం కట్టి మనకి బహూకరించారు. 'కన్యక', 'డామన్‌పిథియస్', 'పూర్ణమ్మ', 'లవణరాజు' కల' ఈ నాలుగూ తెలుగు విమర్శకులు విశ్లేషించి చెప్పింది కొంత ఉన్నా, చెప్పంది పైకి తియ్యంది, చాలా ఉంది.

మన సాహిత్యానికి రసం ప్రధానం. తెనుగు వాళ్ళకి శృంగార రసం మరీ ప్రధానం. దాని జోలికి గురజాడ వారు పోలేదు. కన్యాశుల్కంలో హాస్యరసానికి ప్రాధాన్యత కల్పించారు. హాస్యరస ప్రధానమైన నాటకాన్ని సంస్కృతం వారు ప్రహసనం అని పేరు పెట్టి తక్కువ స్థానం యిచ్చేరు. ఆ రస ప్రధానంగా దీర్ఘమైన రూపక రచన ప్రాచీన కాలంలో చెయ్యలేదు. ఆ కారణం చేతే కన్యాశుల్కాన్ని ప్రహసనంగా జమకట్టి మన పండితులు తక్కువ చెయ్యడానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా అది ఎక్కువదై కూర్చుంటున్నది. వారు తీసుకొచ్చిన హాస్యం సంస్కృతం వారి హాస్యం ఎంతమాత్రం కాదు. పాశ్చాత్యుల 'హ్యూమర్' అనగా సహజమైన హాస్యం. 'విట్' అనగా బుద్ధి జనితమైన హాస్యం. 'సెటైర్' అనగా అవహేళనాత్మకమైన హాస్యం. వాటిని గురజాడ వారు దిగుమతి చేశారు.

శృంగారం తర్వాత కరుణరసాన్ని ఉత్కృష్టమైనదిగా సంస్కృతం వారు భావిస్తారు. అయితే సంస్కృతం వారి కరుణరసం భవభూతి ఉత్తర రామాయణంలోనిది. అనగా విప్రలంబ శృంగారం, అదీ శృంగారమే. రాముడు సీతకోసం ఏడుస్తాడు. భవభూతి మనచేత ఏడిపిస్తాడు. అదీ సంస్కృతం వారి కరుణ. నవలాకారుడు డికెన్స్ హాస్యరసానికి కరుణరసాన్ని జోడిస్తాడు. మనం పకాలున నవ్వుతాం. ఆ సన్నివేశం మనల్ని నవ్విస్తుంది. అప్రయత్నంగా మనకళ్ళ వెంబడి నీళ్ళొస్తాయి. అదీ డికెన్స్ కరుణ-లేక-పేథాస్. ఇటువంటి కరుణకి మన సాహిత్యంలో ప్రాధాన్యత లేదు. ఆ కరుణ రసాన్ని ప్రధాన రసంగా చేసి 'పూర్ణమ్మ' మొదలైన కవితల్లో గురజాడ పొందుపరిచేరు. ఒక్క కరుణమాత్రమే! వీటిలో హాస్యాన్ని మిళితం చేయలేదు. ఈ పన్నెండు కవితలే మందగించక ముందు అడుగు వేశాయి. యువకులని ముందుకు నడిపిస్తున్నాయి. తమకున్న భాషా జ్ఞానంతోనే కవులవుతున్నారు. గురజాడ వారు చెప్పినట్లే కఠినమగు గ్రాంధిక భాష నేర్వలేని పుట్టుకవులు ఉద్భవించారు. ఉద్భవిస్తున్నారు. గురజాడలోగురుత్వం ఉంది. కొత్త జాడ ఉంది. ఆ జాడ సిమెంటుకాంక్రీటు రహదారి. ప్రాచీన కాలపు ఏనుగుల మార్గం కాదు. మన ప్రబంధాలు ఏనుగులు. నేడు అక్కరకు రానివి. గురజాడ వారి 'దేశభక్తి' గేయం ఏ దేశీయులకైనా వర్తిస్తుందని, భారతదేశానికీ వర్తిస్తుందని చెపుతున్నారు. మనదేశానికి వారు చెప్పింది ఫలించక ఇప్పటికీ మనం ఇబ్బంది పడుతున్నాం. చెట్టపట్టాలు వేసుకొని జాతులు, మతాలు అన్నదమ్ముల్లా నడవాలని వారు కోరారు.

మతం వేరైనా మనసులొక్కటైతే జాతము అన్నది లేచి పెరిగి లోకంలో మనకి కీర్తి తెస్తుందని ఆయన చెప్పారు. వారు చెప్పినది ప్రపంచానికి చెప్పినది కూడా అవును. దేశదేశాలకీ. ఐక్యరాజ్య సమితిలో ఈ మంచి ముత్యాన్ని ఉంచవచ్చు.

"పూను స్పర్ధను విద్యలందే,
వైరములు వాణిజ్యమందే;
వ్యర్థ కలహం పెంచబోకోయి
కత్తివైరం కాల్చవోయి''

ఈ నాలుగు వాక్యాలూ ప్రపంచ భాషల్లోకి అనువాదం చేసి ఐక్యరాజ్య సమితి భవనంలో పొందుపరచవచ్చు. ముత్యాల సరాలలాగే ఆయన రాసిన కొద్దిపాటి కథలూ ఆణిముత్యాలు. గురజాడ వారు **54** సంవత్సరాలకే కీర్తిశేషులయ్యారు. విజయనగరం మహారాజులకి ఆంతరంగిక ప్రధానోద్యోగిగా కొండంత ఆస్థాన కార్యభారాన్ని నెత్తిమీద వేసుకొని సాహిత్యానికి తాను చెయ్యవలసినది చెయ్యలేక పోయారు. ముత్యాలసరాల్లోనూ, కథల్లోనూ భాషతో, భావంతో అనేక పరిశోధనలు చేసి సరియైన మార్గం మనకు చూపించి ధన్యుడయ్యాడు.

ఈనాడు గురజాడ వారు నవల రాయకుండానే వెళ్లిపోయినా తెనుగులో వస్తున్న వచన సాహిత్యం అంతా వారి మార్గాన్ని అనుసరిస్తున్నదే. ఏ పుస్తకం చదివినా, ఏ పత్రిక చదివినా, రేడియో విన్నా, టి.వి. చూసినా, సినిమా చూసినా గురజాడ వారి ప్రమేయమే మనకి కనబడుతుంది. సాహిత్యానికి మూలం ప్రజా జీవితం. దానిని మొట్టమొదట ప్రతిఫలింప చేసినది గురజాడ . కృతకృత్యుడు గురజాడ.

# 5. స్థితిగతులు

మార్పు ప్రకృతికి సహజం. గాలిని "సదాగతుడం"టారు. ఎల్లప్పుడూ కదులుతూ వుంటుంది. ఒక స్థితి నుండి మరొక స్థితికి పోతూవుంటుంది. గాలి కదలిక కనపడుతుంది. ప్రకృతిలో సమస్తం మార్పు చెందుతూ వుంటుంది. స్థిరంగా ఉన్నట్టు కనబడే రాయి కూడా కదుల్తూనే వుంటుంది.

మనిషి ప్రకృతిలో భాగం. మనిషి సమాజంలో తన క్షేమం కోసం, మనుగడ కోసం కొన్ని నియమనిబంధనలు సృష్టించుకుంటూవుంటాడు. మంచిని కోరే కొన్ని వ్యవస్థలు ఏర్పాటు చేసుకొంటాడు. అవి కొన్నాళ్ళకి వాటంతటకవి మార్పును కోరుతూవుంటాయి. మారిపోతూవుంటాయి. మనిషి ఏర్పాటు చేసుకొన్న వ్యవస్థ ఆనాటి అవసరాలకు ఉత్తమమైనదిగా కనబడుతుంది. కాలక్రమేణా అది నిరుపయోగమైనదౌతుంది. అంతేకాకుండా ప్రమాదకరమైనదీ అవుతుంది. ఈ వ్యవస్థ సహజంగా పుట్టినదికాదు. మనిషి సృష్టించినది. దానికి పుట్టుక ఎలాగలేదో చావూ అలాగే వుండదు. అది నిరుపయోగమైనది కావడమే కాక ప్రమాదకరమైనప్పుడు దానిని కూకటివేళ్ళతో పెకిలించివేయాలి. మరొక వ్యవస్థని నిర్మాణం చేసుకోవాలి

మార్పు సహజంగా జరుగుతూ వుంటుంది. అది ఏ దిశకి పోతున్నదో గమనించాలి. సరియైన దిశకి మళ్లించాలి. అప్పుడు సమాజం బాగుపడుతూవస్తుంది. తోకచుక్క పొడిచింది. తెనుగు కవిత్వం 'గతి' మారిపోయింది. భూమికది దూరబంధువని కొత్త కవి చెప్పేడు. ఆ కవిత సహస్రమాసజీవియైవుంది. నిస్సందేహంగా మరో సహస్రమాసాలు జీవించే వుంటుంది. మూఢనమ్మకాలు కూడదని ఆ కవిత చెప్పింది. మూఢ విశ్వాసాలు మూఢ విశ్వాసాలుగానే ఉన్నాయి. ఎందుచేత?

కారణం స్పష్టంగానే కనబడుతున్నది. ఏంచెయ్యాలో కూడా స్పష్టంగా తెలుస్తూనే వున్నది. ఆచరణలోకి రావడం లేదు! గత వంద సంవత్సరాలై మన మేధావులు సమాజంలో రావలసిన మార్పుల గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నారు. మార్పులు తేవడానికి శతవిధాల ప్రయత్నాలు చేస్తున్నారు. సతీసహగమనం భయంకరమైనది. నిండు ప్రాణాన్ని నిప్పుల్లో తోసి దహనం చేసేవారు. ఈ దురాచారం పనికిరాదని చట్టం తీసుకొచ్చారు. అంతటితో అది "అరి'కట్టబడ్డాది. తిరిగి మళ్ళా ఉన్నానంటోంది. వితంతువులకు పునర్వివాహం చేయడం న్యాయమని సంస్కర్తలు ప్రబోధం చేశారు. చేసుకోవచ్చని చట్టం చేయించారు. తీవ్రమైన ప్రతిఘటనని ఎదుర్కొని పునర్వివాహాలు చెయ్యడం మొదలుపెట్టారు. యువకులు ముందుకువచ్చారు. వివాహాలు చేసుకున్నారు. కథకులు కథలు రాసి, నాటకకర్తలు నాటకాలు వేసి, నిర్మాతలు సినిమాలు తీసి కావలసినంత ప్రచారం చేశారు. సమాజంలో మార్పు త్వరితగతిని వచ్చింది.

స్త్రీ విద్య ప్రాధాన్యత గూర్చి చెప్పేరు. స్త్రీలు జనాభాలో సగానికి సగం అంటారు. వాళ్ళు అజ్ఞానంలో ఉంటే దేశం సగం అజ్ఞానంలో వుంటుంది. మొగపిల్లలతో పాటు ఆడ పిల్లలకీ చదువు తప్పకుండా చదివించాలని హేతుబద్దంగా చెప్పేరు. ముద్దుగా చెప్పిస్తే ముదితలు నేర్వలేని విద్య లేదని చెప్పేరు. స్త్రీవిద్య విజృంభించింది. పురుషుడికి ఏవిధంగానూ, ఏ రంగంలోనూ స్త్రీ తీసిపోదని స్త్రీలు రుజువు చేసుకున్నారు. పురుషుడితో సమానమైన హక్కుల కోసం స్త్రీలు వాళ్ళకి వాళ్ళే పోరాడుతున్నారు. హక్కులు సంపాదించుకుంటున్నారు. అంతవరకు బాగానేవుంది.

మరో గడ్డ సమస్య ఉంది. అది ఆర్థికం! వరకట్నం కూడదని సుళువుగా చెపుతున్నారు.వరకట్నం పుచ్చుకుంటున్నారు! ఆడపిల్లలకి పెళ్ళికావడం కష్టతరమైపోయింది. అవివాహితులుగా ఉండిపోవలసివస్తున్నది. వరకట్నాలు ఇచ్చి కొన్ని సంసారాలు చితికిపోతున్నాయి. ఇస్తామన్నది పూర్తిగా ఇవ్వలేదనో, ఇచ్చింది చాలలేదనో, ఇంకా ఇంకా తెమ్మనో పెళ్ళి అయి అత్తవారింటికి వెళ్ళిన ఆడపిల్లలను వేధించుకు తింటున్నారు.కడగండ్లు పడలేక కొందరు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. అత్తవారిళ్ళలో కొందరు ఈ కారణంచేత హత్యలు కూడా చేయబడుతున్నారు.

వరకట్నం పుచ్చుకోవడం నేరం అని "చట్టం" ఉంది. అమలు కాదు. ఎందుచేత? ఇచ్చినవాళ్ళు ఇచ్చామని చెప్పుకోరు. పుచ్చుకున్న వాళ్ళు పుచ్చుకొన్నామని ఎలాగూ చెప్పరు! ప్రచారం చేస్తున్నారు. కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో వరకట్నం పుచ్చుకోకూడదని, విద్యార్థులు తీర్మానాలు చేస్తున్నారు. పట్టభద్రులైన తరువాత? వాళ్ళు అసాధారణమైన కట్నాలు పుచ్చుకుంటున్నారు. తల్లిదండ్రులకు కోడళ్ళు కట్నాలు విధిగా తేవాలి. వాళ్ళింట్లోనూ ఆడపిల్లలుంటారు. వాళ్ళకి వాళ్ళు కట్నాలిచ్చి పెళ్ళి చెయ్యాలి. చదువులకు మొగపిల్లలపై బోలెడు డబ్బు ఖర్చుపెడతారు. కొందరు చదువులకు అప్పులు చేస్తారు. కొడుకుల పెళ్లి వల్ల కొంత కలిసిరావాలి.

సామాన్యుడి యింట్లో అవి లేవు. ఇవిలేవు. చాలా చాలా లేవు. లేనివన్నీ కావాలి. కావలసినవన్నీ కోడలు తేవాలి! డబ్బున్న వాళ్ళమాట. అక్కడా చిక్కులున్నాయి. యోగ్యుడైన, విద్యాధికుడైన పెళ్ళికొడుకుంటాడు. మూడు లక్షల కట్నం ఇవ్వడానికో సంసారి పిల్లనిస్తానని ముందుకు వస్తాడు. మూడు లక్షల కట్నమూ ఇస్తాడు. మరో లక్ష పెట్టి పెళ్ళి చేస్తాడు. బలుణ్ణి మహాబలుడు కొడతాడు. మూడు లక్షలేమి ఖర్మ, ఆ పెళ్ళికొడుక్కి పది లక్షలు పారేసి మరో మహాధనవంతుడు తన్నుకుపోతాడు!

దీనంతటికి మూలం ఎక్కడుంది? దీనంతటికీ మూలం ఎక్కడుందో నిరక్షరాస్యతకి మూలం అక్కడే వుంది. ఈ దేశానికి పట్టుకున్న మహా అరిష్టాలలో నిరక్షరాస్యత అతి ముఖ్యమైనది. ఇది ఏనాడో గుర్తించబడ్డాది. నిర్బంధ విద్యావిధానం అమలు చెయ్యాలి. వయోజనులకు విద్య గరపాలి. ఆడా మగా విచక్షణ లేకుండా పిల్లలంతా విధిగా చదువుకోవాలి. తెలిసిన విషయమే. అమలుపర్చడం ఎలాగ?

పట్నంలో టీకొట్లో కనబడతాడు పదేళ్ళ లోపు కుర్రాడు. టీ కప్పులు గ్లాసులు టేబిళ్ళమీంచి తీస్తూ వాటిని కడుగుతూ! అనేక వ్యాపార సంస్థలలో పెద్ద చిన్న దుకాణాల్లో. వర్కుషాపుల్లో, సైకిలు షాపుల్లో పసి పిల్లలు కోకొల్లలు కనబడతారు. పల్లెటూళ్ళలో పశువులని చెరువుల్లో కడుగుతూ పశువుల్ని తోలుతూ కనబడతారు.వాళ్ళు పెద్ద రైతుల ఇళ్ళల్లో బరువులు మోస్తూ అడ్డమైన చాకిరీ చేస్తూ కనబడతారు.

బడి వాళ్ళ ఎదురుగానే వుంటుంది. చదువు ఉచితంగానే చెపుతారు! కుర్రవాళ్ళు బడికి వెళ్ళరు. వాళ్ళ తల్లిదండ్రులు పంపరు. పంపలేరు.వాళ్ళకి

తల్లిదండ్రులుతిండి పెట్టి పోషించలేరు. పిల్లలు వాళ్ళ గంజినీళ్ళకు వాళ్ళే పాటుపడాలి. కొంచెం జరుగుబాటువున్న వాళ్ళ పిల్లలు కాస్త చదువుతారు. హైస్కూల్లో పదో క్లాసుదాకా ఎగబడతారు. అక్కడ చాలా మంది ఫెయిలయి చదువుమానేస్తారు. పదో క్లాసు పేసైన చాలా మంది కాలేజీ చదువులకు వెళ్లలేరు! పదో క్లాసు పట్టాతో ఉద్యోగం ఎక్కడా దొరకదు! నిరుద్యోగులై తిరుగుతూ ఉంటారు. అందులో మహా మేధావులు కావల్సిన వాళ్ళు ఎందరో అధోగతిపాలైపోతుంటారు.

కాస్త పైతరగతి తల్లిదండ్రులు పిల్లల్ని పట్టభద్రుల్ని చేస్తారు. వాళ్ళు విశ్వవిద్యాలయాల్లో ఉన్నత విద్యకి పంపలేరు. వాళ్లకీ ఉద్యోగాలు దొరకడం దుర్లభమే. వాళ్ళలో ప్రతిభావంతులు మట్టికరుస్తూ వుంటారు. ఇహ ఉన్నత విద్య విశ్వవిద్యాలయాల్లో మహా ధనవంతులదైవుంది! షెడ్యూలు కులాల, వెనుకబడ్డ వాళ్ళ పిల్లలు కాస్త చదువుల్లో ప్రభుత్వ సహాయం ఉన్నందువల్ల కనబడుతున్నారు. ఈ చదువుకున్న వెనకబడిన తరగతుల వాళ్ళు వేరే ప్రత్యేకవర్గమై కూర్చుంటున్నారు. వాళ్ళ కులాలకి కూడా కొందరు దూరమైపోతున్నారు. ఎందుచేత? కులవ్యవస్థా? ఆర్థిక వ్యవస్థా?

చిరకాలమై పీడిస్తున్నది కులవ్యవస్థ. దీని అనర్థాలు విశదమై వున్నాయి. చదువుకున్న వాళ్ళు కులాంతర వివాహాలు విరివిగా చేసుకొంటున్నారు. అటువంటివాళ్ళకి "వెలి"సమాజంలో ఇప్పుడు లేదు. ఆ వివాహాలు పొరపాటు కాదనే భావం సర్వే సర్వత్రా ఉంది. కాని కులతత్వం తప్పు అని చెపుతున్నవాళ్ళే కులాభిమానాన్ని, కులద్వేషాన్ని రెచ్చగొడుతున్నారు. కుల ప్రాతిపదికమీదే ఓట్లు తెచ్చుకుంటున్నారు. కులాల వారీగా అధికారం పంచుకుంటున్నారు. కులవ్యవస్థని కూకటివేళ్ళతో పెకిలించివెయ్యాలి. దానంతటదే కూలిపోతున్నది. అది అంతం అయిపోతుండడం ప్రత్యక్షంగా కనబడుతున్నది. కాని త్వరితగతిని అంతరింపజేసే శక్తులు విజృంభించడం లేదు. ఎందుచేత?

మతమౌఢ్యం ఎందుకు ఉందో అందుచేతే!, మానవ మేధస్సు అంతరిక్షంలో ప్రయోగాలు చేస్తున్నది. మతం వెనక్కి, వేల సంవత్సరాల వెనక్కి పోయి నాటి మూఢ నమ్మకాలకుఅంటిపెట్టుకుంటున్నది. అశాస్త్రీయమైన నమ్మకాలు పునరుద్ధరించబడుతున్నాయి. చదువు కొద్దిమంది ధనికులదైవుంది. శాస్త్రీయ దృక్పథం ప్రజల్లోకి వెళ్ళడం లేదు. దీనంతటికీ మూలం స్థితిగతులు!స్థితి అంటే ప్రస్తుతం

ఉన్నది. స్థితి'గతి' అంటే భవిష్యత్తులో ఉన్నది. 'గతి'లో వున్న 'గ'గమనంలో ఉన్న 'గ'. స్థితిగతులు బాగున్నాయంటే ఇప్పుడు బాగుంది. ముందూ బాగుంటుంది. అదీ దానర్థం. వ్యక్తిని తీసుకుంటే వాడి 'స్థితి' ఏమిటి? వాడికేముంది? "కాళ్ళూ చేతులూ" ఉన్నాయి. అంతకుమించి ఏమీ లేదు. ఇక వాడి 'గతి' అనగా భవిష్యత్తు? అగమ్యగోచరం!

ఇంకో వ్యక్తిని తీసుకుచూస్తే వాడి 'స్థితి' ఏమిటి? 'వందకోట్లు' విలువ చేస్తాడు. రోజూ భూగోళం చుట్టబెట్టి వస్తున్నాడు. లంచి న్యూయార్క్‌లో చేస్తాడు. రాత్రి టోకియోలో పడుకుంటాడు. ఉదయం బొంబాయిలో వాల్తాడు. వాడి 'గతి' వాడికి వందకోట్లే ఉన్నాయి. వాడు మనస్తాపంతో ఉంటాడు. వాడికి వెయ్యి కోట్లు చెయ్యాలని బలీయమైన వాంఛవుంది. తప్పకుండా ఆ 'గతే' వాడికి పడుతుంది! సమాజంలో ఆర్థిక అసమానత ఆ విధంగా వుంది! దీనికి ప్రజలందరికీ వర్తింపజేస్తే వాళ్ళ 'స్థితి' ఏమిటి? దారిద్ర్యరేఖకు దిగువ నూటికి యాభైఐదు మంది వున్నారు. దారిద్ర్యరేఖపై ఎందురున్నారు? ఆ లెక్క ఎవరూ చెప్పలేదు. ఓపక్క మహదైశ్వర్యమూ ఇంకొకపక్క మహాదారిద్ర్యం.

అందరి ధ్యేయం సోషలిస్టు సమాజ నిర్మాణమే. ఆర్థిక అసమానత తొలగించడమే. వర్తమానంలో ప్రజల 'స్థితి' బాగులేదు. 'గతి'అనగా భవిష్యత్తు? దీనిని ప్రజలే ముందుకు తీసుకుపోయి వాళ్ళ హక్కులు వాళ్ళు సంపాదించుకోవాలి. ప్రజలు దాన్ని గమనంలో పెట్టి కృతకృత్యులు కావాలి. ప్రజలే నాయకత్వం వహించాలి. సామాజికమైన మార్పులన్నీ చేపట్టాలి. ఈ రాజ్యం ప్రజలది.

- 2-1-1997 - విశాలాంధ్ర

# 6. గురజాడ 'కన్యాశుల్కం'

1870 సంవత్సరంలో 'వ్యవహారధర్మ బోధిని' అనే నాటకాన్ని విజయనగరంలో వేశారు. కందుకూరి వీరేశలింగంగారు వ్యావహారిక భాషలో ఈ నాటకాన్ని రాశారు. ఆనాటికి బ్రిటిషు (ఇంగ్లాండు దేశంతో కలుపుకొని) సామ్రాజ్యవాద దేశంలో మొట్టమొదట వాడుకభాషలో ప్రదర్శించిన నాటకం అది. ఆ తర్వాత 1892లో విజయనగరం పెద్ద చెరువు పక్కనున్న డాబాతోటలో ఒక నాటకశాల వుండేది. ఆనందగజపతిరాజులుగారిది అది. ఆ నాటకశాలలో వారు సంస్కృత నాటకాలు వేయించేవారు. నటులకి జీతాలిచ్చి ఆయన ప్రత్యేకించి సంస్కృత నాటక వికాసానికి ఎనలేని కృషి చేశారు. అందులోనే 1892లో 'కన్యాశుల్కం' నాటకం వేశారు. ఈ కన్యాశుల్కాన్ని ఆనందగజపతిరాజులుంగారు అంకితం పుచ్చుకున్నారు. అది సామాన్యమయిన విషయం కాదు. ఎందుకంటే గురజాడ నాటకం (కన్యాశుల్కం ఆడే) నాటికి ఇబ్సన్ నాటకాలు ఇంగ్లీషులోకి అనువాదం కాలేదు. బెర్నార్డ్‌షా 1900 తర్వాత ప్రత్యేకించి అనువాదం చేశారు. 'ది క్వింట్‌సెన్స్ ఆఫ్ ఇబ్సనిజమ్ The Quintessence of Ibsenism' అనే పుస్తకం రాశారు. దీనికి వారసులు ఎవరంటే బెర్నార్డ్‌షా, గురజాడ, ఆంటన్ చెహూవ్. ప్రధానమయిన ముగ్గురు పేర్లు చెప్పాను. ఆ ముగ్గురు(లో) సరసన గురజాడ అప్పారావు ఒకరని మనం జ్ఞాపకం వుంచుకోవాలి. దానికి ఆయన వారసుడని మనం తెలుసుకోవాలి.

అయితే ఈ నాటకాన్ని (కన్యాశుల్కాన్ని) 1892లో ఆయన యిక్కడ (విజయనగరంలో) డాబాతోటలో ప్రదర్శించినపుడు బెర్నార్డ్‌షా తన నాటకాన్ని ప్రదర్శించలేదు. నాటకాలు వ్రాశారు గాని లీగల్‌గానో, టెక్నికల్‌గానో ఏవో ఇబ్బందులొచ్చి లండన్‌లో ప్రదర్శించలేదు. అలాగే ఆంటన్ చెహోవ్ నాటకాలు

వ్రాశారు కానీ 1897 దాకా ప్రదర్శించలేదు. ఆయన (ఆనందగజపతిరాజులుంగారు) మాములు పండితుడు కాదు. ఈ వ్యావహారిక భాషా ఉద్యమాన్ని ఆయన ఆమోదించి ('కన్యాశుల్కం'నాటకాన్ని) అంకితం తీసుకున్నారు. అయితే గురజాడ 'కన్యాశుల్కం' దేనికి వారసత్వం వహించివుంది? అన్నపుడు పాశ్చాత్య దేశాలలో ఆ రోజుల్లో 19వ శతాబ్దంలో ఒక పెద్ద ఉద్యమాన్ని ప్రారంభించారు. అది వాస్తవికవాద ఉద్యమం.దానికి నాటకాలలో మూలపురుషుడు ఇబ్సన్ మహాశయుడు. నార్వే దేశస్తుడు. ఇబ్సన్ నాటకాలు 1897కి పూర్వం (పది సంవత్సరాలు ముందు) ఆడబడ్డాయి. ఆ నాటకాలకి యిక్కడ, పాశ్చాత్య దేశాలలో, ఆ పద్ధతిలో నాటకాలులరాయడానికి ప్రయత్నిస్తున్న వాళ్లలో బెర్నార్డ్‌షా ఒకరు, ఈ తెలుగుదేశంలో గురజాడ అప్పారావు ఒకరు. అందుకని దానికి ఆయన (గురజాడ) వారసుడన్న సంగతి చాలా మందికి తెలీదు. 900 సంవత్సరాల పాటు నన్నయ నాటినించి వున్నటువంటి తెలుగుసాహిత్యాన్ని (గురజాడ) మార్చివేశాడు. అలాగ్గానే 900 సంవత్సరాలనించి వ్రాస్తున్న తెలుగుభాషను మార్చివేశాడు.

(ఆకాశవాణి, విశాఖపట్నం-1992 ఆగస్టు)
ప్రజాసాహితి, జనవరి 2002

# 7. జ్ఞాపకాలు

శ్రీమతి అన్నపూర్ణాదేవిగారు మంచి రంగస్థల నటీమణులు. శ్రీ బళ్లారి రాఘవాచారిగారితో నటించి బహుసమర్థురాలని ప్రశంసలు అందుకున్నారు. వారి నటనాకౌశల్యం నేనెరగను. వినడం విన్నాను. బహుశా 1944లో చైనాబజారు రోడ్డంట మిత్రులు శ్రీ కొడవటిగంటికుటుంబరావుగారూ నేనూ నడుచుకుపోతూవుంటే ఎదురుగా శ్రీమతి అన్నపూర్ణాదేవిగారు, వారి శ్రీవారు ఎదురైనారు. కుటుంబరావుగారు మంచి కథకుడుగా నన్ను పరిచయం చేశారు. వారిని నాకూ పరిచయం చేశారు. బజారంట చిన్నచిన్న సరుకులు శ్రీమతిగారు కొనుక్కుంటూవుంటే, వారితోపాటు మేమూ బజారుచేసి ఓ పెద్ద కాఫీ హోటల్లో ప్రవేశించాము. లోపల ఖాళీగా వున్నచోట టేబులు చుట్టూ కూర్చొని గంటకి పైగా కాలక్షేపం చేశాం, అదీ ఇదీ తింటూ.

శ్రీమతి అన్నపూర్ణాదేవిగారు గలగలా మాట్లాడే మనిషి. మనవాళ్లు దాన్నే గచ్చపొదలా మాట్లాడడం అంటారు. వారు కాకినాడ నుంచి వచ్చేరని చెప్పిన కారణంచేత, గోదావరి మండలంలో గుక్కతిప్పకుండా మాట్లాడే ఆడవాళ్లు కావలసినందర్ని ఎరిగినవాడ్నయిన కారణంచేత నేను ఆశ్చర్యపడలేదు. అది యుద్ధకాలం. యుద్ధనిధికినాటకాలు వేయించి ప్రభుత్వోద్యోగులు డబ్బు వసూలు చేసేవారు. తత్సంబంధమైననాటకాలు శ్రీమతి అన్నపూర్ణాదేవిగారు అప్పట్లో వేస్తున్నారు. నాబోటిగాళ్ళకది ఇష్టమైనది కాదు. అదే విధమైన నాటకాలు శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు "నటాలి" అనే పేరుతో ప్రభుత్వ సహాయంతో నాటకాలు ఆడించేవారు. అదీనాకు ఆమోదయోగ్యంగా వుండేది గాదు.

శ్రీమతి అన్నపూర్ణాదేవిగారు ఉత్తరాంధ్ర ప్రాంతంలో-అనగా ఇప్పటి శ్రీకాకుళం,విజయనగర ప్రాంతాల్లో పలుచోట్ల నాటకాలు ప్రదర్శించి తిరిగి వచ్చారు.

ఇంకా ధారావాహికంగా ఆవిడ ఆ ప్రాంతపు మనుషుల్ని, వారి భాషని విమర్శించడం ప్రారంభించగానే ఆ ధోరణిని మానిపించడానికి కుటుంబరావుగారు ప్రయత్నించారు. ఆయన తొడమీద గోకి, ఆయనని వారించి, 'చెప్పండమ్మా, చాలా బాగుంది' అని ఆవిడచేత సుదీర్ఘంగా చెప్పించాను. ఆవిడ ఆప్రాంతపు మనుషులు వుత్త "ఎడ్డి"వారని, వారిభాష పరమ "ఎడ్డి"గా వుంటుందని, సోదాహరణంగా శెలవిచ్చారు. అక్కడ మనుషుల మధ్యవుండి వారితో కొద్దిరోజులు కలిసిమెలిసి తిరిగి ఆ అభిప్రాయాలకు ఆవిడ సహజంగా వచ్చింది. వారు చెప్పిందంతా అవహేళనే. నేను శ్రీకాకుళంలో పుట్టిన వాడ్ని, విజయనగర నివాసిని. ఆవిడ "ఎద్దేవా" చేసిందంతా మమ్మల్ని, మా భాషని. కుటుంబరావుగారు చాలా ఇబ్బందిలో పడ్డారని ఆయనముఖ కవళికలు చెబుతూనే వున్నాయి.

ఇది నాలుగు దశాబ్దాల కవతలమాట గదా! ఈనాడే ఒక మాండలీకాన్ని ఇతర మండలాలవారు "ఎద్దేవా" చేసే స్థితిలో వున్నారు.దేశం నలుమూలలా తిరిగి విశాలమైన దృక్పథం, ప్రాంతీయ భాషల్లో వున్న సజీవమైన యాస, జీవనం ఆనాడు గ్రహించగలగడం కష్టమే. ఆవిడ చెప్పవలసిందంతా చెప్పేసింతర్వాత ఆవిడ మళ్ళా ఆ విషయంలోకీ, ఈ విషయంలోకీ గలగలా ప్రవేశించడం మొదలెట్టింది. ఆవిడ వాక్ప్రవాహానికి కాస్తా అడ్డుకట్ట వేసి ఆవిణ్ణి ఓచిన్న ప్రశ్నవేశాను. నేనా ప్రశ్న వెయ్యడం ఆవిడకి చిన్నబుచ్చుకున్నంత అయింది. నేను మరేం అడగలేదు. "అమ్మా, మీరు కన్యాశుల్కం ఎప్పుడైనా చదివారా?"అని మాత్రం అడిగాను. ఆవిడ కన్యాశుల్కం చదవడం ఏమీ, ఇంచుమించు కంఠస్తంగా వొచ్చేమో! ఆవిడ కన్యాశుల్కంలో పడిపోయారు. అందులో కొన్ని సన్నివేశాలు ఆవిడ వివరిస్తూ నాచేత నవ్వించారు. నవ్వక తప్పలేదు. కన్యాశుల్కంలో ఎవరు ఏది చెప్పినా జ్ఞాపకం వస్తేచాలు, వారు నవ్వుతూనే చెబుతారు. మనం నవ్వక తప్పదు. అందులో ఆ రసం వుంది. అందులో అవహేళన కూడావుంది. అది అర్ధం చేసుకోగలిగిన వాళ్లకి మరీ నవ్వుపుట్టిస్తుంది.

బహుశా ఆవిడ కన్యాశుల్కంలో ఒక పాత్ర-బహుశా మధురవాణి వేషంవేసి వుండవచ్చు. అప్పుడు, "అమ్మా! మీరిందాక 'ఎడ్డి'దన్నారే,కన్యాశుల్కంలో వున్న భాషంతా అదే!" అని చెప్పాను. బహుశా ఆవిడ నాలికకరుచుకొని వుండవచ్చు. నోరు జారిపోయిన తరువాత నాలిక కరుచుకుంటే మాత్రం ప్రయోజనం ఏమిటి? పూజ్యుడు శ్రీమల్లాది రామకృష్ణశాస్త్రిగారు 'కృష్ణాతీరం' నవలలో ఓ స్త్రీపాత్ర చేత

"మేమెక్కడివెళ్లినా పెద్దపీట వేయించుకుంటాం. మాది కృష్ణాతీరం" అని అనిపించారు. ఇందులో ప్రాంతీయ అహంకారం తప్పకుండా వుంది. ఆ మాటకు ముందు "దుర్" అనే విశేషణంగా పెట్టినా పొరపాటు లేదు. దురహంకారం! పండిత ప్రకాండుల కికాణాచి అయిన కోనసీమ, విజయనగర ప్రాంతపు - ఆడబడుచు పెద్దపీట ఖర్మం ఏం? మేం సింహాసనమే వేయించుకుంటాం! అని అహం భావించవచ్చు.

ఆదివారం ఆంధ్రజ్యోతి
అక్టోబరు 26, 1986

# 8. అతిథి సంపాదకీయం

మనిషిలో మంచీ చెడూ అంతర్గతంగా ఉంటాయి. మనమంతా నాగరికుల క్రింద లెక్క. మనలో ఉన్న చెడుని అణచిపెట్టి, పైకి ఉబకకుండా, మనం చాలా మంచివాళ్లమనే భ్రాంతిని సమాజంలో కలుగ చేస్తూ ఉంటాం.

చెడుని 'చెడు' అని మనకి తెలుసు. పత్రికలు మనలో ఉన్న ఈ చెడుని ప్రకటింపజేసి తద్వారా 'సొమ్ము' చేసుకుంటున్నాయి. మనకు ప్రబలమైన కావేశం ఉన్నవారిని చంపెయ్యాలన్నంత ఆగ్రహం అంతర్గతంగా ఉంటుంది. క్రిమినల్ స్వభావం. జీవితంలో ఆ పని ఎంతమాత్రం చెయ్యం. సామాన్యుడు వాస్తవంగా మంచి పక్షానికే మొగ్గుతాడు. చెడుస్వభావాన్ని చంపుకోవడానికి ప్రయత్నిస్తాడు. కథలో చెడు కనబడితే ఆసక్తిగా చదువుతాం. తద్వారా ఉపశమనంబొందుతాం, కానీ నాగరికులం.

మంచిగా ఉన్నట్టు ప్రవర్తిస్తాం గదా, అలాగే మంచికి తప్పకుండా స్పందిస్తాం. ఈనాడు చెడుప్రవృత్తి కాక మంచి ప్రవృత్తినే తీసుకొని కొన్ని పత్రికలూ రచనలు వేస్తున్నాయి. అనాదిగా వాటికి చలామణి బాగానే ఉంది. ఉదాహరణకు ఆంధ్రప్రభ వారపత్రిక. అశ్లీలము, సెక్సుపరమైన తదితర జిమిక్ రచనలు లేకుండానే పాఠకుల మన్ననలు అందుకుంటున్నవి. ఈనాడు పత్రికలలో పడుతున్న కథలు పాఠకులు చదివి బాగులేవని తమకు తాము నిర్ణయించుకొని అవతల పారేస్తున్నారు. తిరిగి చదవడం లేదు. కథల పుస్తకాలు చెల్లవని ఒక అపప్రథ ఉంది. కానీ కథలు మాత్రమే వేస్తూ నడుపుతున్న "విపుల"కు పాఠకుల ఆమోదం ఉంది. దీనికి కారణం బహుభాషల్నించీ సేకరించి కాస్త మంచి కథల్ని వేయడమే. విపుల నెలనెలా చెల్లుతున్న కథల పుస్తకం.

పాఠకులలో 'స్థాయి' పెరిగినవారున్నారు. వారికి ఉత్తమ రచనల అవసరం ఉంది. పత్రికలు వారి దృష్టితో నడిపితే పాఠకలోకం కొని తప్పకుండా చదువుతారు. మార్పు మనిషికి లక్షణం. ఉత్తమమైన సాహిత్యం చదివితే మనిషిలో సముచితమైన మార్పువస్తుంది.

చెడుమీద ఆధారపడి చెడును మాత్రమే ప్రోత్సహిస్తున్న పత్రికలు, పత్రికల సామాజిక బాధ్యతని విస్మరిస్తున్నాయి. మంచి కన్నా చెడు వెంటనే పట్టుకొంటుంది. అందుచేత వీళ్లు సమాజంలో నేరప్రవృత్తినీ, సెక్స్‌వైపరీత్యాల్ని, అశాస్త్రీయ దృక్పథాన్ని, మూఢనమ్మకాలని పెంచుతున్నారు. మంచిని పెంచినా ప్రజలు ఆమోదిస్తారని వీళ్లకు తెలియకుండా ఉంది. పత్రికలన్నీ మంచిని పెంచితే ప్రజల్లో మంచి ప్రవృత్తి పెరుగుతుంది. చట్టరీత్యా పత్రికలకు స్వేచ్ఛ ఉంది. ఆ స్వేచ్ఛని దుర్వినియోగం చేస్తున్నారు. మంచిని పెంచుతున్న పత్రికలు కొన్ని ఉండటం శ్రేయస్కరంగా ఉంది. వాటి ప్రభావం వల్ల మిగతావి సన్మార్గానికి వస్తాయని ఆశించవచ్చు.

- జ్యోతి మాసపత్రిక జూలై 1989

